కవితాసమితి గ్ర[illegible]వళి 3*





# ఉత్కలపతనము







మూల్యం 2 రూపాయిలు

పు॥ పండా అప్పలస్వామి.

కవితాసమితి.

# విన్నపము

'ఉత్కల పతనము' మా సమితి గ్రంథావళిలో మూఁడవది. ఇది సమితి కార్యదర్శి శ్రీయుత పురిపండా అప్పలస్వామిగారు అశ్వినీ కుమార ఘోషు విరచితమగు "కొళాపహాడ్" అను ఉత్కల నాటకమునకు సల్పిన అనువాదము. అప్పలస్వామిగారు ఆంధ్ర పాఠక లోకమునకు క్రొత్తవారుకారు. ఇతర భాషలలోని రసవంతములగు నాటకములు తెనుఁగులోనికి అనువదించు ప్రయత్నము చేసినందులకు కృతికర్తగారు తెనుఁగువారి యభినందనమునకు పాత్రులు.

కవితాసమితి కార్యదర్శిగా ఉండి ఈయన చేయు భాషాసేవ ఎంతయు ప్రశంసనీయము.

ఈ నాటకము వలయుచోట్ల మూలముతో గూడ గ్రంథకర్తగారు చదివి వినిపింపఁగా వింటిని; రసవంతమగుటచే నామదిని రంజింపఁగలిగె.

మాతృభాషాభిమానులగు చదువరులకు ఈకృతి సంతసము చేకూర్చి, కర్తకు సత్కీర్తి సంపాదించి, పరాత్పరుని కరుణచే తానును ధన్యమగుఁగాక.

ఈ గ్రంథ ముద్రణవ్యయము భరించిన శ్రీయుత కొ. వెంకటరత్నముగారు స్తుత్యర్హులు.

ది ౧.౯-౧౯౩౧
విశాఖపట్టణము.

మారేపల్లి రామచంద్రశాస్త్రి,
అధ్యక్షుఁడు, కవితాసమితి.

# ఇందలి పాత్రములు

## పురుషులు

అక్బరు ... మొగలు సామ్రాట్టు
మానసింహుఁడు ... మొగలు ప్రధాన సేనాపతి
కతలుఖాను ... మొగలు మనసబుదారు
వీరబలుఁడు ... మొగలు విదూషకుఁడు
తాన్‌సేను ... మొగలు సంగీతాచార్యుఁడు
ముకుందదేవు ... ఉత్కళ రాజు
రామచంద్రభంజు ... ఉత్కల సామంతరాజు
శిఖిమహాపాత్రుఁడు }
మొనాయిమహాపాత్రుఁడు } ఉత్కల సైనిక కర్మచారులు
సులేమాను ... వంగదేశపు నవాబు
కలాపహాడ్డు ... సులేమాను జామాత, సేనాపతి
రహమత్ఖాను ... వంగదేశపు సహాయ సేనాపతి
అబ్దుల్లా ... నవాబు భ్రాతృపుత్రుఁడు
ప్రసూనుఁడు ... పురుష వేషమున తిలోత్తమ

## స్త్రీలు

ఇందుమతి ... ఉత్కల రాజ్ఞి
దులియా ... సులేమాను భ్రాతృ పుత్రిక, కలాపహాడ్డు ద్వితీయపత్ని
తిలోత్తమ ... కలాపహాడ్డు ప్రథమపత్ని
వృద్ధ ... కలాపహాడ్డు తల్లి
ఫిరోజ ... దులియా నెచ్చెలి



పురిపండా అప్పలస్వామి.



ఓం

# ఉత్కలపతనము.

## ప్రథమాంకము.

### ఢిల్లీ రాజసభ.

[సింహాసనాసీనుఁడగు అక్బరుపాదుషాయును, సముచితాసీను లగు వీరబల, కతలుఖానులును, మానసింహుఁడును, పరివేశింతురు.]

అక్బ:— అభిమానధన ! ఖాన్ సాహెబ్ ! వృథాభిమానమును పరిత్యజింపుము.

వీర:— కాని, జహాఁ పనాహ్ ! జ్ఞాపకముంచుకొనుఁడు. మా రాధికమాత్రము కఠినాంగి. మరియు కఠినమతి.

( అందఱు నవ్వెదరు. )

కత:— వీరబలా ! ఇది రంగస్థలముకాదు. సభాస్థలము.

వీర:— నే నిది రణస్థల మని యూహించి యుంటిని. ఎట్లయినను ఖాన్ సాహెబుగారూ ! మీరు మహోపకారమే యొనర్చిరి.

మీరు లేకుండిన నేఁడు నే నిట్లుపాఱివచ్చి చక్రవర్తి సమ్ముఖమున శిరమెత్తి నిలువఁ గలుఁగుదునా ?

అక్బ:— వీరబలా ! మేము ఉత్కల దేశాక్రమణమున కరిగి చూచితిమి. దాని జయించుట మాకు నితాంత దుస్సాధ్యమని కన్పట్టిన తోడనే చేయునది లేక మఱలి పోయితిమి. ఎంతమాత్రమును కతలుఖాన్ స్వబుద్ధి ప్రేరణచే మరలి వచ్చియుండలేదు. తన ప్రభు నాదేశమే పాలించియున్నాఁడు. ఖాన్‌సాహెబ్ ! ఈపట్ల నభిమాన మూనుట వీరోచిత కృత్యమా !

కత:— జహాఁపనాహ్ ! ఈ సేవకుఁడు తనకొఱ కభిమానము వహించుటలేదు. ఎవ్వని స్వచ్ఛ కీర్తిచంద్రిక నేఁటివఱకును నిష్కళంక ప్రభావిరాజితమో, ఎవ్వని ప్రశస్తాభిధేయము నేఁటివరకును విశ్వవ్యాప్తమో, అట్టి భారతచక్రవర్తికొఱకే.

అక్బ:— ప్రభుభక్త ! ఖాన్‌సాహెబ్ ! నేఁటివఱకును నా భావమును తెలిసికొనలేక పోయితివా ? నేఁటివఱకును నన్ను గుర్తింపనే లేకపోయితివా ?

కత:— జహాఁపనాహ్ ! చక్కఁగ తెలిసికొనియున్నాఁడను. చక్కఁగ గుర్తించియున్నాఁడను. మీరు కర్కశ శైలావృత నీల జలోత్ససదృశులరు. మీ హృదయము కఠిన త్వచావృత తరళ పయః పూర్ణ పాత్రతుల్యము. చూచుటకు శార్దూల సన్నిభ భయంకరులరు. గుర్తించిన దుగ్ధ పోష్య శిశువుకంటెను దుర్బలులరు. మీరు బాహ్యమున ప్రచండ భాను కిరణ సదృశ తక్షదీప్తి ప్రకాశింపఁజేయుదురు. కాని అంతరంగమున సుధామయ శశాంక జ్యోత్స్నా నిభ శీతలత్వమునే వెదచల్లుదురు.

వీర:— ఖాన్‌సాహెబూ ! ఇవెల్లయును సామ్రాట్టునకు దోషములే కదా ! అనల సంయుతమగు వస్తువు శీతల జల సదృశముగ

దైవము మాత్ర మెట్లు చేయఁగలఁడు ? ఇది మీవుల నాశ్చర్య మగు విషయమే !

కత— విదూషకా ! నిశ్చయమే. ఇది మీవుల నాశ్చర్యకరమగువిష యమే ? రాజా ! ఇది విదూషకుని పరిహాస వాక్యముకాదు.

అక్బ— (మానసింహునుద్దేశించి) వాస్తవముగ ఖాన్‌సాహెబు కడు అవమానము ననుభవించుచున్నాఁడు.

మాన— ప్రథమమున ముకుందదేవుని పరాజయ మొనర్చుటకు ఖాన్‌సాహెబూహించియుండెను. (స్వగతమున) "ముకుంద దేవా ! నీ క్షత్త్రియ శోణితము ధన్యమైనది." (దీర్ఘనిశ్వాస మువీడి (ప్రకాశముగ) పిమ్మట సార్వభౌముని యిచ్ఛానుయా యిమై వారితో మైత్రి నెఱపి యుండును.

కత:— రెండవది నే నూహించియుండలేదు. ఏమహాహృదయుఁడగు రాజు సస్యశ్యామలయు, రత్నాకర విధౌతచరణయు, నానా విధకారుకార్య విమండితయు, లక్ష్మీకుబేరుల నిత్య లీలా భూమియునగు ఉత్కలమును అవహేళనమున బరిత్యజింపఁ గలఁడు ? దృప్తుఁడగు తదధీశుని వీర దర్పమును చూర్ణకృత మొనర్పక ఏ విజయోల్లాసియగు వీరుఁడు సహజముగ శాంతి వహింపఁగలఁడు ?

( ఎల్లరును అక్బరువంకఁజూతురు. )

అక్బ:— సేనాధిపా ! ఇదియా రాజధర్మము ? ఇదియా వీరుని వీరత్వము ?

కత:— సార్వభౌములు రాజనీతిజ్ఞులగు పండితులు. ఇట్టి మీ సమక్ష మున నావంటి అజ్ఞుఁడేమి వాక్రువ్వఁగలఁడు ? అయినను, ఇది మాత్రము విన్నవింతును. రాజోత్తముని స్వధర్మము రాజ్య మును వృద్ధియొనర్చుటకాదా ? వీరుని వీరత్వము శత్రు దమనమునకు గాదా ?

సభాసదులు— సత్యము. సేనాధిపా! సరిగఁ బల్కితివి.

అక్బ—సభాసదులారా! ఇదియా రాజధర్మము? కతలుఖాన్ ఇదియా వీరుని వీరత్వము? అట్లైన, ఆ రాజధర్మమునకు ధిక్కారమగుఁగాక! ప్రతివేశియో, దూరదేశియో యగు ధరాధిపుని ధనరత్నములను, సుఖ శాంతి భోగములను నీచుఁడగు తస్కరునివలె నపహరించి నిజ స్వార్థ సుఖ విధానమును ప్రదర్శించు నా రాజధర్మమునకును, రోగులును శోకార్తులును, దీనులును దుఃఖజీవులును, జీర్ణహృదయులును, శీర్ణ దేహులు నగు వారి విమోచనార్థము లవంతయును వినియోగింపఁబడక దుర్బలునియో సబలునియో బలవీర్య వినాశములయందు పూర్ణముగ వ్యయమగుచున్న యా వీరుని వీరత్వమునకును మఱి యొకపరి ధిక్కారమొనర్చుచున్నాను. సభాస్తారులారా! వీరవరులారా! వినుఁడు!! నా పితృపితామహులు నా భోగార్థమిపుడు నాకర్పించిపోయిన యీ అమూల్యసంపత్తి నీ విధమున వృద్ధియొనర్చి నా రాజధర్మమును ప్రదర్శింప నోల్లను. రాజభక్తియుతులగు నా ప్రజలు విశ్వాస పూరితహృదయులై నాకు సమర్పణమొనర్చిన ఈ పవిత్ర సింహాసనమును శత్రురక్తమున రంజిత మొనర్చి వీరత్వమును కనఁబఱుప నిచ్చగింపను. శత్రు మిత్రుల పవిత్ర ప్రేమ సుధాప్లావితులను కావింతును. ప్రజా మండలిని సంతాన తుల్యముగ సుఖ శాంతి తరంగ డోలికల నోలలాడింతును.

అందఱు— ధన్యుఁడు! ధన్యుఁడు!! అక్బరుపాదుషా ధన్యుఁడు !

మాన— (స్వగతము) ఇందుచేతనే ఈ హతభాగ్య హిందువుఁడును నిజవిషయమున ధన్యుడని ఊహించుచున్నాఁడు. ఉపయుక్తుఁడగు వీరుని పూజింప గలుగుటయే వీరుని ప్రధానసౌఖ్యము ఉపయుక్తుఁడగు ప్రభు వతంసుని సేవింపఁగలుగుటయే ప్రజా వర్గమునకు ప్రధాన భాగ్యము.

(తార్ సేను ప్రవేశము.)

గీతము.

తార్ సేన్— జయము ! భారతాధీశ్వర ! జయము ! జయము !
జయము ! మొగలుభూషణా ! జయము జయము
జయము కరుణాజలధి ! నీకు జయము జయము
జయము శాంతి నికేతనా ! జయము జయము
అస్త్ర ఘాతమ్ము లేకయే అరికులమ్ము,
రక్తపాతమ్ము లేకయే రాజ్యములను,
కేవలమ్ము కృపాస్ఫూర్తి గెలువఁజాలి
విశ్వ విఖ్యాతిఁగాంచిన ! విబుధమూర్తి!
జయమగును నీకు నిత్యమ్ము జయము జయము
త్వన్మతమ్మున జాతి భేదములు లేవు,
త్వన్మతమ్మున మత విభేదములు లేవు,
అన్నదమ్ములు హిందూమహమ్మదీయు
లెల్లరును నీకుసువిశాల హృదయసీమ
న్యాయమార్గమ్మునను శాసనమ్మొనర్చి,
ధర్మమార్గమ్మునను ప్రజాతతులఁబ్రోచి,
దుఃఖజీవులకష్టమ్ము తొలఁగఁద్రోచి,
శాంతి చంద్రిక లిలను విస్తరిలఁజేసి
మర్త్యభూమిని స్వర్గధామము నొనర్చి
విశ్వవిఖ్యాతిఁ గాంచిన విబుధమూర్తి !
భువనకళ్యాణకర్త ! మోపుణ్యమూర్తి !
జయమగును నీకు నిత్యమ్ము జయము జయము.

అక్బ—రమ్మ! మియ్యాఁ! తార్ సేన్! నావసంత కోకిలమా!

తార్—ఖుదావంద్! ఈభృత్యుఁడు కేవలము వసంతమున మాత్రమే కోకిలమా? తదితరసమయములందు కాఁడా?

అక్బ— కాదు. కాదు. తాన్ సేన్ ! అదికాదు నే జెప్పునది. నీవు వసంతమున కనుధావన మొనర్పఁజనదు. వసంతమే నిన్నను ధావన మొనర్చును. ఎంతకాలము నీవు నా నికటమున నుపస్థితుఁడవో అంతకాలమును వసంతము నాపట్ల నవసాన మొందుట అసంభవము. ప్రస్రవణమాత్రమున శుష్కశ్రవణద్వయము రసాప్లుత మొనరించి ఉత్సాహమును నవతేజమున నుద్భాసితము సల్పఁజాలు నీ స్వర్గీయ సంగీత గరిమ మెంత మధురము! ఎంతపవిత్రతమము!! నేను శక్తి విహీనుఁడ నగు నపుడు నాకు నవ శక్తినొసఁగునదియు నేను జ్ఞానవిహీనుఁడ నగు నపుడు నాకు నూతన జ్ఞానమును ప్రసాదించునదియు నే నంధుఁడనై పోవు నపుడు నాకు దివ్యదృష్టినొసఁగునదియు నీ సంగీతమే యని నేను గుర్తించుచున్నాను.

తాన్:— ఈ వినయవశమున నె కదా భారత సార్వభౌముఁడు నేఁడింత యుచ్ఛస్థానమున ప్రతిష్ఠింపఁబడుట. ఈ మహానుభావత్వమున నెకదా సామ్రాట్టు నేఁడింత పూజ్యతముఁడై విలసిల్లుట.

అక్బ:— ఇప్పటికి సభ ముగిసినది. కతలుఖాన్ (దిగివచ్చి) నిన్ను నస్వస్థునిగావించితి నని తలంచెదను.

కత:— (స్వ) హా ! ముకుందదేవా ! (ప్రకాశముగ) ఖుదావంద్ ! ఈ సేవకుని ప్రలాపముల మన్నించెదరుగాక !

(అందఱు గమనోన్ముఖులగుతఱి సైనికుఁడు రోఁజుచు ప్రవేశించును)

సైని:— సర్వనాశము ! సర్వనాశము !!

మాన:— విషయమేమి సైనికా !

సైని:— సులేమాను సుల్తాను విద్రోహ మొనర్చినాఁడు.

మాన:— సులేమానా ?

అక్బ:— రాజా! ఇందాశ్చర్యమేమియు లేదు. ఇట్లు తప్పక సంభవించునని నేను ముందుగనే భావించియుంటిని

కత:— జహాంపనాహ్! ఈ దాసుని మన్నించి ఇంచుక ఊహింపుడు. దయాపరవశులై తాము ప్రాణభిక్షయు రాజ్యభిక్షయు నొసంగియున్న ఆశ్రితుఁడగు నవాబు కదా ఈతడు!

అక్బ—ఖాన్ సాహెబ్! నీ ప్రశ్నార్థమును నేను గ్రహింపఁగలిఁగితిని. ముకుందదేవుకూడా ఇట్లే ఒకప్పుడు విద్రోహ మొనర్ప వచ్చుననికదా నీ యుద్దేశము?

కత—చిత్తము.

అక్బ—అట్లయిన మంచి సుయోగమే ఉపస్థితమైయున్నది. ముకుందదేవున కీవిద్రోహము నడంపని మంత్ర మొనర్చెదముగాక! ఆతని స్నేహ పరీక్ష ఈ విధమున సౌనర్తముగాక!

కత—యా! అల్లా!

అక్బ—కతలుఖాన్! నీవుకూడ సహస్రాధిక మొగలుసైన్యమునుకొని ముకుందదేవుని సాహాయ్యార్థము యాత్ర సలుపవలయును. కారణమేమనిన, నవాబు తన జామాతయగు కళాపహాడ్ బలముపై నిర్భరుఁడై ఈ విద్రోహమునకు తలపడెనని నాదృఢ విశ్వాసము.

కత— ఇది నిశ్చయమె. (స్వగతము) కాని, నేను ముకుందదేవునకు సహకారిని కావలయును! ఇంత నీచపదమా! సరే. చూచెదను గాక! ఎవరి సన్మానమెంతదిరెూ! (ప్రస్థానము.)

అక్బ— రాజాసాహెబ్! ముకుందదేవుని సమక్షమునకు దూతఁ పంప శీఘ్రము మాయుత్తపలుపుము. రమ్ము! తాన్ సేన్! విదూషకా! రమ్ము. (ప్రస్థానము.)

వీర:— దయచేయుఁడు జహాఁపనాహ్ ! మానభంజన యాత్రి ముగియకమున్నె కంస మారణ యాత్రారంభము ! "ఏకస్య దుఃఖస్య నయావదంతం, ఉపస్థితో౽యం వేదనాంతరో౽పి"

(ప్రస్థానము.)

---

## ద్వితీయ దృశ్యము.

రంగము:— కటకములోని బారవాటి దుర్గము. నవతల కక్ష్యము.
పరివేశము:— ముకుందదేవుఁడు, ఇందుమతిరాణి.

ముకు:— ప్రియా ! దుఃఖాంతమున సుఖమును, విరహాంతమున మిలనమును ఎంత మధురము ! ఎంత ఆనందకరము !

రాణి:— ఇది స్వర్గ భోగముకంటెను ఆనందకరము. సుధ కంటెను మధురతమము.

ముకు:— ప్రియా ! ఈ మాధుర్యమును ఈ ఆనందమును చిర స్థాయులగునా ?

రాణి:— ప్రియతమా ! ఇట్లు అమంగళమును పచించి ఏల నా శాంతిమయ జీవనమును ఉద్వేలిత మొనరించి వైచెదరు ! ప్రాణేశ్వరా !

ముకు:— ప్రేయసీ ! నా హృదయ మేలనో ఒక విధముగ శంకా సమన్విత మగుచున్నది. అది " ఇట్టిద " ని వ్యక్తీకరించుటకు నే నశక్తుఁడ నగుచున్నాను.

రాణి:— అదేమి ? ప్రాణవల్లభా !

ము:— నే ననుక్షణమును అనుభవించుచున్నాను. నాకర్ణ కుహ రముల నేదియో ఒక అవ్యక్త వ్యక్తి మర్మభేద్యముగ చెప్పి పోవుచున్నది. " ఇంతటి సౌఖ్యము, ఇంతటి ఆనందము,

మానవునెడ అసంభవము. ఇది ఎప్పుడును దీర్ఘకాల స్థాయి కానేరదు. ”

రాణి:— నేడు ఆకస్మికముగ ఇది యెట్టి అనుభూతి? ప్రాణేశ్వరా! ఆనందామృతమున ఆకస్మిక విషాదగరళము! నీల నభోగాత్రి మున ఆకస్మిక కృష్ణ ఘనరేఖ!! సువిమల పుణ్యవక్షమున ఆకస్మిక పాపకళంకము!!! హృదయేశ్వరా! జీవితేశ్వరా!

(ఆలింగనము.)

ముకు:— హృదయేశ్వరీ! స్థిరచిత్తవు కమ్ము. ఇది క్షణికమగు చిత్త చాంచల్యము మాత్రమే. భీతివిడుము. హృదయ దౌర్బల్య మున ఇట్టిది సహజము.

రాము:— కాదు. నాథా! ఇది మీ ఆశ్వాసనము మాత్రము. హిమవన్నగము కంటెను దృఢతరులును, ప్రశాంత సాగ రముకంటెను స్థిరతరులును అగు మీయెడ ఇట్టిచాంచల్యము, ఇట్టి దౌర్బల్యము క్షణికమైనను సామాన్య కారణమున సంభ వించునది కాదు. నిశ్చయముగ ఇది ఒక మహా విపదాగ మనమును సూచించుచున్నది. ఆగ్నేయగిరి ఉద్గిరణ పూర్వక ప్రకంపన మారంభించినది.

ముకు:— సఖీ! దుశ్చింతను పరిత్యజింపుము. భావించి చూడుము. వర్తమానమున మన మేవిషయమున శంకింప వలయును? ప్రబల ప్రతాపుఁడగు ఢిల్లీశ్వరుఁడు స్వతః ప్రవృత్తుఁడై మన తో మైత్రి స్థాపించియుండ మనకు భయ కారణమేది? ఉత్క లాక్రమణమున మొగలులు ఉత్కలుల బాహుశక్తి చవిచూచి పశ్చాత్పదులై యుండ మన కేక చింత ఏటికి?

రాణి:— మిమ్ముఁ బోలు పరాక్రమ శీలురు శత్రువుల కెన్నఁడైన సహ్యులగుదురా?

ముకు:— ఈ నీ శంక యథార్థమే. కాని, మొగలుభూషణము— ఆదర్శ సామ్రాట్టు—మానవుని పూజా సామాగ్రి— అగు అక్బరు మాత్రము శత్రువైనను, మిత్రుఁడైనను, వీరధర్మమును తెన్నుగ ఎఱుఁగు. ఆతఁడు మహత్త్వమును బాగుగ గుర్తెఱిగియున్నాఁడు. అట్టివాని యెడ వృథానుమాన మనుచితము.

రాణి:— అయిన—

ముకు:— (అడ్డువచ్చి) ప్రియతమా! **ఆవిషయ** మటుండనిమ్ము. చూడుమాఁదెస పశ్చిమ భానుని మధురహాస మెంత రామణీయకముగ నున్నదో! లోహిత ప్రకృతి ఎంత రామణీయకముగ శోభిల్లుచున్నదో!

రాణి:— అవును. నాథా! అంతియకాదు. వినుఁడు. చారణబాలికా బాలకుల మధురస్వరము.

(చారణ బాలికా బాలకులు గాన మొనర్చుచు నృత్యమును సలుపుచు ప్రవేశించి నిష్క్రమింతురు.)

(ఉభయులును ముగ్ధులై గీతము నాలింతురు.)

ము— (స్వ) ఈ గీతమునందలి భావము మిగుల చమత్కారము! మానవుని ప్రధానధర్మము కర్మము; మానవుని ఉత్కృష్టానందము ఆత్మాహుతి!

రా— ప్రియతమా! ఏమి భావించుచున్నారు?

ము— ఏమియు లేదు. ఈ గీతమునందలి భావము మిగుల చక్కనిది దానిని గూర్చియే తలంచుచున్నాను.

రా— ప్రకృతము సంధ్యాసమయ మాసన్నమైనది. లోనికి దయచేయుఁడు!

(దాసీ ప్రవేశము.)

దాసి—మహారాజా! ఢిల్లీనుండి దూత చనుదెంచి, అత్యవసరమగు కార్యము కలదని నుడువుచున్నాఁడు.

రాణి—అత్యవసర కార్యమా! ఢిల్లీనుండి దూతయా! హృదయేశ్వరా!

ము—స్థిరురాలవుకమ్ము సఖీ! విహ్వలత్వమునకు కారణమేమియును లేదు. మన ప్రధానధర్మము కర్మము. ఉత్కృష్టానందము ఆత్మాహుతి. (ప్రస్థానము.)

రా—ఇది యేమి నవీన భావము! ఆకస్మికముగ ఢిల్లీదూత వచ్చుటకు పనియేమి? మఱల నేమైన విగ్రహారంభమైనదా? ఏమి-వాస్తవముగ నా నాథుని దుశ్శంకయథార్థమైనదా?- ఈ సమాగమ సౌఖ్యము మఱల విరహవిషాదముగ పరిణమిల్లునాఏమి?—హా! దారుణవిధీ! ఇట్టిదేకాఁబోలు వీరపత్నీ సౌఖ్యము!—

(చారణ బాలికా బాలకులు పూర్వోక్తగీతమును పాడుచు ప్రవేశించి నిష్క్రమింతురు.)

ముకుం—(ప్రవేశించి) రమ్ము దేవ! నేఁ డత్యంతాహ్లాద దివసము. నన్ను వీరపరిచ్ఛద విభూషితు నొనరింపుము.

రాణి—ప్రాణేశ్వరా! ప్రాణేశ్వరా! ప్రియతమా! (ఆలింగనము.)

ము—దేవీ! వీరపత్నివయ్యును నీవింత దుర్బలహృదయవా? రాణీ! నీవు వీరబాలవు. వీర తేజమున ఉద్వేలితవుకమ్ము. వీరదర్పమున పులకితగాత్రవు కమ్ము. వీర రసార్ద్రభాషణముల నీనాథుని వీరత్వమును ఉద్వేజిత మొనర్పుము. మానవుని ప్రధానధర్మము కర్మము. ప్రధానసౌఖ్యము ఆత్మాహుతి.

రాణీ—ఆర్యపుత్రా! తెలిసికొంటిని. ప్రేమసంభాషణకాల మవసాన మందినది. కర్తవ్యకర్మము నెఱవేర్చు సమయ ముపస్థితమైనది.

సరియే- నేను భీతి పరిత్యజించితిని. నాసర్వచింతలునుప్రకృతము మాయమైనవి. మహారాజా! వచింపుఁడు దిల్లీవృత్తాంతమేమి?

ముకు—— వంగదేశపు నవాబు సులేమాన్ విద్రోహమొనర్చి యున్నాఁడు. దాని నడంప సార్వభౌముఁడు నాకాదేశించి యున్నాఁడు.

రా—— కాలవిలంబనమున నిఁక ప్రయోజనములేదు. ప్రకృతము చిద్విలాస సమయము తీర్ణమైనది. కర్మసమయమారంభమైనది. ఇట్టి సమయమున పతి నెట్లు సేవింపవలయు. నదియే ఆనతిండు. ప్రభూ!

ము—— (ఆలింగనపూర్వకముగ) ఇవియే వీరపత్నికి ఉపయుక్తభాషణములు. రమ్ము ప్రియతమా! మానవుని ప్రధాన ధర్మము కర్మము. మానవుని ప్రధానసౌఖ్యము ఆత్మాహుతి.

(ఉభయుల ప్రస్థానము.)

---

## తృతీయదృశ్యము.

(మంత్రిణాగృహము.)

(ప్రవేశము- అబ్దుల్, రహముత్ఖాన్.)

అబ్దు—— సేనాపతీ! నేనేమి వీరుఁడనుకానా? ఆహవమొనర్పఁ జేతకానివాఁడనా?

రహ—— నీవు షాజాదావు. నీవు వీరుఁడవు కాకుండిన ఇంకెవ్వఁడు వీరుఁడగును? నీవు రణమొనర్పఁజాలనిచో ఇంకెవ్వఁడొనర్పఁగలఁడు? నీవాదినమున ఒక్క చపేటమున ఒక మూషికము నంత మొందించితివికదా! నాఁడు శకుంతమును చంప నుద్యుక్తుండవై నీహస్తమునుకూడ కోసికొంటివికదా!

అబ్దు—— అది చాలకాలమునాఁటి వృత్తాంతము. నేఁటివఱకును జ్ఞప్తియున్నదా?

రహ— మఱచిపోదునా మఱి! ఇట్టి నీవంటి వానికీర్తి కృత్యముల జ్ఞప్తి యుంచుకొనని చో నింక వేని నుంచుకొనెదను ?

అబ్దు— నీవు స్వయముగ వీక్షించియున్నావుకదా! నాహస్తము తెగి పోయినపిమ్మట నెట్లు ధారలు కట్టి రక్తము స్రవించినదో! నే నపు డిసుమంతయిన లక్ష్యమొర్చితినా? ఇసుమంతైన నాదెస భ్రూక్షేప మొనర్చియుంటినా?

రహ— ఇసుమంత యననేల? ఏమియు లేదు. ఒక్కపెట్టున ముకుళిత నయనుఁడవై మూర్ఛాగతుఁడవై యూరకుంటివి.

అ— మఱి యింకొకఁడైయుండిన తత్క్షణమే మరణించియుండును.

రహ— మరణించుటతోడనె సరిపోవునా? ఆక్షణముననే పిశాచమై పోయియుండును.

అబ్దు— అట్లయిన సైన్యాధ్యక్షా! ఇట్టి వీరత్వము నాయందావిర్భవించి యుండఁగా ఇట్టి కాఫరునికి దులియానొసంగి మాపితృవ్యుఁడేల యుద్వాహ మొనర్పవలె?

రహ— కాని, దీనికొక కారణము కలదు. ఏమందువా? లోకమున స్త్రీ ప్రకృతి సహజముగ కోమల మైనది. అందున షాజాదిమ ణియు సుకోమలగాత్రి. అట్టి యెడనీ వంటివీరవతంసు నకామె నొసంగి షాదీ యొనర్చిన నామెయింక ప్రాణములనిల్పఁ జాలు నా! ఇది యూహించియే నవా బిట్లు ప్రవర్తింపవలసి వచ్చెను.

అబ్దు— (సానందుఁడై) అవును. సేనాధిపా! ఇది నిక్కము. దులియా నిక్కముగ నవ నవనీత విగ్రహము. కాని దులియానన్ను పిఱికివానిగ సంభాషించెడి దేమి ?

రహ:— నిను షాదీ చేసికొనవలయునని యే ఆమె యుద్దేశము. అందు ననె ఆమె యట్లు చమత్కారముగ మాటలాడెడిది. కాని, నిన్ను పిఱికి వానిగ నెంచికాదు.

అబ్దు:— (ఆనందమున) చమత్కారమా? చమత్కారమా? దులియా నన్ను చమత్కారమున పిఱికివాఁడని పల్కెడిదియా? చెప్పుము చెప్పుము. ఇంకను సరిగ చెప్పుము. నే నెంత పొరపడితిని బుద్ధి హీనుడను. మూఢుడను, అయిన సేనాపతీ! దులియా నన్ను ప్రేమించెడిదా? ఈ విషయమును విప్పి చెప్పుటకామె కుభయ మెందులకు?

రహ:— భయము కాదా మఱి! ఆ కాఫరుఁడుండి యుండ భయము కాదా?

అబ్దు:— అవును, సత్యమే. కాని, దీని కుపాయములేదా?

రహ:— ఉపాయమా? అది నీ చేతనే కలదు.

అబ్దు:— నా చేతనా? అట్లయిన చెప్పుము. చెప్పుము. నేను తప్పక పొనర్తును. దులియా కొఱకీ ప్రాణములనైన తృణప్రాయముగ సమర్పించి వైతును. ఆహా! దులియా! దులియా!-

రహ:— షాజాదా! ఇప్పుడు నవాబు విచ్చేయు సమయమయినది. నేఁటికి నీ వరుగుము. పిమ్మట, ఈ విషయమై ప్రస్తావింతము.

అబ్దు:— ఆఁ- దులియా! దులియా!- (ప్రస్థానము.)

రహ:— ఈ మూఢుని వలననే నాకార్యసిద్ధి కావలయును. ఇంతటి దుర్భరావమానమా? ఒక కాఫరుఁడు రాజ్య శాసకుఁడగుటయా? ముస్లిము సేనాబృందమున కధినాధుఁ డగుటయా? నా వంటి పవిత్ర మహమ్మదీయుఁడు మేటిసర్దారుడు, ఈకాఫరుని చేతిక్రింద పని చేయుటయా? ఈ నీచమగు కాఫరుని సేవ సహింపఁదగినదియా? ఇది ముసల్మానునికి మృత్యు తుల్యము. ఎట్లో కౌశలమున, చాతుర్యమున నీ విద్రోహాగ్నిని రగిల్చితినికదా! నా ప్రతిద్వంది యీ ప్రజ్వలాగ్నింబడి శలభమువలె భస్మీభూతమై పోవుటయో, నవ గౌరవ స్వర్ణ తేజమున నుద్భాసితుఁడై యొప్పారుటయో జరిగి తీరును. కాని

కాల విలంబనము నేను సహింపనోపను. అబ్దుల్లాగుప్త కృపాణము కాలాహియై నా శత్రుని ప్రాణవాయువుల గ్రోల నుంకింపనున్నది. చూచెదగాక !

(నవాబు ప్రవేశము. రహమత్ఖానుని అభివందనము.)

నవా:— రహమత్ ! నేను వినుచున్న యీ జన వాక్యము సత్యమగునా ?

రహ:— ఏవాక్యము ? దేవా !

నవా:— ఈ విద్రోహ విజృంభణమునకు కారకుఁడవు నీవని—

రహ:— చిత్తము. జహాఁపనాహ్ !

నవా:— ఈ విషయమున సర్వ సేనానితో నాలోచించి యుంటివా?

రహ:— ఖుదావంద్ ! ఆలోచనము వలన నేమి ప్రయోజనము ? మన వంగ దేశమందలి సైనిక గణము, కృషికసంతతి, వణిగ్బృందము వీరు వారననేల ? ఎల్లరును మొగలుల ఆధిపత్యమును స్వీకరించుటకు విముఖులై యున్నారు. దేవర చింతింపుడు. ఇది స్వాభావికము కాదా ? జన్మభూమి స్వాధినము కావలయుననియు, సులేమాను ప్రభువు పాలకుఁడు కావలయు ననియు, నెల్లరు నైక కంఠ్యముగా ఘోషించుచున్నారు.

నవా:— (స్వగతమున) అభిలాష యుత్తమమైనదే. (ప్రకాశము) నా యుద్దేశము కూడ నదియే. కాని, ప్రబల ప్రతాపదీప్తమగు మొగలు సేనావాహినితో నిలిచి పోరాడఁగల శక్తి మనకు కలదా ?

రహ:— ఏలలేదు ? సేనాధ్యక్షుఁడగు కళాపహాడ్ తోడ్పాటున సమగ్ర భూమండలమును సయితము సునాయాసముగ జయింప వచ్చునని దేవర త్రృప్తి వహింతురుకదా !

నవా:— అతని సమ్మతి యుండిన నది అసంభవముకాదు. కాని, ఇట్టి విద్రోహ కృత్యముల కాతఁడు సమ్మతింపఁడని వినుచున్నాను.

రహా:— (స్వగతము) సమ్మతింపమినే యింత ప్రయాసము.

నవా:— ఏమనెదవు ? (స్వగతము) ఈ విద్రోహ ప్రారంభ మొకవిధముగ శ్రేయస్కరమే. పరాధీనుఁడై యుండుట కెవ్వఁడభిలషించును? కాని, కళాపహాడ్ సహాయము లేనిదే కార్యము సానుకూలమగుట దుస్తరము. అతఁడు నిక్కముగ నిందు పాల్గొనఁడా యేమి ?

(కళాపహాడ్ ప్రవేశించును.)

నవా:— (ప్రకాశముగ) ఇదిగో కళాపహాడ్ చనుదెంచెను. ఇప్పుడు కర్తవ్యమేమి ?

కళా:— కర్తవ్యము రహమత్ఖానుఁడెఱుంగును. రహమత్ఖాఁ ! అవిమర్శచిత్తుఁడవై, ఎట్టి విప్లవమును సంఘటింప సాహసించితివి ? నీ వెవ్వనితో విరోధము కల్పించితివో యూహించితివా ? సాగర తుల్య గణిత మొగలు సేనానివహ మెక్కడ ? గోష్పాద తుల్య ముష్టిమేయ పఠాను సైన్య మెక్కడ ? సమగ్ర విశాల భారత భూమండలైక చ్ఛత్రాధిపతియగు మొగలు సామ్రాట్టుతోడ ఈ క్షుద్ర వంగదేశ పాలకుఁడు తలపడుటయా ? ఇట్టి విద్రోహము వలన జయలాభము సంభవమా ? దీని భయంకర పరిణామ మెట్టిదియో ఒక్క పరియైన చింతించితివా ?

రహా:— అహో ! వీరుని వదనమునుండి నేఁడెట్టి భీరవాణి ధ్వనించుచున్నది ? ముసల్మానుని ముఖమునుండి నేఁడెట్టి కాఫరు వాక్యములు వెలువడుచున్నవి ?

కళా:— సత్యమే. రహమత్ ! ఇయ్యవి కాఫరు వాక్యములే. ఇట్టివిద్రోహకృత్యముల సలుపునపుడు కాఫరులు భీరువులై యడఁగి పోయెదరు. "కాఫర్" ఎవ్వనిగూర్చి ఈ నిరసన పదప్రయోగము ? ఏ పవిత్రతను హిందూ జాతి ఒక్క-యెడ నీ సమగ్ర మానవ ప్రపంచమున కాదర్శప్రాయమై వెలుఁగొందెనో, దేని విజ్ఞాన చంద్రికా ప్రచారము వలన ఇపుడీ సమస్త జగమును ఉజ్వలత్వము నంది ప్రకాశించుచున్నదో అట్టి ఆర్యసంతతి కాఫరును, భీరువును, అసభ్యమును అయి పోయినదా ?

నవా:— (సాశ్చర్యముగ) కళాపహాడ్ !

కళా:— నవాబుసాహెబ్ !

నవా:— (సందేహముగ) నీవే పక్షమును మనస్థించి మాట్లాడుచున్నావు.

కళా:— స్వపక్షమును సమర్థించు చున్నాను. స్వజాతీయుల పక్షమున మాటలాడుచున్నాను.

నవా:— స్వజాతీయుల పక్షమా ? విజాతీయుల పక్షమా ?

కళా:— (స్వగతము) విజాతీయుల ! నా స్వజాతీయు లెవ్వరు ? నా స్వజాతీయులు హిందువులు కారా ? నేను పవిత్ర బ్రాహ్మణ కుల సంజాతుఁడనుకానా ? హా ! నావాసస్థానమా పర్ణ కుటీర ప్రదేశముకాదా ? ఆ వృద్ధురాలు నా ప్రియ జననికాదా ? ఆ పతి భక్త పరాయణ ఆ ప్రేమమయి నా అర్ధాంగ లక్ష్మికాదా ?

నేపథ్యమున:— కాకేమి ?

కళా:— (చమకితుఁడై) ఎవ్వరాపల్కినది ? "కాకేమి"

నేపథ్యమున:— హాహ్హాహ్హా !

కళా:— ఈ అట్టహాసమేమి ? అయినవారు మఱిలేరా ? మృతులైరా ?-నేను మృతుఁడనా ? -నేనయి ఇట నటించుచున్న నే నెవరు ?

నవా:— కళాపహాడ్ !

కళా:— "కళాపహాడ్ !" ఎవరు ? ఎవరు కళాపహాడ్ ? నేను కళాచంద్రుఁడను. చూడఁజాలవా ? నేను బ్రాహ్మణుఁడను; యజ్ఞోపవీతధారిని; నిత్యమును దేవతారాధనము సల్పెదను. నిత్య నిరామిష భోక్తనై వెలయుచుందును. నా కర్మ కలాపము సమస్తమును ఆర్యధర్మము ననుసరించియే యున్నది. ఇట్టియెడ మామకనామ పరివర్తన మేక్రియ సంభవమగును ? నా నామము "కళాపహాడ్" కాదు. నేను ముసల్మానును కాను. నేను హిందువును. నేను కళాచంద్రుఁడను.

నవా:— కళాపహాడ్ ! నీ మస్తిష్కము చెడి యున్నటుల కనవచ్చుచున్నది. నీ విపుడు పల్కినదంతయు పూర్వ వృత్తాంతము.

కళా:— పూర్వవృత్తాంతమా ? అయిన ప్రకృతము నే నెవడను ?

నవా:— నీవు ముసల్మానుఁడవు. పూజ్యమగు ఇస్లాము మతావలంబివి. నవాబు జామాతవు.

కళా:— ఇస్లాము మతావలంబినా ? నవాబు జామాతనా ? ముసల్మానుఁడనా ? హిందువునుకానా ? ( స్వగతము. ) అబ్బా ! స్మృతిపథమున నెట్టి విషయము రేకెత్తుచున్నది ? ఆహా ! నే నెంత నిష్ఠురకర్ముఁడను ? ఎట్టి పాప కలుషిత హృదయుఁడను ? స్వార్థ మదాంధీభూతుఁడనై యెట్టి క్రూరకార్యమునకు పాల్పడితిని ? ఇప్పుడు చేయునదేమి ? ఉపాయమేమి ? (ప్రకాశముగ) జహాఁపనాహ్ ! నాకు పోవుట కనుజ్ఞ నొసఁగుఁడు. నామస్తిష్క మేలనో విఘూర్ణితమై పోవుచున్నది.

నవా:— సరియే. వెడలుము. (కళాపహాడ్ ప్రస్థానము.)

నవా:— రహమత్ఖాన్ ! ఈతని ఆకస్మికతాదృశ పరివర్తనమున కర్థమేమి ? నే నీతని వర్తమాన భావముల నొకింతయు గ్రహింపఁజాల కున్నాఁడను.

రహ:— గ్రహించినను, గ్రహింపక పోయినను, కాఫరుని విశ్వసించినారు. కాఫరునకు కన్యాదాన మొసఁగినారు. కాఫరుని సర్వసేనాధిపతిగ నొనర్చినారు. ఇది మాత్రము సత్యము. ఏమైనను ప్రకృతము రాజ్య రక్షణోపాయము చింతింపవలయును.

నవా:— రహమత్ ! నీవే యీ విద్రోహమునకు కారణభూతుఁడవు.

రహ:— నేనది మొదటనే విన్నవించితినికదా !

నవా:— అయిన ఇపుడు దీని కెవ్వరు బాధ్యులు.

రహ:— ఖుదావంద్ ! కళాపహాడ్ కాక యుద్ధ కార్యముల నడుపఁగల వీరుఁడొక్కరుఁడును లేడా ? మే మందఱమును లుప్తులమై పోయితిమా ! మేము యోధులము కామా ?

నవా:— సరియే. అట్లయిన నిన్నే యీ యుద్ధమున సర్వసేనానిగ నియమించితిని. పొమ్ము. నా హృదయమున వ్యాకులత జనించుచున్నది. కళాపహాడ్డున కిట్టి భావ ముదయించినదేమి? ఆతని కాకస్మికముగ నస్వస్థత ఘటిల్లినదని తోఁచుచున్నది. వైద్యుల రావించి చికిత్స యొనర్పవలయును. ఆతఁడు లేని యెడ సంగ్రామమున విజయప్రాప్తి దుస్తరము. దుర్ఘటము. మరియు నాతఁడు నా ప్రాణాధిక యగు ప్రియపుత్రి దులియా సర్వస్వమై యున్నాఁడు. నా సర్వస్వమును కూడ నాతఁడే.

(ప్రస్థానము.)

రహ:— వహావా ! క్యామజా ! క్యామజా ! హాన్ సర్వసేనాపతి ! దుష్మన్ పాగల్ బన్గయా. దుష్మన్ పాగల్ బన్గయా - కాని నిశ్చింతత వహింపఁజాల కున్నాఁడను. ఒక వేళ నాతఁడు

స్వస్థుండై పోయిన - ఎట్లయినను వాని ప్రాణము లుండుదనుక నా యుత్తమ కాంక్ష నిర్విఘ్నముగ నెరవేఱుట దుస్తరము. త్వరితముగ వృక్షమును సమూలముగ విచ్ఛేద మొనర్పఁ గడంగవలయును - ఇందునకు ప్రధానోపకరణము షాజాదా - పోయెదను. నా చిత్రనాటకము నారంభింతును.

(ప్రస్థానము.)

---

## చతుర్థ దృశ్యము.

### గ్రామపథము

(ప్రవేశము సైన్యసమేతుండై ముకుందదేవుండు.)

సైన్యగణము:— మహారాజా! క్షుధానలము జ్వాలాభీలమై విజృంభించుచున్నది. ఇఁక సంబాళింపఁ జాలము. అనుజ్ఞనొసంగుఁడు. ఈ జనపదముల దోపిడి సల్పి వస్తువుల సంగ్రహించెదము.

ము:— వీరులగు సైనికులారా! ఇది వీరోచితకృత్యమా?

సైనికుఁడు:— మహారాజా! ఇది శత్రురాజ్యముకాదా?

ము:— ఇది శత్రురాజ్యమగుట సత్యము. కాని, యీజానపదులు మనకు విరోధులు కారుకదా!

సైని:— దేవా! ఈ జానపదుల పాలనకర్త మనశాత్రవుఁడుకదా!

ము:— అట్లని, అమాయికులగు ప్రజలుకూడ మనకు శాత్రవులగుదురా? ఆహా! ఈజానపదు లెట్టి కష్టసహిష్ణులు! ఎంతో శ్రమముఁగొని, ఎంతో యత్నముసల్పి, స్వార్థత్యాగులై రాజ్యమున ఖాద్యముల సమకూర్చెదరు; నృపాలు భండారమును ప్రపూర్ణ మొనరించెదరు. ఒకప్పుడుకూడ వారీకఠోర పరిశ్రమకు ప్రతిఫల మపేక్షింపరుకదా! ఎంత యుదారస్వభావము! ఈమహా

పకారమునకు వారేమి ప్రత్యుపకారము నందఁగలుఁగుచు
న్నారు? ఇంతియేకాదు. ఆహవము సంఘటిల్లునపుడు, రాజా
హ్వానమాత్రమున, న్యాయాన్యాయములను, ధర్మాధర్మము
లను చింతింపకయె సమరానలమున నిర్భయముగ పతంగసదృ
శులై ప్రాణవిసర్జనము గావింతురే! ఇట్టి సాధుప్రజాగణము,
సంతానాధిక ప్రాణాధికమునగు ప్రజానీకము, ఏకాలముననైన
శత్రువు లేలయగుదురు? వారియెడ వైరశబ్ద మెట్లు సార్థక
మగును?

**సైనికులు:—** దేవా! ఇఁక, కాలవిలంబమును సహింపఁజాలము.

**ము:—** మీరు చాలకాల విలంబనమును సహించి యున్నారు. ఇంక నొక్క క్షణముమాత్ర మోపికపట్టుఁడు. దూత తిరిగి వచ్చు సమయమైనది.

(మఱికొందఱు సైనికులు పరివేష్టింప దూత ప్రవేశము.)

**సైనికులు:—** దూత తిరిగి వచ్చెను. మహారాజా!—

**సైనికులందఱు:-** (దూతనుజేరి) చెప్పుము. చెప్పుము. ఏమైనది? మన సామగ్రి శకటములు వచ్చుచున్నవా?

**దూత:—** (మౌనము.)

**సైని:—** మహారాజా! మహారాజా—

**ము:—** తెలిసినది. ప్రియసైనికులారా! మన ఆశలు నిరాశలై పోయినవి. (స్వగతము) ప్రకృతమున నుపాయమేమి? (ప్రకాశముగ) సైనికులారా! పొండు. మీమీ గజ హయోష్ట్ర సంతతుల నీ పరిసర ప్రదేశముల విక్రయించి నేఁటికి మీకు వలయు ఖాద్యసంభారములను చేకూర్చుకొనుఁడు.

**సై:—** జై! ముకుందదేవు మహారాజుకు జై!

**ముకు:—** (స్వగతము) నేఁడిట్లు బ్రతుకఁగంటిమి. పిదప నేమిచేయ వలయును? సమర మెట్లు సాగును?—

సై:— జే! ముకుందదేవు మహారాజునకు జే!

(ప్రస్థానోన్ముఖులగుదురు.)

ము:— సైనికులారా! జాగ్రత్త! గ్రామవాసుల నేమియు పీడింపఁ జనదు. సావధానులు కండు.

సైని:— మహాప్రసాదము. జే! ముకుందదేవు మహారాజా! జే

(ప్రస్థానము)

ము:—(దూత నుద్దేశించి)మనఖాద్యశకట వృత్తాంత మేమియు తెలియరాలేదా?

దూ:— దేవా! శకటము లీదెస నరుదెంచినవి. ఈ విషయమున నెంత మాత్రమును సందేహము లేదు. చక్రచిహ్నములు స్పష్టముగ గనవచ్చుచున్నవి. కాని,—

ము:— అయినవి యెటుపోయినవి?

దూ:— నేను చక్రచిహ్నముల ననుసరించి పోయి చూచితిని. అర క్రోసు దూరము దనుక ఈదెస చిహ్నములు కనవచ్చినవి.

ము:— పిమ్మట?

దూ:— పిమ్మట నవి అస్పష్టరూపమున నరణ్యప్రదేశమువంక మఱలినవి.

ము:— అరణ్యప్రదేశమువంకకా? అయిన నవ్వి యెవ్వరేని ఆక్రమించుకొని పోయి యుందురా? ఇది శత్రువుల కుతంత్రమా? శకటకారుల బుద్ధిమాంద్యమా? నీవరణ్యసీమ ప్రవేశించి యుంటివా?

దూ:— దేవా! అంధకార మాక్రమించుచుండుటచే నే నాకాంతారము ప్రవేశింపలేక పోయితిని. రేపుదయమున నే సర్వమును దేవరకు విన్నవింపఁజాలుదును.

ము:— (స్వగతమున) నేఁడు తురగాది వాహన జంతువిక్రయమున నుదరపోషణము జరుగును. తదుపరి చేయునదేమి? సంగ్రామ

కార్యముల నిర్వర్తించు టెటులు? కతలుఖాను చని యింతదనుక నే తేరఁడాయె. సంధ్యాగమన సమయమునకు పూర్వమే ఆతఁ డిటకు విచ్చేయవలసి యుండెనుగదా!

సైనికుఁడు— (ప్రవేశించి) మహారాజా! ఈ నికటముననున్న హిందూ జమీఁదారు మమ్మాదరించి మా కెల్లరకును మూల్యము గ్రహింపకయే ఆహారవస్తుల నొసంగెను.

ము:— మూల్యము గ్రహింపకయే! ధన్యోస్మి; జగన్నాథ! ఆమహా జనుఁడేఁడి?

సైని:— ఆయన మహావృద్ధుఁడు—నడచుటకు జవసత్వములు లేవు. దేవరను సాదరాభ్యర్థనపూర్వకముగ కొనిపోవుటకు మాత్రము సముచితప్రయత్నము నొనర్చుచున్నాఁడు.

ము:— ఇంత యనుగ్రహమా? ఇంత వినీతభావమా! నడువుము. వారి యాగమనాత్పూర్వము మనమే స్వయముగ పోయి, ఆ పుణ్యశీలుని దర్శన భాగ్యమంది ధన్యులముగుదము. ధన్యోస్మి; మహాప్రభూ! జగన్నాయకా! నీ కరుణాప్రభావ మద్భుతమైనది.- రేపటికేమి చేయుదును?... సరియే. కతలుఖాను నిశ్చయముగ నప్పటి కరుదేరఁగలఁడు.

(అందఱు నిష్క్రమింతురు; ఇంకొకదెసనుండి కతలుఖాన్ ప్రవేశము.)

కత:— అరుదేరఁగలఁడేమి? వీఁడుగో! అరుదెంచియే యున్నాఁడు. వారేవా! బలేతమాషా! బలేమజా! ముకుందదేవా! ఈపర్యాయము కతలుఖానుని చాకచక్యమును తెలిసికొనెదవుగాక! మిమ్ముల నిరాహారుల నొనరించి వేధింప నెట్టివ్యూహమును పన్నితిని?- సామగ్రి శకటములు నాహస్తగతము. నీజీవనములు నాముష్టిగతము. ఈవిపత్తునుండి విముక్తుఁడవై సమరముసల్పి చక్రవర్తిచే మాయందఱి సమక్షమున నెట్లు సమ్మానింపఁ బడునది యీపరి తెలియగలదు. మహమ్మదీయ సభాస్థలమున

నొక కాఫరుఁ డింత సమ్మానితుఁడై శిరమెత్తి నిలుచుట ముస ల్మానునకు నితాంత దుర్భరము. మేమెవ్వరమును వీరయోధులము కామా ? ఖాద్యాభావమున మరణించిన ముకుంద దేవుఁ డెంత నిర్భ్రష్టరాజకుఁడైనదియు, విద్రోహ విధ్వంసనా సమర్థుఁడనగు నేనెంత సమర్థుఁడ నైనదియు పాదుషా యీసారి తెలిసికొనగలఁడు. ఈ విద్రోహము నెట్లయిన నడంపవలె. బలమున, లేక కౌశలమున నీకార్యము సాధింపవలయును. ప్రప్రథమమున రహమత్ఖానుని చేతఁ జిక్కించుకొనవలయు. పోయెదను. ఆలస్య మనవసరము. (ప్రస్థానము.)

---

## పంచమదృశ్యము.

(శయనాగారము.

పరివేశము:— ఫిరోజా, దులియా.

ఫిరో:— దులియా ! లలాటఫలకమున సిందూర రేఖ హస్త పల్లవముల కాచభూషణములు. అంగవల్లికి బాలామణి చీరె. ఆహా ! ఇవి నీకెంత శోభ నొడఁగూర్చుచున్నవి ?

దులి:— ఎన్నో దినములైనది; ఫిరోజా ! నాథుని హిందూ భావముల ననుసరింపలేక పోవుచున్నాను.

ఫిరో:— అందులకా యీ నూతనాలంకారము ?

దులి:— అవును. హృదయేశ్వరుని హృదయాహ్లాదము కొఱకు ఎట్టి కృత్య మావశ్యకమో అట్లాచరించుట ఉచితము.

ఫిరో:— దులియా ! పవిత్రత పరిణయ రహస్యమును నీవు యెరుంగుదువు. కానియెడల నీ యీ అనూన రూప వయోలావణ్యముల నొక యవనేతరుని హస్తముల ధారవోయుదువా ?




దులి:— సఖీ ! అట్లు వచింపకుము. నీ యీ వచనములు నా హృదయమును భేదించుచున్నవి. ప[illegible] [illegible]మున జాతిభేద మెక్కడ ? కొద్ది గొప్పల తారతమ్య మెక్కడ ? హిందూ మహమ్మదీయ విభేద మెక్కడ ?

ఫిరో:— సరియే. అయిన, దులియా ! ప్రథమ సందర్శన కాలమున నీ ప్రియుఁడింత సుందరమూర్తియై యుండలేదు కదా ! ఖాద్యాభావమున శుష్కదేహుఁడై, మలిన వసనధారియై వికృతాకారుఁడై కన వచ్చుచుండెను కదా ? ఏమి చూచి, ఆతని నపుడు ప్రేమింపఁ జాలితివి ?

దులి:— సఖీ ! అది సత్యము. ఏమి చూచి నేను ప్రేమించితిని ? ఈ ప్రశ్నమునకు సదుత్తర మొసగఁజాలను. ఆ ప్రణయ మూర్తియెడ నెట్టి ప్రభావము కలదో వ్యక్తీకరింప నే నశక్తురాలను. కాని, ప్రథమ సందర్శన మాత్రముననే నా హృదయమాతఁ డధిష్ఠింపఁ గలిగెను. నా జీవన సర్వస్వము నాతని పాదార్పణ మొనర్చి వేసితిని.



ఫిరో:— ఏమిమో చేసితివి లెమ్ము. అప్పుడు నే న[illegible] యుండిన యోజన దూరమునుండి మాట్లాడియుందు. కన్నెత్తి యాతని వంకనైన చూడకపోయి యుం[illegible]



దులి:— ఇప్పటివలె నాతఁ డప్పుడుండిన?



ఫిరో:— ఇప్పటి రూపమున నాతఁ డప్పు డుండినచో ? నీవఱకు రానిచ్చి యుందునా ? ఇంతటి వీరపురుషుని, మహాపండితుని, సాధుహృదయుని, దివ్య సుందర విగ్రహుని యెవ్వ రాశింపక విడిచెదరు.

దులి:— నే నాతని యీ సద్గుణములను ప్రథమ సందర్శనముననే గ్రహింపఁగలిగితిని. ఆతని విశాల నేత్రములఁ బ్రకాశించుచుండిన మహోజ్జ్వల తేజ మతఁడొక మహా విద్యావంతుఁ డనియు, ఆతని దివ్యమంగళ స్వరూప మాతఁడొక వీరశిఖా

మణియగు మహా పురుషుఁడనియు స్పష్టముగ వ్యక్తీకరించు చుండెను.

ఫిరో:— కలకంఠము కలకంఠమును గుర్తింపఁ గలిగినది. మాదృశ కాకముల కది దుస్సాధ్యము. కాని, దులియా! నీ కొక సపత్నియు కలదట కదా?

దులి:— అవును; కలదు. ఆమె నామము తిలోత్తమ.

ఫిరో:— ఆమెను నీ స్వామి మఱి తలంచుట లేదా? అవును, ఏల తలంచును? పద్మగంధము మరగిన తేఁటు లన్య కుసుమఁబులఁ జేర నేర్చునా?

దులి:— వలదు. సఖీ! అట్లు వచింపకుము. తిలోత్తమ మిపుల పతివ్రతయగు సాధ్వీమతల్లి. నాకంటె నామె అసమాన లావణ్యవతి. ఆహా! మేమిరువురమును సోదరీ న్యాయమున గలసి మెలసి యుండినచో ఎంత బాగుగా నుండెడిది? కాని, ఆమె హిందూ ధర్మ పరాయణ. ప్రియతముఁడెన్ని విధముల బోధించినను, ఆమె తన హిందూ ధర్మమును త్యజింప నియ్యకొనదు. వృద్ధయగు నాశ్వశ్రువు కూడ తన యుని తన దరిఁ జేరనిచ్చుట లేదు. ఆహా! శ్వశురి సమ్ముఖము వసించి ఆమె శుశ్రూషలు సలుపు పరమభాగ్యము నాకు లేకపోయెగదా?

ఫిరో:— చూచుచుంటిని గదా నిన్ను? దులియా! నీవు చాలవరకు హిందూభావ పరిపూర్ణవై పోయితివి. ఆకారమున, వేషమున, భావమున అన్నిటియందును నీవు హిందువవే యగు యగుచున్నావు.

దులి:— (దీర్ఘనిశ్వాసపూర్వకముగ) ఆమాటలన్నియు నటుండనిమ్ము చూడుము! నేనే పూవుల నెట్లు చెఱచివైచితినో? నా మనమేమియు స్వస్థత వహింపకున్నది.

ఫిరో:— ఏల స్వస్థతవహించును? మఱి ఆయన దయచేయు సమయ మైనది!- నాకెన్నియో పను లున్నవి. నేనిఁక పోయెదను.

(ప్రస్థానము.)

దులియా:—

గీతము.

ఇంక నామది కామితమేమి కలదు?
నవకళాచంద్ర నందనందనుఁడవీవు.
ప్రేమరసపూర్ణ ముగ్ధ గోపికను నేను
ప్రణయబంధన మిట్టులే వఱలుఁగాక—
ఇంక నామది కామితమేమికలదు?
నవనవోన్మేష మురళిగాన మ్మొనర్చి
జగము నెల్లెడ ప్రణయనిర్ఝరుల నించి
రమ్ము! ప్రియతమా! బృందావనమ్ముఁ జేర—
క్రోలెదను తమిదీర సంకోచమెడలి
యుమ్మదనురాగ గాన పీయూషఝురుల.

* * *

ఇంక నామది కామితమేమికలదు?
నవకళాచంద్ర నందనందనుఁడవీవు—

(ప్రవేశము కలాపహాడ్)

క:— పాడుము దులియా! పాడుము! ఏమి ఆగీతము? "నవకళాపూర్ణ నంద నందనుఁడ వీవు—"

దు:— చక్కగనే పాడుచున్నానే!

క:— కాని నీపాటయందువలె మాధుర్య మెక్కడిది? ఆమనోహరత్వ మలవడు టెట్లు?

దు:— నాకు మంజులముగనే యున్నది.

క:— నీకు మంజులముగ నుండిన నేమి ప్రయోజనము? నా శ్రవణముల కట్లు లేదుకదా!

దు:— మీ శ్రవణముల కానంద మొదవనిచో నాకేమి?

క:— నాగీతము, నాకోటికు సల్పెడి గానము. నాకు ముదావహము కానిచో నేక్రియ కథ నడచును.

దు:— అయిన సరియే. మీరాలించు విధమున సరిగ కూర్చుండుడు. నేను గానమొనర్తును. నాకు పారితోషిక మొసఁగుఁడు.

(పూర్వోక్తగీతమును పాడి వకుళమాలిక నాతని మెడవైచును)

క:— దులియా! దులియా! ఇంతటి ప్రణయము, ఇంతటి ఆదరానురాగము మానవులకు సాధ్యములా? నీవు మర్త్యభామినివి కావు. కేవలము దేవమూర్తివి. రమ్ము! మదీయప్రేమమయ జీవితా! నా ప్రణయ నిధానమా! రమ్ము! నీ సుపవిత్ర ప్రేమాదరమున నీ యాంతరిక స్నిగ్ధ స్నేహరసామృత సేచనమున నా పూర్వ స్మృతి కలంకము ధౌతమై పోవనిమ్ము. నేను హిందువునై యుండిన విషయము మఱచిపోయెదనుగాక! నాకన్య పత్నియు వృద్ధ జననియుఁ గలరనునది స్మృతి పథమునుండి నశించిపోవును గాక! నేను జాతిభ్రష్టుఁడ నైతిని. పత్నిని గోల్పోయితిని. మాతృవిహీనుఁడ నైతిని. కాని మహాదరమును పొందియున్నాను. పవిత్రప్రేమ సుధ నంది యున్నాను. స్నేహసౌశీల్యమును చేపట్టి యున్నాను. నాకిఁక చింత యేటికి?

దు:— హృదయేశ్వరా! వృథా ప్రశంస పొనర్చి యీదాసి నేల చిన్నవుచ్చెదరు? ఈ దీనురాలు ప్రేమవిషయమున నేమెఱుంగును? ఆదరణ విషయమేమి గుర్తించును? ఈమె యెఱుఁగున దొక్కటిమాత్రమే! మీరు నాహృదయాధీశులరు! ఈదాసి మీ అయోగ్యనారి! మీరు నా ప్రభువులు! ఈ దీనురాలు మీపాదసేవకురాలు!

క:— ఏమి ఉన్నత భావము! ఎంత గభీర ప్రేమము! ఎట్టి అకృత్రిమ స్నేహము! వీని సమక్షమున హిందూ ముసల్మాను విచక్షణ మెక్కడ నిలుచును? స్వజాతి విజాతి భేదములకు స్థానమెక్కడ కలదు? తిలోత్తమా! ఈ గభీర ప్రణయ భావము నీయెడ నేదీ? చూడుము! నీకంటెను దులియా ఎంత సరళ ప్రకృతి కలదో? అమ్మా! ఈ అకృత్రిమ స్నిగ్ధస్నేహము నీయెడ నేదీ? చూచితివా? నీస్నేహముకంటెను దులియా స్నేహమెంత యుత్కృష్ట మైనదో? రమ్ము! ప్రేమమయీ! స్నేహమయీ రమ్ము! నా కలంకిత హృదయమును ప్రేమమయ మొనరించివేయుము. నా సంకీర్ణ భావమును పవిత్ర మొనరించి వేయుము. (ఆలింగనము)

దు:— ప్రాణేశ్వరా! ఇప్పుడు రాత్రి చాలవఱకు నతిక్రమించినది. రండు? శయనింపుఁడు. నిద్ర ఆసన్నము కాసాగినది.

క:— దులియా! నా ప్రేమమయ జీవితా! (ప్రేమాలింగనము)

దు— [ప్రస్థానము]

క:— ఆహా! ఇట్టి పవిత్ర ప్రణయమును మఱచి వృథాభావనాసలమున నేల దగ్ధుఁడ నగుచుంటిని?—

(శయనించును. శయనాంతమున ఛాయారూపమున తిలోత్తమ ప్రవేశము.)

తిలో:— వందనము ప్రభూ!

క:— ఎవరు నీవు? తిలోత్తమవా? ఇచ్చటి కేల వచ్చితివి? నీహృదయ భావము పరివర్తన మందినదా? నీభ్రమ సంజనితదోషమును నీవు గుర్తింపఁ గలిగితివా? అయిన రమ్ము! నాదండ నుండుము. నీకే చింతయును వలదు. నీ యిచ్ఛానుసార మిట వర్తింపుము. రమ్ము! రమ్ము!

తిలో:— ఇది యెట్టి ఆదేశము ప్రభూ! హిందువునై హిందూ ధర్మము నెట్లు పరిత్యజింపుదును ప్రభూ!

క:— పత్నివై పతిని మాత్రము విసర్జింపగలవు !

తిలో:— నేను నాపతిని విసర్జించితినా ? స్థూల సంపర్క విసర్జన మాత్రమున అంతరంగ సంపర్కము లుప్తమై పోవునా !

క:— అయినను కాకుండినను, దులియాను గాంచితివా ? ఆమె ప్రేమ మెట్టి విమలతమమైనదియో కనుగొంటివా ? నేను హిందూ భావమున వర్తింప నిచ్ఛగించిన ఆమెయు హిందూ భావమున వర్తించును; నేను మహమ్మదీయ భావాను వర్తినై యుండిన ఆమెయు మహమ్మదీయ భావాను వర్తియై మెలగును ఆమె ప్రియణ మెంత కృత్రిమ రహితమైనది ! ఎంత పవిత్రమైనది !—నీకడనట్టి పవిత్ర ప్రేమయేది ? ఆ ఆదర యత్నమేదీ ?

తిలో:— నా ఆదర స్నేహము, నా ప్రేమానురాగము వీక్షింప నిచ్ఛగింతువా ! ప్రభూ ! అయిన చూడుడు ! ఇదే హృదయ విభేదన మొనర్చి చూపెదను ! చూడుడు ! (హృదయమును చీల్చివేయును.)

క:— (సాశ్చర్యమున) ఆఁ ! ఆఁ ! ఏమిది ? ఏమి చూచుచున్నాను?

తిలో:— (నవ్వుచు) చూచితిరా !

క:— ఆఁ ! చూచితిని.

తిలో:— ఏమిచూచితిరి ?

క:— నా నామాక్షరములు ! నామూర్తి ! నాధ్యానము !

తిలో:— అయిన నాయందు ప్రణయము లేదా ? నాకడ నాదర యత్నము లేదా ? ఆశ్చర్యాన్వితు లయ్యెద రేల ?

క:— అవును ! ఆశ్చర్యాన్వితుఁడ నగుచున్నాను. ఏల యందువా అంతరంగ ప్రకృతి యింత సుధామయమై యుండ బాహ్య ప్రకృతి యింత రిక్తమయమై యుండనేల ?—

(ఛాయా రూపమున వృద్ధురాలు ప్రవేశము.)

వృద్ధు:— రిక్తమయము కాదా? కామ లాలసత్వమున నీ నాలుక వికృతమై పోయినది! కామాంధుఁడా?

క:— నేను కామాంధుఁడనా?

వృద్ధు:— కావా! నీయందు ప్రకృతి ప్రేమయే ఆవిర్భవించియుండిన నీ అర్ధాంగియెడ కర్తవ్యము, నీ వృద్ధ జననియెడ కర్తవ్యము, నీ స్వధర్మము నెడ కర్తవ్యము ఒక సామాన్య యువతి రూప లాలసమున ముగ్ధుఁడవై విసర్జింపఁ గలుగుదువా! సామాన్య ప్రాభవమున ఆ కృష్ణుఁడవై పరిత్యజింపఁ జాలుదువా? ఛీ! నీ పురుషత్వమునకు ధిక్కారమగుఁ గాక! ఈ దుర్బల హృదయ జ్ఞానహీన యగు అబల నుండి కూడ నీ వభ్యసింప వలసినది చాల కలదు.—ఆహా! ఈ వృద్ధురాలికి నీ వెవరు? ఏకపుత్రుఁడవు! హృదయ నిధానమవు! జ్యోతిస్సదృశుఁడవు కాని నేఁడీ శీర్ణహృదయ, జీర్ణదేహ ఈ వృద్ధ—నేఁడేమి చేయు చున్నది. ధర్మవేదికపై నిన్ను బలి యొసంగినది. సంఘ క్షేత్రమున నిన్ను పరిత్యజించినది. ఈ విశాల ప్రపంచమున నిఁక నీవు నాకేమియును కావు. కర్తవ్య విధానమున నీవు నా పరమ శత్రుఁడవు. కాని నా హృదయాంతరంగము నరసి చూడుము. నీ స్నేహమయ మూర్తి ధ్యాన మొక్కటి మాత్రమే! (హృదయము చీల్చుట.)

క:— అమ్మా! అమ్మా!

వృద్ధు:— మోహ జాలమును భేదించి తిలకింపుము. అజ్ఞానాంధ కారమునుండి విముక్తుఁడవై పరికింపుము! ఎవరి ప్రేమ సత్యము? ఎవరి ప్రేమ కృత్రిమము?

(తిలోత్తమ, వృద్ధ అంతర్ధానము)

క:— (గట్టిగా) అమ్మా! అమ్మా! ఏది మాఅమ్మ! ఎవ్వరును లేరేమి? అమ్మా! అమ్మా! ఈపాపాత్మునికి నేఁడేమి విన్పించితివి? ఈ అంధునికి నేఁడేమి చూపిపోతివి? నిశ్చయముగ నేను కామాంధుఁడను! కామమును ప్రేమముగ నెంచి కర్తవ్యజ్ఞానమును కోల్పోయితిని. సకలశాస్త్ర పారంగతుడనయ్యు, ధర్మనిష్ఠుడనయ్యు, ధర్మపత్నిని విసర్జించి యున్నాను. మాతృదేవత యెడ ద్రోహము సల్పియున్నాను. ధర్మపక్షమున నపరాధ మొనర్చియున్నాను. ఇపు డుపాయమేమి?—ఉపాయమేమి? కర్తవ్యమేమి? పోయెదను. నాజనని సమక్షమునకు మరలిపోయెదను. సాధ్వీమతల్లి నాఅర్ధాంగి సమక్షమునకు మరలి పోయెదను. కరములమోడ్చి క్షమాభిక్ష నడిగి కొనియెదను. సాష్టాంగ పడి క్షమాప్రార్థనము గావించెదను— వలదు వలదు ఎటుల పోవగలను? ఈపాప కలుషిత జీవన ధారణమున ఇఁక ప్రయోజనము లేదు. [ముఖమున చేతులిడుకొని శయ్యపై పడును.]

(ఛురికాహస్తుఁడై అబ్దుల్లా ప్రవేశము.)

అ:— జాగు సలుపుట వలన ప్రయోజనము లేదు. దులియా! దులియా! చూడుము. నేనుపిఱికి పందనుకాను. నేను ధైర్యవిహీనుఁడనుకాను. చూడుము నేనెట్టివీరుఁడనో! చూడుము నేనెట్టి బహద్దరునో! (కలాపహాడ్‌ను కత్తితో పొడవ నుద్యుక్తుఁడగుచు)

క:— (లేచికూర్చుండి) పొడువుము. పొడువుము. అబ్దుల్లా ఈపాపజీవములనుండి నన్ను విముక్తుని చేసివేయుము. రమ్ము.

దు:— (త్వరితగతి) ఏమి? ఎవరిది? హా నాథా! నాథా!

(అబ్దుల్లా కరమును పట్టుకొనును. తెరపడును.)

ప్రథమాంకము సంపూర్ణము.



ఓం

# ఉత్కలపతనము.

## ద్వితీయాంకము.

### ప్రథమదృశ్యము.

రంగము—కుటీరము.

(కలాపహాడ్ తల్లి రోగశయ్యపై నుండును. తిలోత్తమ ఉపచారములు సల్పుచుండును.

తిలో:— అత్తా! అత్తా! ధైర్య మవలంబింపుఁడు.

వృద్ధ:— (ఉన్మాదమున) వినుము. వినుము. సావధానముగ వినుము. వాఁడు చాల చదువుకొనెను— మహాపండితుఁడని వాని నెల్లరును సమ్మానించుచుండిరి—నిష్ఠాపరుఁడగుట, ఎల్లరును వానిఁ బూజించుచుండిరి— వానికి వివాహ మొనర్చి యుంటిని— వానికొఱకొక కన్యను కొనివచ్చితిని— ఆమె ఎట్టిది?— లక్ష్మి— జగద్ధాత్రి—

తిలో:— ఏల మాట్లాడెదరు?— కొంచెముసేపు నిద్రింపుఁడు.

వృ:— నేను వలదని చెప్పుచునే యుంటిని. వాని ఇచ్ఛకూడ లేకుండెను. గ్రామవాసులు వాని ప్రోత్సహించిరి. "నవాబు దర్బా

రునకేగి వేఁడుకొనిన నీపూర్వసంపత్తి నీకు మరలివచ్చునని” వాని బలవంతపఱచిరి. వాఁడు పోయెను. ఎట్టి దుర్ముహూర్తమున పోయెను!— ఒక నరమాంసభక్షకి, సాక్షాత్పిశాచి సమక్షమునఁబడి పోయెను. మఱి తిరిగిరాలేదు. నా హృదయ రత్నము మఱి తిరిగిరాలేదు.—

(కళాపహాడ్ ప్రవేశము.)

క:— (ఉన్మాదమున) మఱి తిరిగిరాలేదా? ఎట్లువచ్చును? ఆతఁడు ముసల్మాను కదా?

తిలో:— ఎవరిది? ఎవరిది? ఇది ఎవ్వరిమూర్తి? ప్రాణేశ్వరా! ప్రాణేశ్వరా!

క:—(అగ్రసరుఁడై) ఖుడారహమ్సైతాన్! మఱల ప్రాణేశ్వరుఁడా! మఱల ప్రాణేశ్వరుఁడా!— అహ్హాహ్హా:— వృధాచేష్ట. వ్యర్థ పరిశ్రమము!

తిలో:— ప్రాణేశ్వరా!—

క:— మఱల వచ్చితివా నన్ను బంధించుటకు? ఆనీమృణాలకోమల భుజబంధనమున బంధించెదవా?— బంధింపుము— కాని, ఈసారి కళాచందునిది హీనశక్తిమాత్రము కాదు.—ఏమి? అట్లు చూచెదవేమి?— నఱికెదవా? ఆ నీ కుటిల కటాక్షవీక్షణములచే నఱికెదవా?— నఱుకుము— కాని, ఇప్పుడు కళాచందుఁడు కోమల హృదయుఁడు మాత్రము కాఁడుసుమా!

తిలో:— ప్రాణేశ్వరా!— నేను— తిలోత్తమను.

క:— “తిలోత్తమ”?— ప్రాణప్రియ తిలోత్తమయా!— రమ్ము. రమ్ము— వలదు, వలదు. అంటకుము. అంటకుము. నేను జ్యాతి విధ్వంసకుండను. ధర్మద్రోహిని. ఆమిషమును భుజించితిని. అనాచార మొనర్చితిని. నన్ను ముట్టకుము.— నన్ను ముట్ట కుము.—

తిలో:— ముట్టవలదా? ఈసారి ఈ అభాగినిపై కరుణించి విచ్చేసితిరికదా! ప్రాణేశ్వరా! వాస్తవముగ నేఁడీదాసి తన ఆరాధ్యదైవమును పొందఁగలిగినదా? అత్తా! అత్తా! చూడుఁడు! మీ హృదయరత్నము మఱల లభించె; చూడుఁడు!

వృద్ధ:— వినుమమ్మా! తనధర్మమును త్యజించి మహమ్మదీయుఁడయ్యెను. గోమాంసమును భుజించెను.— ఇహపరములకు రెంటికిని విదూరమై పోయెను. అధఃపతితుఁడై పోయెను.

క:— అవును. వాస్తవముగ అధఃపతితుఁడై పోయెను. సర్వనాశమొనరించెను. గోమాంసభక్షణ మొనరించెను.— కాని,— కాని,— ఎవరు భక్షింపఁజేసిరి' (ఊర్ధ్వదృష్టితో) అదిగో! చూడుఁడు. ఆరాక్షసి నవ్వుచున్నది.— నన్ను గోమాంసమును భుజింపఁజేసితినని నవ్వుచున్నది.— నన్ను కులవిధ్వంస మొనరింపఁజేసితినని కరతాళమొనర్చుచు నృత్యము సల్పుచున్నది. అదిగో! నాదెసకు పరుగున వచ్చుచున్నది.— అదిగో! నన్ను మ్రింగివేయుటకు— నన్ను నమలివేయుటకు— పరువున వచ్చుచున్నది. అమ్మా! అమ్మా నన్ను పట్టుకొనుము. నన్ను దాచివేయుము. అమ్మా! నన్ను దాచివేయుము. (వృద్ధనాలింగనమొనర్ప గమకించును.)

వృద్ధ— ఎవరిది? ముట్టకుము. నన్ను ముట్టకుము. నాజాతి విధ్వంసమొనర్పకుము. నాధర్మవినాశ మొనర్పకుము. అమ్మా! తిలోత్తమా! తిలోత్తమా! నాప్రక్కకురమ్ము. ముట్టివేయును. ముట్టివేయును. రమ్ము.

తిలో:— హా! కఠోర సమాజమా! నీశాసన మెంతకఠినము! ఎంత అనుల్లంఘనీయము! నీశాసనమున తల్లి సుతుని ముట్టలేకున్నది. పత్ని పతి నంటలేకపోవుచున్నది!

క:— అమ్మా! అమ్మా! మఱల నారక్కసి అదే పరువున వచ్చుచున్నది. నన్ను పట్టుకొనవమ్మా! నీచందుని దాచివేయవమ్మా!

వృద్ధ:—— (లేచికూర్చుండి) ఏమంటివి?— ఏమిపల్కితివి — మఱియొక మారు వచియింపుము.— ఇంకొకమారు నుడువుము. నీవు నా చందుఁడవా? కళాచందుఁడవా? నాకొంగు బంగారమవా? నా జీవరత్నమవా? నాహృదయనిధానమవా?— కాదు. కాదు. నీవసత్యవాదివి. కళాచందుఁడు చాలదినముల క్రితమే మరణించెను. కళాచందుఁడీలోకమున లేఁడుకదా! అయ్యో! కళాచందా! యీ వృద్ధురాలి యేకమాత్రాశ్రయుఁడవు. ఈ అబలల కేకమాత్రసహాయుఁడవు. ఈ హతభాగ్యుల కేకమాత్రాధారుఁడవు.— ఎందేగితివితివి నాయనా! నన్నేకాకినిగఁ జేసి ఎందు పోయితివి తండ్రీ! రమ్ము! నాయనా! రమ్ము.—

క:— మరణించెను. హతుఁడయ్యెను, భార్యయెడ నత్యాచార మొనరించి మరణించెను. జననియెడ నత్యాచార మొనరించి హతుఁడయ్యెను. క్షణకాలమైన నిలుపలేక పోయితిరా? దండించి విడువలేకపోయితిరా?—చనిపోయెను — ఉరిపోసికొని చనిపోయెను.

తిలో:— ప్రాణేశ్వరా! ప్రాణేశ్వరా! అయ్యో! ఎట్టి దారుణ దృశ్యము? శ్వశురున్మాదిని. పతి ఉన్మాదుఁడు. లోకమెల్ల నున్మాదమయము. ఈ ఉన్మాదమయ భవనములో ప్రయోజనమేమి? కులిశమా! నీవును, ఉన్మాదినివి కాలేదా? సాగరమా! నీకును, ఉన్మాదము జనింపలేదా? లెండు. శీఘ్రమున్మాద నృత్యమున తాండవమాడుఁడు. శీఘ్రమున్మాద గర్జనముల భూమ్యాకాశములను కంపింపఁజేయుఁడు. నన్ను నీ ఉన్మాదమయ జీవనమునుండి ఉన్మోచన మొనర్పుఁడు.

(పతనము).

క:— (తిలోత్తమ పతనమువలన చకితుఁడై) ఎవరు నీవు? నీవెవరు'— అమ్మా! అమ్మా! ఆ రాక్షసియే. అదిగో! ఆపిశా

చియే. నాకు భీతికొల్పుచున్నది. నా దేహము కంపించుచున్నది. నన్ను పట్టుకొనవమ్మా! నన్నెత్తికొనుమమ్మా!

వృద్ధ:— (ఆతనిదెసకు వంగి) పట్టుకొనెదను నాయనా! ఎత్తుకొనిపోయెదను తండ్రీ!— మఱి భీతిల్లకుము నాయనా! — ఆ! ఆ! నీవెవరు? నీవా కళాచంద్రుడవు? కాదు. కాదు. నీవు కళాచంద్రుఁడవు కావు.— నీవు నా సుతుఁడవుకావే!— నా సుతుఁడు చిరకాలముక్రిందనే మరణించెను— నీవు ముసల్మానువు. నీవు కళాపహాడ్‌వు.

(శయ్యపైఁ బడిపోవును).

క:— కళాపహాడా? కళాపహాడా? అతఁడానాఁడే అంతమొందెను. నేను స్వయముగ చూచివచ్చితిని— అమ్మా! అమ్మా! నేను కళాచంద్రుఁడను. నేను కళాపహాడ్‌నుకాను. నేను. హిందువును, మహమ్మదీయుఁడను కాను.

వృ:— మహమ్మదీయుఁడవుకావా? హిందువవా? నీవు హిందువయ్యెదవా? కాఁగలవా? నీవు హిందువు కాఁగలవా?

క:— హిందువునుకానా?— హిందువునయ్యెదను. అమ్మా! అమ్మా! నేను హిందువు నయ్యెదను. హిందువు నయ్యెదను. కాఁజాలనా? అమ్మా! నేను హిందువు కాఁజాలనా?

వృ:— ఏల కాఁజాలవు నాయనా? నీవు దుఃఖింపుము. విడువక దుఃఖింపుము. పశ్చాత్తప్తుఁడవై దుఃఖింపుము. నీ దుఃఖాశ్రుధారాసేచనమున నీ సర్వపాపములును కడిగికొనిపోవును. నీ సకల కలుషములును రూపుమాసి పోవును. మఱియు, నాయనా! ఆ పతితపావనుని, ఆ సకల కలంకభంజనుని, ఆ నీలాచల నివాసియగు శ్రీజగన్నాథు నాశ్రయింపుము. ఆ దేవదేవు శ్రీచరణముల సేవకావించి, ఆ కరుణామయుని పుణ్యనామమును ధ్యానమొనర్చి, నిజదేహ ప్రాణముల నుత్సర్గ

మొనరించివేయుము. నిశ్చయముగ విముక్తినందెదవు. తప్పక
హిందువవయ్యెదవు.—

క:— నిశ్చయముగ విముక్తి నందెదనా ? తప్పక హిందువు నయ్యె
దనా ? వహాహా ! అట్లయిన దుఃఖింతును. దుఃఖించి
దుఃఖించి నా దుఃఖ ధ్యానముతో భూమ్యాకాశముల నింపి
వైచెదను. నిబిడాశ్రు ధారల సకల విశ్వమ్మును ముంచి
వైచెదను. నీలా చలమున కరిగెదను. ఈ క్షణముననే
పోయెదను. ఆ చక్రినయను నాలింగన మొనర్చుకొని, ఏక
ధ్యానమున, ఏకమానసమున " మా అమ్మ పంపినది. నాకు
వరమును ప్రసాదింపుము. నన్నుద్ధరింపుము. నన్ను హిందువు
నొనర్పుము " అని ప్రార్థించెదను— కాని, అమ్మా ! తిరిగి
వచ్చిన నన్నెత్తుకొనియెదవు కదా !

వృ:— ఎత్తికొనకుందునా ? నా తనయుని నే నెత్తి కొనకుండిన
నీ జగమున నే నింకేమి చేయవలయును ? ఈ జీవితమున
నింకేమొనర్తును ? ఈ దేహమున నింకేమి పొనర్తును ? —
నాయనా ! తనయా ! ఎచ్చటనున్నావు ? తండ్రి ! నీ వృద్ధ
మాతను, సాధ్వి భార్యను, అనాథుల నొనరించి— ఆశ్రమ
విహీనుల గావించి, ఒక్కడ వెందున్నావు నాయనా ! ఒక్క
పరి కనుపడి ఈ నయనముల సార్థక మొనరింపుము తండ్రి !
ఒకసారి నీ మధుర భాషణముల నా శ్రవణములను తనియ
జేయుము. తండ్రి ! ఒక్క పర్యాయమున కోమలకరముల
నన్ను దాకి ఈ సంతప్త జీవముల శీతల మొనరింపుము
నాయనా !— ఏమి చేయను ? ఎందుండి వచ్చును ? వాడుండి
నగదా ! వాడు జీవించియుండినగదా ! నే నున్నాను.
వాడు లేడు. నేను జీవితను. వాడు మృతుడు. వాడు
జీవించి లేడు. అయ్యో ! — వాడీలోకమున మఱి లేడు—

అమ్మా ! – తిలోత్తమా ! – తిలోత్తమా ! – వాఁడే– లోకమునఁ–గతి–లేఁదు– ! అబ్బా ! – కళా – చంద్ –

( మృత్యువు. )

తిలో:— అమ్మా ! అమ్మా ! ఇదేమి! ఏమైనది ? పలుకవేమమ్మా హా ! — ( మూర్ఛిల్లును. )

కళా.— అమ్మా ! శయనించితివా ? శయనింపుము. నిశ్చింతవై శయనింపుము. – నే నిదే పోవుచున్నాను. – జగన్నాథుని కడనుండి వరములను తెచ్చెదను. హిందువు నయ్యెదను. నీ వెత్తికొనియెదవు.– వా! వా! – అమ్మ నన్నెత్తి కొనును. అమ్మ నన్ను ముద్దులాడును.–

(త్వరిత గతి నిష్క్రమణము. )

తిలో:— (లేచి) ప్రాణేశ్వరా ! ప్రాణేశ్వరా ! ఎందు పోయెదవు ? ఎందు పోయెదవు ? ఈ హతభాగ్య దుఃఖినిని ఏకాకిగ నల్పి ఎందు బోయెదవు ? –

( ద్వారమును పట్టుకొని అవనతమస్తకయై విలపించుట. )

( ఫిరోజా, దులియా, ప్రవేశము. )

దులి:— హృదయేశ్వరా ! హృదయేశ్వరా ! ఏఁడీ ? ఫిరోజా ! చెప్పుము. నా ప్రాణనాథుఁడేఁడి ? ఇదియేకదా ఆ కుటీరము ? హా ! ప్రియతమా ! (పడిపోవును. )

ఫిరో:— సఖీ ! సఖీ ! ధైర్య మవలంభింపుము.

తిలో:— ఎవ్వరీ యున్నాదిని ?

ఫిరో:— అమ్మా ! నీ నామము తిలోత్తమయా ?

తిలో:— అవును; ఈ హతభాగిని నామము తిలోత్తమయే.

దులి:—(లేచి) తిలోత్తమా! సోదరీ! ఆయన యేరీ! ఆయన యెక్కడ? నాకు సత్వర మొకపరి చూపుము. అక్కా! నాకు సత్వర మాయన నొకపరి చూపుము.

తిలో:—(స్వగతము) ఆ భాగ్యవతి ఈమెయేనా? ఏమి యీ యవన యువతి? పతి విచ్ఛేదమున ఇంత యున్మాదిని యగుటయా? అసంభవము.

దులి:—సోదరీ! మాటాడవేమి? నా ప్రాణనాథుని నీకడనుండి బలవంతముగ లాగికొని పోవచ్చితినని తలంచుచున్నావా? లేదు. లేదక్కయ్యా! ఒక్కసారి దర్శించుటకు మాత్రమే యింతదూరము పరువెత్తుకొని వచ్చితిని. కేవల మాతని పాదధూళిని శిరమున తాల్చుటకు మాత్రమే. ఈ దుర్గమపథమున ఏకాకినిగ వచ్చితిని. ఒకమారు చూపింపుము. ఏదోషమున ఈ దాసిని పరిత్యజించి నాథుఁడు వెడలి పోయెను. ఒక మారు తీసుకొనిరమ్ము. ఏ పాపవశమున ఈ నిర్భాగ్యురాలికి కాన రాకుండ జీవితేశ్వరుఁడు వెడలి వచ్చెను. ప్రాణేశ్వరా! హృదయేశ్వరా! దయచేయుము! రమ్ము! ప్రభూ! ఈ దీనురాలి యెడ, ఈ కించిదయెడ, కరుణింపుము, నాథా! నీవు లేకుంటఁజేసి యీ అబలకు లోకమంతయు నంధకారముగానే కాన వచ్చుచున్నది. సమస్త విషయములలోన శాంతియే అనుభవించుచున్నది.

తిలో:—అక్కా! అక్కా! ప్రకృతము నీవు నాసోదరివి. నీవు యవన యువతివి కావు; హిందూసుందరివి. నీవు పతివ్రతామతల్లివి: పరమసాధ్వివి. హా! సంఘమా! నీ నిర్బంధము లేకుండినచో, హా! మతమా! నీభయమే లేకుండినచో, ఒక్కసారిగ హిందూ మహమ్మదీయ ప్రభేదమును విస్మరించి, అల్లా పరాత్పర సార్థక్యము నవలద్రోచి, ఈ సతీశిరోరత్నము నాలింగన మొనర్చుకొని, నాజీవితమును ధన్య మొనర్చికొని యుందును. నాజన్మము సార్థకపఱచికొని యుందును.

దులి:— సోదరీ! ఈ నిర్భాగ్యురాలి కంతటి భాగ్యము ప్రాప్తించునా? కేవలము దేవీతుల్యవగు నినుబోలు సోదరీమణి పరిష్వంగ సుఖానుభవమునకు నేనర్హురాలనా? విడువు మా ప్రసంగము. చెప్పుము, అక్కా! ప్రాణనాథుఁ డెట నున్నాఁడు? వెళ్ళుము. ఒకసారి గృహాంతరమున కరిగి పిలువుము. (వృద్ధురాలి మంచ ముదెసఁగని) ఇదేమి యీదృశ్యము?— సోదరీ!— ఏమిది?— నేనేమి వీక్షించుచున్నాను?—

తిలో:— సోదరీ! అత్త మఱి యీలోకమున లేరు. ప్రియుఁడు నీలాచలమున కేగెను. శ్వశ్రువు వైకుంఠమున కరిగెను...

దులి:— అత్త మఱి లేదా? ఈ లోకమున లేదా?— (వృద్ధురాలిని చూచి) ఆహా! తల్లీ! ఈపాపకళంకిని, ఈ నిష్ఠురహృదయ నీ కెంత క్లేశ మొనఁగూర్చినది! అయ్యో! జీవితమున నిన్నొక మారు కాంచలేక పోయితిని; క్షమాప్రార్థనము సలుపఁజాలక పోయితిని; నీవాత్సల్య పూరితాశీర్వాదమును బడయలేకపోయితిని. ఆహా! ఎట్టి దారుణవేదన! ఎట్టి మర్మభేద్యసంఘుటనము! పతినీలాచలవాసి, శ్వశ్రువు వైకుంఠవాసిని, ఈ అనాథ బాలికాద్వయమే సంసారవాసినులా!— ఫిరోజా! నీవు మఱలి పొమ్ము. నేనిఁక నిముసమైన నిలువఁజాలను. నానాథు ననుగమించెదను.— సెలవోసంగుము. (త్వరితగతి ప్రస్థానము.)

ఫిరో:— సఖి! సఖి!- (వెన్నంటిపోవును.)

తిలో:— ఆహా! ఎట్టి పతివ్రత!— సోదరీమణీ! ఎట్టి నిష్కలుషిత పతి ప్రేమ ప్రదర్శించిపోయితివి! చనుము. సోదరీ! నిర్విఘ్నముగ చనుము. శీఘ్రసమ్మేళన మొదవును. (వృద్ధను సమీపించి) అమ్మా! అమ్మా! ఆశీర్వదింపవమ్మా! నాథుని మనోవాంఛ సఫలమగునటుల: ఈ అభాగిని హాస వదనమున నిను జేరవచ్చు నటుల ఆశీర్వదింపవమ్మా!

(శయ్యాతలమున కూర్చుండును.)   యవనికాపతనము.

## ద్వితీయదృశ్యము.

(సమరక్షేత్రమున సులేమాను శిబిరము).

సులే:— ఏమేమియీ? వారివృత్తాంతము లవమాత్రము తెలియవచ్చుట లేదా.

గూఢచారుఁడు:- — ఖుదావంద్ ! ఎంత వెదకినను ప్రయోజనము లేకపోయినది.

సు:— అసంభవము. మఱల చక్కఁగ అన్వేషింపుము. పొమ్ము. నా దలియా లేదా? కళాపహాడే కనవచ్చుటలేదా? అసంభవము. అసంభవము.

(నేపథ్యమున- జే! మహారాజ ముకుందదేవా ! జే! )

సు:— ఏమి ! యీ జయ నినాదము ?

(సైనికుఁడు ప్రవేశము.)

సై:— ఖుదావంద్ ! ముకుందదేవుఁడు శిబిరమును ముట్టడించెను.

సు:— ఆఁ ! సేనాపతిలేఁడా? మన సైన్య నివహ మేమైనది?

సై:— ఎవ్వరును లేరు. ఎవ్వరును కానరారు. అదే తిలకింపుఁడు. జహాఁపనాహ్! శత్రుసైన్యము క్రమక్రమముగ నికటవర్తి యగుచున్నది. అదే ఆలింపుఁడు. శత్రుసైన్యముల విజయోత్సాహ కోలాహల ధ్వానము.

(నేపథ్యమున "జే! జగన్నాథస్వామీ ! జే! జే!
ముకుందదేవు మహారాజా ! జే!")

సు:— ఏమి ఈ అద్భుతము ! రహమత్ఖాను లేఁడా ? శత్రుసైన్యాక్రమణార్థము 'గిరిశంకము' కడకు మనసమగ్ర సైన్యనివహ

మును కొనిపోయెదనని నాతో చెప్పియుండెను కదా! అతఁడచట లేఁడా? అందఱును పరాజయమునుపొంది పలాయనము స్వీకరించిరా? ఏమి ఈ భీషణ సంఘట్టనము! అదిగో శత్రు సైన్యములు నన్ను చుట్టు ముట్టుచున్నవి. నా దేహరక్షకులు కూడ నన్ను వీడిపోయిరా? పిలువుము. సేవకా! శీఘ్రముగా వారిని పిలువుము. నా చేతికొక ఖడ్గము – నా చేతికొక ఖడ్గము తెమ్ము – పొమ్ము.

(సేవకుఁడు త్వరితగతి ప్రస్థానము. ఉత్తేజిత భావుఁడై సులేమాను నేపథ్యమును దిలకించుట).

సే:— (ప్రవేశించి) సర్వనాశము. జహాఁపనాహ్! సర్వనాశము. ఎవ్వరును లేరు. ఒక్క కృపాణమును లేదు.

సు:— ఎవ్వరును లేరా? ఒక్క ఖడ్గమైనను లేదా? ఎట్టి భీషణ యంత్రణము. కలాపహాడ్! కలాపహాడ్! నేనెంత బుద్ధిహీనుఁడనైతిని! రహమత్ఖానుని విశ్వసించి ఎంత మూఢుఁడనైపోతిని! దులియా! దులియా! అంతిమకాలమున నిన్ను కన్నులారఁ గాంచలేక పోయితిని కదా! అబ్దుల్లా!

(ఉత్కల సైనికుల ప్రవేశము.)

ఉ. సై:— ఇదిగో– ఈతఁడే నవాబు. ఆక్రమింపుఁడు.

సు:— ఖడ్గము– ఖడ్గము.

ఉ. సై:— నఱకుఁడు. మంచి సమయము దొరకినది. నఱికి వేయుఁడు.

(హతమార్ప నుద్యుక్తులగు తరి ముకుందదేవుని ప్రవేశము)

ము— సైనికులారా! సావధానులు కండు! శత్రువు నిరాయుధుఁడు! ఏకాకి! ఇది మీకు గోచరించుటలేదా? మీరు క్షత్రియులా

లేక చండాలురా? తొలఁగిపొండు. నవాబు సాహెబ్! దయ చేయుఁడు— అజ్ఞానవశమున నాసైనికు లొనర్చిన నేరమును మన్నింపుఁడు. కైకొనుఁడీ నిశితాసి కైకొనుఁడు. సమరమునకుఁ దలపడుఁడు. (ఖడ్గమొంపు సులేమానున కొసఁగును.)

సు:— ఎవరు నీవు? నీవేనా వీరశిరోమణివగు ముకుందదేవుఁడవు? ఇంత మహనీయత్వమా?

ము:— ఆశ్చర్యమునకు కారణములేదు. నవాబు సాహెబ్? ఆహవమునం దార్యవీరుల కియ్యది సామాన్య ధర్మము.

సు:— అయిన నేనేకాకిని కదా!

ము:— భీతిల వలదు. నవాబు సాహెబ్! నేనొక్కఁడనె సమర మొనర్చెదను. ఉభయులకు ద్వంద్వయుద్ధము సాగుచుండు నంతదనుక నాసైన్యబృందము నీదరినైన జేరరాదు.

సు:— ఏమి ఈ ఉదారహృదయము!

ము:— నవాబు సాహెబ్! వృథా ప్రశంస పరిత్యజింపుము. నీవు వీరుఁడవు. ఇప్పుడు వీరోచిత కార్యమునకు తలపడుము. వృథా యోచనము వలనను— వృథా ప్రశంసవలనను కాలయాపనము చేయుట యుద్ధరంగమున వీరుని కృత్యము కాఁజాలదు.

సు:— వాస్తవము. నేను వీరుఁడను. వీరోచిత కార్యమున కున్ముఖుఁడ నయ్యెదను. సిద్ధము కమ్ము.

ము:— నేను సిద్ధముగనే యున్నాఁడను. తలపడుము.

(ఇరువురును యుద్ధ మొనర్చెదరు. సులేమాను పడిపోవును.)

సైనికులు:— జే! మహారాజా ముకుందదేవా! జే! అక్బరు పాదుషా జే!

ము:— సైనికులారా! నవాబును బంది యొనర్చి నా శిబిరమునకు గొనిపొండు. (స్వగతము) ఆహా! ఎంత విశ్వాస ఘాతు కత్వము! కతలు రహమత్ఖానుల దెంత భీషణ కుతంత్రము! భాగ్యవశమున రహస్య లేఖ హస్తగతమైనది. లేకుండిన సర్వ నాశము సంభవించి యుండును కదా! ఇరువురు నేకీభ వించి నన్ను నాక్రమించుటకు వారి యుద్దేశము. సరియే కాల విలంబనమున ప్రయోజనమేమి? నా సైన్యమువారి కంటెను స్వల్పము. కానిమ్ము. చూచెదనుగాక (ప్రస్థానము.)

సు:— అయ్యో! రాజా! నన్ను వధింపకయే విడిచి పోవుచు న్నావా? నా దులియా నా కడ లేదు! నా కళాపహాడ్ నా కడ లేడు! నా విజయలక్ష్మి నాకడ లేదు. సుఖశాంతులు నాకడ లేవు. ఈ జీవన ధారణమున ఏమి ప్రయోజనము. రహమత్ఖాన్! అః! ఒక్కపరి కనఁబడియెదవా? ఒక్కపరి నిన్ను చూడ గలిగిన— ఈ దారుణ ముష్టి ఘాతమున నీ శిరో దేశమును చూర్ణీకృతమొనర్చి వేసి యుందును. ఈ భీషణ ఘదాఘాతమున నీ ప్రత్యంగమును విదళిత మొనర్చివేసి యుందును. వృధా చింతనము! వృధా భావనము. సర్వ మును "ఖుదా," వాంఛాను సారము జరిగితీరును. సైనికులారా నన్నెటు కొని పోయెదరు? కొనిపొండు.

( సైనికు లతనిని ఖైదీగ గొని పోయెదరు. )

( రహమత్ కతలుఖానుల ప్రవేశము. )

కత:— భాయీ! రహమత్! నీ కంటకము తొలఁగి పోయినది. మఱి నాకంటకము తొలఁగించు నుపాయము నూహించితివా?

రహ:— చక్కని యుపాయము నిమిష మాత్రమున విధ్వంసమై పోయినది. ఆ రహస్య లేఖ ముకుంద దేవునికి చిక్కియుండిన

ఆతఁడు తప్పక హతుఁడగుటయో, నవాబు చేతి ఖైదీ యగుటయో తటస్థించి యుండెడిది. కాని ఇపుడట్లు కాక నవాబే అతని చేత బంధింపఁబడియెను. కథ అడ్డమై తిరిగినది.

కత:— నీ వా లేఖయందేమి వ్రాసితివి ?

రహ:— ఖాద్య శకటమును నే నెటుల దోపిడి సల్పినదియు, వానిని నే నెచ్చట దాఁచి యుంచినదియు, మన యుభయ సేనల సమ్మేళనమున కిటుల " బందోబస్తు " సల్పినదియు, నవాబు నెటుల విశ్వసింపఁజేసి శిబిరమున నొంటరిగ విడిచివచ్చినదియు మొదలగు విషయముల నందు వ్రాసి యుంటిని.

కత:— ఎవ్వని చేత నా జాబు పంపి యుంటివి ?

రహ:— అబ్దుల్లాచేత. నీవనుకొనిన ముకుంద దేవునకా లేఖ యందించునంతటి మూర్ఖుఁడని తలంపనైతిని. మించిపోయినది.

కత:— ఎంత బుద్ధిహీనుఁడు ! పోనిమ్ము. జరిగిపోయిన దేదియో జరిగిపోయినది. ఇప్పుడు కర్తవ్యమేమి ?

రహ:— గుప్త హత్య.

కత:— గుప్త హత్యయా ! అది చేయువాఁడెవఁడు ?

(అబ్దుల్లా ప్రవేశము).

అ:— ఇదిగో ! నేను వచ్చియున్నాను. దులియా ఏదీ ? సేనాపతీ! దులియా ఏదీ ? లేఖనందించి వచ్చిన దులియా నిచ్చెదనని చెప్పి యుంటివికదా ! ఏదీ ! ఇమ్ము ! నా ప్యారీ ! వేగము నాకిమ్ము.

క:— (రహమత్ఖానుతో) ఇతఁడేనా నీ రహస్య లేఖావాహకుఁడగు మిత్రుఁడు?

ర:— ఔను! హత్యాకాండయు ఈతనిచేతనే చేయింప నిశ్చయించితిని.

కత:—ఈ మూఢునిచేతనే మరల ఇదియు చేయింపఁ దలఁచితివా? ముకుందదేవుఁడని భ్రమసి ఈ పరి నిన్నే తుదముట్టించునేమో చూచుకొనుము.

ర:— మఱి ఈసారి భయములేదు. ఆతని నిప్పుడు బాగుగ నెఱిగియున్నాఁడు. (అబ్దుల్లాతో) చూడుము షాజాదా! ఇంకొక స్వల్పకార్యమును చేయఁజూచితివా నీకు నిశ్చయముగ దులియా నర్పించెదను.

అ:— వలదు. వలదు. సేనాపతీ! మఱి నీ మాటలు నే వినను. నీ కార్యమును నేనిఁక వినను. ఆహా! దులియా! దులియా! నా ప్రాణమా! నా ప్యారీ!

ర:— షాజాదా! ఈసారి యీ తగు మనుష్యుని యెదుట బాసచేసి చెప్పుచున్నాను. వినుము. ఇంకొక కార్యమును నెఱవేర్చిన నిశ్చయముగ ఆమెను నీ స్వాధీనమొనర్చెదను.

అ:— నిశ్చయముగ నట్లు సలిపెదవా? నిజముగ నా ప్యారీ నాకు లభించునా? అయిన చెప్పుము. ఆ కార్యమేమియో శీఘ్రముగ చెప్పుము.

ర:— ఈ ఛురిక కొనుము. నే నొసఁగిన లేఖ నెవనికొసఁగి వచ్చియుంటివో వానిని ఈ ఛురికాఘాతమున రహస్యముగ పొడిచి వేయుము.

అ:— మరల రహస్య హత్యయా? సేనాపతీ!

ర:— అట్లయిన పొమ్ము. ఇఁకమీద దులియా నామము విస్మరించి వేయుము.

అ:— ఆఁ! దులియా నామమును విస్మరించివేయుటా? ఉహూఁ! సేనాపతీ! తెమ్ము. ఏమియును భయములేదు. ఈక్షణమున నే నెఱవేర్చి వచ్చెదను. కాని.—

ర:— మరల కాని — ఏమి?

అ:— ఈ కార్యము నలిపి వచ్చిన దులియా నొసంగెదవుకదా ?

ర:— తప్పక ఇచ్చెదను. కాని అప్రమత్తుడవై కార్యమును నెఱవేర్ప వలయును జమా!

అ:— (బాకు గైకొని) ఏమియు సందేహింపకుము. అవలీలగా ఈ కార్యము నెఱవేర్పఁ జాలుదును. ఏమందువా? చూడుము. నాపై నమ్మకము కలిగి, ఈ ఉంగరము నాతఁడిచ్చియున్నాఁడు ఇది చూపిన, వారి సైనికు లెవ్వరు నన్ను వారింపఁ జాలరు.

ర:— వహవ్వా! బలే మజాగానే యున్నది. ఇతఁడు బహద్దరే!

అ:— కాని సేనాపతీ! దులియా నొసఁగెదవు కదా?

ర:— ఎన్నిసారులు చెప్పుదు నింక?

అ:— అయిన నిదిగో నేను పోవుచున్నాను. దులియా! దులియా! నాప్రాణమా! నాప్యారీ! (ఇంచుక నడచి మరలి వచ్చి) మఱి యొకమాట.

ర:— ఏమది?

అ:— ఆఁ! మఱి— పాదుషా బేగము సంగతి చెప్పియుంటివే? అట్లు తప్పక సల్పెదవు కదా?

ర:— తప్పక సల్పెదను. ముందీ కార్యమును ముగించి రమ్ము.

అ:— వారే వా! దులియా బేగమగును. నేను పాదుషా నయ్యెదను. కాదా? సేనాపతీ! దులియా బేగమగును. నేను పాదుషా నయ్యెదను. ఇట్లే కదా?

ర:— అవును. అట్లే.

అ:— అచ్ఛా! అయిన ఇదిగో పోవుచున్నాను. దులియా! దులియా

(ప్రస్థానము)

కత:— మంచి పిచ్చివానినే సంపాదించితివే!

ర:— ఈపిచ్చి నేనే ఎత్తించితిని లెమ్ము. కాని చూచితివా ఈతఁ డెన్ని కార్యములలో నుపకరించుచున్నాఁడో?

కత:— అవును. కాని రహమత్! ముకుందదేవుఁ డిటనుండి సజీవుఁడై వెడలుటను నేనెంతమాత్రము నిచ్చగింపను. ఆతఁడు జీవించి బైట పడియెనా, పాదుషా సర్వమును తెలిసికొనును. అటులే సంభవించిన నాభావిదశా ఫలిత మెంత నీచాతి నీచముగ పరిణమించునో ఊహించుటకుకూడ నేనశక్తుఁడనగుచున్నాను.

ర:— భీతిదక్కి యుండుము. అబ్దుల్లా యీసారి సర్వమును పరిష్కరించి చనుదెంచును. కాని, మిత్రమా! నవాబు నేఁడెట్టి దుర్దశకు పాల్పడెను!—

కత:— చాలకష్టముగ తోఁచుచున్నదియా? రహమత్ఖాఁ! నీవు సింహాసనాసీనుఁడవై, వారకామినీ పరివేష్టితుఁడవై మధుర మధుపాన నిర్మగ్నుఁడవై యుండుటఁకూడ ఇట్లే కష్టముగ తోఁచునా?

ర:— నవాబు జీవించియే యుండిన—

కత:— భయములేదు. నేనన్నియు చక్కఁబెట్టెదను. మిత్రమా! రమ్ము! పరస్పరాలింగనమున మన ప్రేమము ద్విగుణిత మొనర్చి వైచెదము.

(పరస్పరాలింగనము.) (తెరవ్రాలును.)

## తృతీయదృశ్యము.

(కటకమున ముకుందదేవుని బారవాటీ దుర్గప్రాంగణము.)
సమయము— రాత్రి.

"శిఖి" "మొనాయి" అను నిరువుర ప్రవేశము.

శిఖి:— అబ్బా! ఈ కటికిచీఁకటి మెంత భయంకరముగ నున్నది? ఇట్టి అంధకార నిశినేఁ బుట్టినది మొదలు చూడలేదుసుమా!

మొ:— అవును; చినుకులుకూడ పలుచగ పడసాగినవి.

శిఖ:— ఇంతరాత్రి మించినను, వాఁడింకను మరలి రాఁడేమి చెపుమా?

మొ:— ఎంతరాత్రి యైనది? జాముదాతిరికూడ కాలేదే. ఇంత తొందర కంగారు పడెదవేమి?

శిఖ:— కాని, చూచితివా యీ అంధకారమును, ఈనిశ్శబ్దమునుఁ అర్ధరాత్రముకంటెను భయంకరముగ తోఁచుటలేదా?—

మొ:— అవును. ఇది నిశ్చయముగ దేవుని దయా విశేషమన వలయును, కాకపోయిన మన కార్యమున కింత అనుకూలత కలిగి యుండునా ?

శిఖ:— ఇది నిశ్చయమే. ఈ కాళ రాత్రి నిజముగ ఆతని కొరకే సృజింపఁబడినది.

మొ:— చూడు. శిఖీ ! నీవు సేనాపతివైన ఇతనికి వలెనే నీరును కనులు నెత్తి కెక్కవుకదా !

శిఖ:— అన్నా.! నన్ను నిట్టు లనవలయునా ? అసత్యము కాదు. ఇది వినుము. నిజముగ మహారాజు కొరకు గదా మనమీ కార్యము చేయవలసివచ్చినది !

మొ:— అట్లుకాక మఱేమి ? ఎచ్చటినుండియో తెచ్చినవాని నొకని సేనానాయకునిగ చేసియుందురు.— ఇది సహింపఁదగినదియా? ఎవ్వఁడో యొక ముక్కు పచ్చలారని యువకుఁడు, మన కంటె ఆటువెనుకలవాఁడు ఒక్క పెట్టున మన తలఁదాటి పోవుట రక్త మాంసములు గల మానవుఁడెవ్వఁడు సహింప గలడు ?

శిఖ:— ఎంత అవమానము ? మనకంటె నేమేని ఆతఁడధిక మెఱిఁగిన వాఁడా ? అధికము చదివినవాఁడా ? నోరు మాత్రము కలదు. ఒకటి రెండు మాటలు గట్టిగ చెప్పఁగలఁడు. అంతేకదా ! గత యుద్ధమున అతఁడేమి వీరత్వమును చూపఁగలిగెను ?

ము:— వీరత్వమా ? వృద్ధసేనాధిపతి యుద్ధ భూమిని పడిపోయిన తత్క్షణమే సైన్యముల కూర్చుకొని యుద్ధ క్షేత్రము వంక పరువెత్తెను. ఇదియా అప్పుడు చేయవలసినది ? చూడుము. మన మెట్టుల ఇంటిపట్టున చేరి చెక్కుచెదరక హాయిగ భార్యాపుత్రులతో కలియఁ గలిగితిమి ?

శిఖ:— కావుననే బ్రతుకఁగలిగితిమి. ప్రాణముండిన బలుసుకూరైన తిని బ్రతుకవచ్చును.— అతఁడు యుద్ధమునుండి మరలునపుఁ డొక్కఁడైన మిగిలి యుండెనా ? అతఁడే స్వయముగ సగము చచ్చి వచ్చి యుండెను. ఇది మహారాజున కెంత నష్టమో తెలియుచునే యున్నది. కాని మహారాజు నిజము గుర్తింప జాలక మనము భీరువులమనియు, కాపురుషుల మనియు, నిందించెను. ఆతని వీరుఁడనియు, సాహసి యనియు అందున నతఁడే సేనాపతి యనియు ప్రశంసించెను.

ము:— అతని సాహసమిపుడే తెలియఁగలదు. రానిమ్ము—

శిఖ:— రాక ఎటుపోవును ?

ము:— అరె ! ఉండు ముండుము. అదిగో ! అలుకుడు విన వచ్చుచున్నది.— వచ్చుచున్నాఁడు.— కొంచెము ప్రక్క కొదిగి నిలువుము.—

శిఖ:— ఏల ? ఒక్క పెట్టున తుదముట్టింతము.—

( దులియా ప్రవేశము. )

దులి:— ఆహా! ఏమి యీయంధకారము? మార్గము కానరాకున్నది.—

శిఖ:— ఇదిగో ! ఇదే మార్గము. ( ఖడ్గమున దులియాను పొడిచి పాఱిపోదురు. )

( ఖడ్గము దులియా కరమున దూసికొని పోవును)

దులి:— హా ! (పడిపోవును.) చచ్చితిని. ప్రాణములు పోవుచున్నవి. ఫిరోజా ! — హా ! — ప్రాణములు పోవుచున్నవి.— హా ! ప్రాణేశ్వరా !

(ఫిరోజా, ప్రసూనులపశివేశము).

ఫి:— ఎవరు నీవు బాలకా! నీ నామము చాల చక్కనిది. నీవు దులియా నెచట నెఱుంగుదువు?

ప్ర:— నేను వంగదేశ వాసినైయుండియు, నవాబు దుహిత నెరుంగ కుండుటెట్లు సంభవించును!

ఫి:— మేము కొలందికాల మీ గ్రామమున నుండియుండిన ఆమె స్వస్థత పొందియుండెడిది. కాని ఆమె చెప్పిన వినుకొనెడి బాలికయా? ఇంచుక నడచు శక్తియొదవి నంతనె చూడు మెట్లు పథము తెలియని అంధకారమున నెంతచెప్పినను వినక ఒంటరిగ బయలుదేరి వచ్చినదో? నే నెంతయో పోరితిని. ఇట్టి నిశాసమయమున, ఈ దుర్గమపథమున అబలలము వెడలఁ జనదనియు, రేపు ప్రాతఃకాలముననే ప్రయాణమొనరింత మనియు ఎంతయో వాపోయితిని. ఆమె రవంతయినను లక్ష్య పెట్టినదా? ఇప్పుడీ కరాళగాఢాంధకారమున ఆమె ఎట లీనమై పోయినదియు ఎట్లు తెలియును? ఆమె ఎంతదవ్వు చనినదో నేనెట రోయుదును? నీవు మాతోడనె నీలాచలమున కరు దెంచెదవా? అటులైన నీ యుపకారము నెన్నటికిని మఱవఁ జాలము.

ప్ర:— నేను శ్రీ జగన్నాథస్వామి దర్శనార్థమై వెడలి యుండుట సత్యము. కాని ఈ భయంకర నిశాసమయమున మాత్రము రాఁజాలను. ఇట్టి సమయమున మార్గము చోరులకును హంత కులకును ఆకరము కదా!

ఫి:— ఆ భయహేతువుననె నీ సహాయము నర్థించుచుంటిని కదా!

ప్ర:— కాని మీరు నవాబు అంతఃపురవాసినులై ఒంటరిగ పురి వెడలివచ్చుట నాకమితాశ్చర్యకరముగ నున్నది.

ఫి:— (స్వగతమున) పాపము. బాలకుఁడు ప్రేమవలన కలుగు ఉన్మాదమునెట్లు గుర్తింపఁగలఁడు? (ప్రకాశముగ) ప్రసూనా! అది చాల పెద్దవిషయము.

ప్ర:— సరియే; పోనిమ్ము. మా నవాబు గృహవాసులగు మీ రనురోధము సేయుచుండునపుడు నేను తప్పక వచ్చెదను. విధి ఎట్లుండిన అట్లే అగును.

ఫి:— చాల ధన్యుఁడవు. నీ యుపకారము నెన్నటికిని మఱవఁ జాలము, రమ్ము. ఇప్పుడు మా చెలి ఉన్మాదినివలె ఎటు చనినదో ఆరయుదము.

దు:— హా! ప్రాణేశ్వరా! ప్రాణేశ్వరా!

ప్ర:— ఎవ్వరిదీ ఆర్తనాదము?

ఫి:— ఏమిది? ఇదేమి? చూడుము. చూడుము. ఇది నా చెలి కంఠస్వరమువలె నున్నది.

దు:— దాహము! దుర్భరము! ఫిరోజా! దాహము!

ఫి:— సఖీ! సఖీ! ఏమైనది? (ఎత్తి పట్టుకొని చూచి) ఏమిది? నా చెలి దేహమునుండి రక్తము స్రవించుచున్నది.

ప్ర:— రక్తమా! ఆఁ! ఆఁ! ఏ స్థలమునుండి? వక్షస్థలమునుండి కాదుకదా! ఎంతటి అంధకారము! దీపము! దీపము!

(ప్రవేశము- ఉత్కల సేనాపతి దీపహస్తుఁడై)

సే:— ఎవ్వరు దీపమడిగిరి? పథికులారా!

ప్ర:— పరమేశ్వరా! నీ కరుణాకటాక్షమునకు ధన్యవాదము! చూడుము ఫిరోజా! ఎటనుండి రుధిరము స్రవించుచున్నది?

ఫి:— హా స్తనమునుండి

ప్ర:— అయిన భయమువలదు. గాయము పడినచోట శీఘ్రముగా ఈ వస్త్రమును బంధింపుము.

(తలగుడ్డనుండి చించి యిచ్చును).

దు:— అబ్బా! దాహము! దాహము!!—

సే:— నేను జలము కొనితెచ్చెదను. (పోవుచు స్వగతమున) దుర్గ సమ్ముఖమున ఇట్టి నృశంస కార్యమునకు ఎవ్వఁడు సాహసించెను? [ప్రస్థానము.]

ఫి:— సఖి! సఖి! ఎట్లున్నది! ప్రసూనా! నా సఖి జీవించునా?

ప్ర:— ఏమియు భయమువలదు. ఈశ్వరానుగ్రహమున కృపాణము వక్షస్థలమున తగులుట తప్పెను.

దు:— ప్రాణేశ్వరా!— నాథా!— హా! దాహము! దాహము!!

ప్ర:— (దీర్ఘనిశ్వాసము విడిచి) ఆహా! ఈమె మానవియా? దేవీమూర్తియా? ఇంత గభీరప్రణయమా!

(ఇందుమతి, రాణియు, సేనాపతియు ప్రవేశము).

సే:— దేవీ! శ్రమపడి తాముకూడ ఏల విచ్చేసెదరు?

ఇం:— ఏమి సేనాపతీ! ఇందువలన నష్టమేమి? స్త్రీయెడ దుర్గసమ్ముఖమున ఛురికాప్రయోగము! ఇది సామాన్యవిషయమా? విపద్గ్రస్తులకు సాయ మొనరించుట రాజునకు ముఖ్యధర్మముకదా! రాజు రాష్ట్రమున లేనియెడ తత్కర్తవ్యము నెఱవేర్చుట నాధర్మము కదా? చూపుము. చూపుము. ఆమె ఏదీ?

దు:— హా! దుర్భరము!— ప్రాణములు పోవుచున్నవి— జలము—

ఇం — (దగ్గఱకుఁబోయి నీరము గ్రోలఁజేయును.) సేనాపతీ! నీవు చని పరివారజనమును తీసికొనిరమ్ము. ఈయమను దుర్గమునకు కొనిపోయి ఉపచారము లొనర్చెదము.

(సేనాపతి ప్రస్థానము)

దు:— ఆహా! అమ్మా! నీ వెవరు? హిందువువా?

ఇం:— అవును.

దు:— హా! తల్లీ! నేను మహమ్మదీయను—

ఇం:— అయిన నేమి? ఇట్టి విపత్సమయమున హిందూ మహమ్మదీయ విభేదమా?

దు:— తల్లీ! అంతియెకాదు. నేను శత్రుదేశస్థురాలను.

ఇం:— అయిన మాత్రము భయమేమి? విపద్గ్రస్తులను రక్షించుటయే క్షత్రియులగువారికి ధర్మము. నిరాశ్రయుల కాశ్రయ మొసంగుటయే హిందువుల కర్తవ్యము. ఇట్టియెడ స్వజాతీయ విజాతీయ విభేదము లేదు. శత్రు మిత్రుల విభేదము లేదు.

దు:— తల్లీ హిందూహృదయ మెంత యుత్కృష్టమైనది! ఇపుడు నాకు శక్తి యొదవుచున్నది. తల్లీ! నాకృతజ్ఞతాపూర్వ కధన్యవాదములను స్వీకరింపుము. ఫిరోజా! నాజీవనప్రదాత్రికి ధన్యవాదము లర్పింపుము. నడువుము. ఇంక విలంబము సహింపఁజాలను. ప్రాణేశ్వరా! హా! ఎప్పుడు నీదర్శన మబ్బును? (పోవనుద్యుక్తురాలగును).

ఇం:— ఇదేమి? ఈ నిశాకాలమున నెటకేఁగెదరు? నీహృదయేశ్వరుఁడు నిన్నేకాకినిగ సల్పి యెటకేని వెడలి పోయెనా?

ఫి:— అమ్మా! అది చాల పెద్ద విషయము.

ఇం:— కాని మిమ్ముల నిట్టివేళ నేనెంత మాత్రమును విడువఁజాలను. తేజస్సంకలిత మగు మీ ఆకారములవలన మీరు మహావంశ సంజాతులరనియు, నిశ్చయముగ ఏదియో దుర్ఘటమగు విపత్తున బడియుండిరనియు తెలియ వచ్చుచున్నది. కావున విపత్తునుండి మిమ్ముద్ధరించు దనుక మిమ్ము నెంత మాత్రము విడువఁజాలను. అదియునుకాక నా దుర్గసమ్ముఖమున విదేశీయ నారీజనము నెడ ఇట్టి నృశంసాచరణ మొనర్చిన ద్రోహిని శిక్షింపకయె, నా ప్రాంగణమున ఘాత పరుపఁబడిన నిస్సహాయురాలగు అబల నెట్లు ఉపచారముల నొనర్పకయె విడువఁగలను? విడిచిన, నా విపరీతాచరణమునకు ప్రజలేమని నుడివెదరు?

తోడి క్షత్రియులు నిందింపక విడుతురా? ధర్మము నశించి పోయెనా? జగన్నాథుని రాజ్యము పాపరాజ్యమా? ముకుంద దేవుని శాసనము లుప్తమై పోయెనా?

దు:— (వినిపించుకొనకయె) ప్రియతమా? ప్రాణేశ్వరా! హా! పోయెదను! రమ్ము!— ఫిరోజా! విలంబము సైపఁజాలను. రమ్ము!

ప్ర:— దులియా! ఆహా! నీవు మానవివా? దేవీమూర్తివా? నీచరణ ధూళి రేణువునకు సైతము నేను తుల్యుఁడ నగుదునా?

ఫి:— అమ్మా! మన్నించి మాకు సెలవొసంగుము.

ఇం:— వలదమ్మా! ఎంతమాత్రము మిమ్ము విడువఁజాలను. మిమ్ము విడువఁజాలను. మిమ్ము వేఁడికొనియెదను. నా ప్రార్థనము మన్నింపుఁడు. నా ఆతిథ్యమును స్వీకరింపుఁడు. అదిగో పరిజన మరుదెంచినది.

( స్త్రీ పరిజనముతో సేనాపతి ప్రవేశము. )

దు:— తల్లీ! ప్రాణప్రదాయని వగు నీ అనురోధమును తృణీకరింపఁ జాలను— దయచేయుము.

ఇం:— సేనాపతీ! ఈ బాలకునికి సౌకర్యము కూర్చు భారము నీది!

దు:— తల్లి! రేపు ప్రభాతమున మాకు సెలవొసంగెదరుగాక !

ఇం— సరియే. అట్లే చూచెదముగాక! అది తేపటి మాటకదా! ప్రథమమున ఈ అకించనుల ఆతిథ్యమును నేఁడు స్వీకరింపుడు.

దు:— తల్లి! నీవు సాక్షాద్దేవీమూర్తివికాని మానవమూర్తివికావు.

ఇం:— ఇందు ప్రశంసింపఁదగిన దేమున్నదమ్మా! ఇది మాబోంట్లకు నిత్యనైమిత్తిక కృత్యము. చెలులారా! ఈమెను మీకైదండ యొసఁగికొని రండు.

( చెలులు అట్లు చేయుదురు. )

దులి:— ఏమియు నక్కఱలేదు. నాకేమియు కష్టమొదవుటలేదు. నేను నడువఁజాలుదును.

(అందఱును దుర్గమున ప్రవేశింతురు.)

---

## చతుర్థ దృశ్యము.

యుద్ధభూమిని ముకుంద దేవుని శిబిరము.

( ప్రవేశము. ముకుందదేవు, సులేమాను సుల్తాను . )

ముకు:— నవాబుసాహెబ్ ! నేను రహమత్ఖానుని పత్రిమువలన సర్వమును తెలియఁగలిగితిని. ఇదంతయు నొక భీషణ కుతంత్రము. మిమ్ము శత్రు హస్తమున బంధితుల నొనర్చి రాజ్య విదూరుల సలుపుటయు, నన్ను నంతమొందించుటయు వారి గుప్తాభిప్రాయమై యుండెను. పర్యవసానము మీ రెఱుఁగుదురుకదా !

సులే:— మహారాజా ! అయిన ఇప్పుడు కర్తవ్యమేమి ?

ముకు:— మీరు స్వవిషయమున ఏమియు చింతింపవలదు. నా యీ కంఠమున ప్రాణవాయువులాడు చుండువరకు వారికుతంత్రము సఫలీకృతమగుట దుస్తరము. ఇపుడు నేను మీతోడ సలుపఁదగిన సంధిషరతులను గూర్చియు, కతలుఖానుని విశ్వాసఘాతుకత్వమును గూర్చియు సార్వభౌమునకు లేఖ వ్రాసియున్నాఁడను. ప్రత్యుత్తర మరుదెంచుదనుక మన మిచ్చటనే యుండవలయును.

సులే:— కాని, మీరు చాల అప్రమత్తులరై యుండవలయును. కారణ మేమనిన, మొగలు పఠాను సైన్యము లిపు డైక్యమై

యున్నవి. పరికింప వానికంటె మీా సైన్య మత్యల్ప సంఖ్య కలది.

ముకు:— వారి సైన్యాధిక్యము వలన భయపడవలసినది లేదు. పరిమిత సైన్యమైనను, న్యాయ యుద్ధమని గుర్తించి సైనికులు పోరఁగలుగునపుడు శత సంఖ్యాకులు సహస్ర సంఖ్యాకులను చెండాడఁ జాలుదురు. ఇదియె హిందు సైనికుల లక్షణము. ధర్మము కొఱకు, దేశము కొఱకు దుర్నిరీక్ష్యులై పోరు వారి నెవ్వరు నెదిరింపఁజాలరు. మఱియు కతలుఖానుని కౌశలము నేను పూర్ణముగ నెఱుఁగుదును. రహమత్ఖానుని చాతుర్య విశేషముల నిపుడు మీా వలన నెఱింగితిని. కాని, యీా విషయమున నే నధికముగ విచారింపను.— రాత్రి చాలవరకు దాఁటిపోయినది. ఇఁక మీారు విశ్రమింపుఁడు.

సులే:— మీారు నిద్రింపరా ? —

ముకు:— (స్వగతము) "నిద్ర" !— ఆ భాగ్య మీా రణస్థలమున నెక్కడిది ? (ప్రకాశముగ) నేను కక్ష్యాంతరమున కరిగెదను.

సులే:— అయిన, ఈ దీపిక నార్పివైచెదను.—

ముకు:— మీా కేమియు ఇబ్బంది లేని యెడల నార్పి వేయుఁడు. నా కేమియు నభ్యంతరము లేదు.

సులే:— అభివాదనము.

ముకు:— ప్రత్యభివాదనము. (ప్రస్థానము.)

సులే:— మానవుని భాగ్య పరివర్తన మిట్టిదియ. ఒకప్పుడు రాజ్య సింహాసనమున, సౌఖ్యతరంగాగ్ర భాగమున నోలలాడించును ఒకప్పుడు తృణ శయ్యా తల్పమున దుఃఖానల గుండమున కొట్టి మిట్టాడజేయును. ఆహా ! విచిత్రము— ఊహాతీతము— స్వప్నాతీతము !— మనుజుఁడు తానొకటి తలఁచిన దైవము

తానొకటి తలఁచును. నేనేమి తలఁచి యుంటిని ?— సమరమున విజయుఁడ నగుటకు— స్వతంత్రి నవాబు నగుటకు స్వతంత్రి రాజ్య మనుభవించుటకు. హా !— పర్యవసాన మేమైనది ?— పరాజితుఁడ నైతిని. పరాధీనుఁడ నైతిని. బంధీ కృతుఁడ నైతిని. సామాన్య తృణ శయ్యకు కూడ అనధికారినై పోయితిని. ఆహా! ఎట్టి హృదయవిభేద్య పరివర్తనము ? ఊహింపఁజాలను— మఱి ఊహింపఁజాలను.— దులియా ! దులియా ! ఎందేగితివి తనయా !— కళాపహాడ్ ! ఎటు మాయమై పోయితివి ? ఏల నన్ను వీడిపోయితివి ? నీ ప్రార్థనము వినుట లేదని నాపై నలిగి నన్ను పరిత్యజించితివా ?— అయ్యో ! నీవే యుండిన— నీ మంత్రిణమే నెఱవేర్చియుండిన, ఈ పాపాత్ముఁడు— రహమత్ఖానుఁడు, నృశంసనుఁడీ దశ నాకు కల్పింపఁజాలి యుండునా ? సమగ్రి వంగ దేశమునకు నవాబు, సామాన్య నిర్బంధితుని వలె నేఁడు కఠిన భూతల శాయినై విలపించియుండునా ? ఆః ! తలంచి, తలంచి, నా హృదయము విదీర్ణమై పోవుచున్నది. నామస్తిష్కము విఘూర్ణితమై పోవుచున్నది.

( దీపిక నార్పి శయనించును. )

( ఛురికా హస్తుఁడై అబ్దుల్లా ప్రవేశము )

అబ్దు:— ఇదియే ముకుందదేవుని కక్షాంతరము.— అబ్బా ! ఎంత చీకటి!— ఏఁడీ? ఆతఁడెచట శయనించి యున్నాఁడు? దులియా! నీవాదినమున నన్ను నరహంతకుఁడవని దూఱి పదాఘాత మొనరించి వెడల నడిచితివికదా ! నేఁడు చూడుము. సేనాపతి నాకు "సాదీ" కావించుటకు నిన్నెట్లు బంధించి యున్నాఁడో ?— నవాబుకూడ నిర్బంధితుఁడగుట మంచిదే యయ్యెను. కాని, మానస మొకవిధముగు నాందోళన మందుచున్నదేమి చెపుమా ?— రహమత్ఖాను చెప్పియుండెను.

నేను పాదుషా నయ్యెదనని; దులియా బేగమగుననని. కాదు. కాదు. నేనే బేగము నయ్యెదను; దులియా పాదుషా యగును. దులియా పాదుషావలె ఆజ్ఞాపించును. నేను బేగమువలె నెఱవేర్తును. వారేవా! క్యామజా !!— లావ్ సిరఫ్!- ఉండు ముందుము. కార్యము ముందు సానుకూలము కానిమ్ము ఏఁడీ ? అతఁడెచట శయనించియున్నాఁడు ? ఇదిగో ! శ్వాసము విడుచు శబ్దము వినవచ్చుచున్నది. అలస్యము చేసిన ప్రయోజనము లేదు.

( నిశ్వాసము ననుసరించి మెల్లన జని సులేమాను వక్షస్థలమున బాకుతో పొడుచును. )

సులే:— హా ! జాన్‌గయా ! జాన్‌గయా !

అబ్దు:— ఆఁ ! ఆఁ! ఎవరు ? ఎవరిది ? ఎవరిస్వరమిది ?—

సులే:— హా ! దు—లి— యా !—

అబ్దు:— ఎవరు ?— ఎవరిది ?— హా ! తండ్రీ !—

సులే:— ఎవరునీవు ?— ఎవరిస్వరమిది ?— అబ్దుల్లా !

అబ్దు:— తండ్రీ! తండ్రీ! హా! నేనెంత నృశంసుఁడను? (ఆలింగనము)

సులే:— అబ్దుల్లా! అబ్దుల్లా! (ఆలింగనమున) నీవు న్యాయమునే సలిపితివి.— నాస్వప్నము నేడు సఫలమైనది.— నా పాపమునకు నేఁడు ప్రాయశ్చిత్తమైనది. వినుము బేటా! నా పాపకలుషిత వాక్యముల వినుము.

అబ్దు:— హా! తండ్రీ! తండ్రీ!—

సులే:— వినుము. వినుము బేటా! నాశక్తి క్షీణించి పోవుచున్నది.— నీవు నా జ్యేష్ఠసోదరునికి ఏకపుత్రుఁడవు. దులియా ఆతనికి ఏక పుత్రిక. నీ బాల్యముననే పితృవియోగము సంభవించినది. నేను పాలకుఁడ నైతిని.— హా! రాజ్యలాలసమున నీమెడ మహాప

చార మొనర్చితిని. నీవు యుక్తవయస్కుఁడవగు నప్పటికే నీ వున్మత్తుఁడవని రాష్ట్రమున ప్రచారము గావించితిని. నా అభిలాషము సఫలమైనది.— దులియాను బాల్యమునుండియు పుత్రికావాత్సల్యమునఁ బాలించుటచే నామె నేనే తన జనకుఁడనని తలంచెను. నీవుకూడ యట్లే తలంచి యుంటివి.— హా!

అబ్దు:— తండ్రీ! తండ్రీ! మఱి ఆమాట లాలించుటవలనఁ బ్రయోజనమేమి?— హా! దులియా నాసహోదరి! అయ్యో! అయ్యో! నేనెంత పాపాత్ముఁడను? ఎంత ఘోరకర్ముఁడను?— తండ్రీ! అయ్యో నీవెటుల జీవింతువు?...

సులే:— వలదు. తనయా! జీవించుటవలన ప్రయోజనము లేదు. జరుగఁదగినదియే జరిగినది. పాపాత్మునకు ప్రాయశ్చిత్తమయినది.

అబ్దు:— హా! త్రండ్రీ! ఈ హంతకుని క్షమింపుము.— ఈ కార్యము_

సులే:— తెలిసికొంటిని తనయా! రహమత్ఖానుని— ఆ విశ్వాసఘాతకుని ప్రేరణవలన నీవీ కార్యమునకుఁ బాల్పడితివి, కాని అప్రమత్తుఁడవై మెలఁగుము. ఆ ద్రోహి నిఁక విశ్వసింపకుము. ప్రకృతమున నాయాదేశము నెఱవేర్పుము. కళాపహాడు నన్వేషింపుము. దులియా నన్వేషింపుము.— స్వరాజ్యము నుద్ధరింపుము.—

అబ్దు:— తండ్రీ! దులియా నా నిజ సహోదరియను విషయమేల దాఁచితివి? ఈ విషయమును ముహూర్తకాలముకిందనేలఁ దెలుపవైతివి! హా! నేనెట్టి ఘోరమాచరించితిని? రహమత్ఖా! చూపెదను— చూపెదను — అబ్దుల్లా యెట్టి నరపిశాచమో చూపెదను. ఎట్టి నరహంతకుఁడో చూపెదను. — దులియా! దులియా!— నన్ను సోదరన్యాయమున మన్నింపుము. కళాపహాడ్! కళాపహాడ్! అజ్ఞానియని నన్ను

మన్నింపుము. తండ్రీ! తండ్రీ! నన్ను నిరుపయోగమగు భూర్త సంతానమని క్షమింపుము.—

సులే:— నా తనయా ! క్షమాప్రార్థన మావశ్యకముకాదు. ఇది దైవనిర్ణీతము. నా పాపమునకు సముచిత ప్రాయశ్చిత్తము. ఇందు నీ దోషమేమియులేదు. నేటినుండియు నేను పోవు చున్నాను. నీవలన నేడు నేనీ పాపభారమునుండి విము క్తుఁడ నగుచున్నాను— దులియా !— దులియా !— కళా పహాడ్ !— నేను నిర్భాగ్యుఁడను. అంత్యకాలమున మిమ్మొక పరి కాంచలేకపోతిని.— కాని, నేను ధన్యుడను. అబ్దుల్లాను కౌఁగిలింపఁ గలిగితిని.— అబ్దుల్లా — హా! జీవితమున నిన్నె ప్పుడు నాదరింపనైతిని. రమ్ము !— బేటా ! మరణకాలమున నొకపరి నిన్నాలింగన మొనరించుకొని ప్రశాంతుఁడ నయ్యె దను. (ఆలింగనము) -- అ-బ్దు-ల్లా !- హా !- దు-లి-యా- !- క-ళా-ప-హా-డ్ - !- (మృత్యువు).

అబ్దు:— హా ! హా ! తండ్రీ ! తండ్రీ !— వాస్తవముగ నేడు నీవు పాపమునుండి విముక్తుఁడవై పోయితివి. నీవు పవిత్రమలుఁడవై పోయితివి. కాని, ఈ నీ పితృవిహీన తనయుని నిరాశ్రయు నొనరించిపోయితివేల ? చనుము ! తండ్రీ ! వెనుదిరిగి చూడ కుము. ఆ యమర ధామమునకు వెడలిపొమ్ము. పవిత్ర మలుఁడవై, ఆ నీలాకాశమునందలి యుజ్వలతారకాగణమున మహోజ్వలుఁడవై విరాజిల్లుము. ఆ నీసముజ్వలాలోక రశ్మిని గ్రహించి, ఆ నీ మహాపవిత్ర శక్తిస్వరూపమును గ్రహించి, జీవన పథము నందగ్రసరుఁడ నయ్యెదను. కర్తవ్య కర్మాచరణమునఁ బ్రవృత్తుఁడ నయ్యెదను.— రహమత్ఖాన్ !— రహమత్ఖాన్ !— పాపాత్మా !— కులపాంసనా ! నీ శిక్షాదాన మును, నీ మంత్రణాదానమును నీకే నేడు ప్రదాన మొన రింతును. నీ యెడనె పరీక్షించి చూచెదను.— రమ్ము!-

తండ్రీ! రమ్ము! (సులేమాను మృతదేహము నెత్తుకొని) పవిత్రకాయమును పరుల నెవ్వరిని స్పృశింపనీయను. స్వస్కంధ దేశమున కొనిపోయి, ఈ భూదేవి పవిత్రగర్భమున పునర్జన్మముకొఱకు భద్రపఱచెదను.— తదుపరి కర్తవ్యమేమి! — ప్రతిహింస — అనుసంధానము — స్వరాజ్య రక్షణము.— (ప్రస్థానము).

( త్వరితగతి ముకుందదేవుని ప్రవేశము. )

ముకు:— ఎంత చింతించినను, ఇచట వసించుట శ్రేయస్కరమని తోఁపకున్నయది. మొగల్లు పఠాను సైన్యములు కలసి నా సైన్యము కంటె త్రిగుణముగా కన్పట్టుచున్నవి. విశ్వాసఘాతకులగు రహమత్కతలు ఖానుల కుతంత్రము వలన నేనొక కాఫరుననియు, మహమ్మదీయ మతమును విధ్వంసమొనర్చి వారిపైఁ బ్రభుత్వము నెఱపవచ్చితిననియు వారెల్లరు దృఢ నిశ్చయులై పోర సిద్ధపడి యున్నవారలు. ఇందు లవమాత్రమును సందేహము లేదు. ఇట్టి పరిస్థితులయందు మూర్ఖించి నిలుచుట జన క్షయమునకె కారణమగును. కావున నే నిపుడు స్వయముగ ఢిల్లీపురి కరిగెదను. సమస్త విషయము లట పాదుషా కెరిఁగించెదను. ఆవశ్యకమగునేని ఈ ద్రోహుల హతమార్చుటకు వలయు సేనా నివహమును కొని రావలయును. (ప్రకాశముగ) నవాబ్ సాహెబ్! లెండు.

నవాబ్— (పరికించి) ఏమిది? నవాబు లేఁడేమి? బాదా ఏమయ్యెను?— పలాయితుఁడయ్యెనా?— ఎవరక్కడ? సేవకా! సేవకా!

( కన్నులు నులుముకొనుచు ద్వారరక్షకుఁడు ప్రవేశము. )

ద్వార:— మహా—

# ఉత్కల పతనము :

ముకు:— బందా ! నవాబెక్కడ ?

ద్వార:— బందా ! ఇది— (పరికించి స్వగతమున) అరె ! బందా ఏఁడీ ! (ప్రకాశముగ) మహారాజా !

ముకు:— చెప్పుము. బందా యేమయ్యెను ?

ద్వార:— అపరాధము. మహాప్రభూ ! ఈ నిర్భాగ్యుఁడు క్లాంతి వశత నిద్రించెను.

ముకు:— ఏమీ ? ఏమంటివి ? "క్లాంతి వశత నిద్రించితి" ననియా? ఉత్కలీయుని ముఖమునుండి నేఁడు నిద్రా శబ్దోచ్చారణమా? ఉత్కలీయుని ముఖమునుండి నేఁడు క్లాంతి శబ్దోచ్చారణమా ? ఎవ్వరి బలపరాక్రమముల సముగ్రోత్కల ఖండము నేఁటి పర్యంతమును దుర్దాంత మొగలు పఠానుల మహాకరాళ గ్రాసమునుండి సురక్షితమై యొప్పారుచున్నదియో, ఎవ్వరి వీర్య విక్రమముల గౌరవాన్వితమగు కేసరి గంగవంశో త్తప్త రక్త ప్రవాహముధావితమై వెలయుచున్నదియో, ఆ సుప్రసిద్ధోత్కల జాతియా ఇది ? అయిన, నేఁడేమి యీ విపరీత పరివర్తనము ? నిజ వివేక సమ్ముఖమున, అపర జాతి సమ్ముఖమున, సమగ్ర జగమ్ము సమ్ముఖమున, స్వజాతీయ గౌరవమున నేఁడేమి ఈ పరివర్తనము ? జాగరణ సమయమున నిద్రయా ? కర్తవ్య పాలనమున సోమరితనమా ? యుద్ధ సమయమున అవసాదమా ? కేసరిగంగ వంశీయోత్కలుల దెంతటి అధఃపతనము ? గ్రహతారకలారా ! నేఁడు మీ సముజ్వలాలోకనమున నెట్టి ప్రదర్శనము దర్శింపఁ జేసిరి ? పవిత్ర సమీరణమా ! నేఁడు నీ గంభీర హిల్లోలమున ఎట్టి దుశ్శబ్దముముల నాలింపఁజేసితివి ? ఉత్కల "శయన"మా ? ఉత్కల "క్లాంతి" యా ? పూర్వ జాతీయగౌరవమునకు నేటినుండి అవసానమా ? పూర్వప్రతిష్ఠిత మాతృ సమారాధనము నేటినుండి నిశ్శేషమయ్యెనా ! నేనేమి వినుచున్నాను ?

నేనేమి కనుచున్నాను? గగనరంగమున ఏమి యీ భీషణ చిత్ర మద్భాసితమై కనవచ్చుచున్నది. వాయు హిల్లోలమున ఏమి యీ ఆర్తప్రణాదము శ్రవణ గోచరమగుచున్నది ? ఉత్కలీయుల జాతీయత నీలాచల సహితముగ నవల సముద్రగర్భమున నిమజ్జితము! ఉత్కల స్వాధీనత్వము దశాశ్వమేధ ఘట్టప్రస్తర ఖండోపరిభాగమున చూర్ణీభూతము !! —

(నేపథ్యమున సైనికులు.— మహారాజా ! మహారాజా !)

ముకు:— లెండు, లెండు ! ముకుందదేవుని కంఠమున ప్రాణవాయువులున్నంత దనుక, ఉత్కల గౌరవము, ఉత్కల స్వాతంత్ర్యము. రక్షింపుఁడు ( వేగముగ ప్రస్థానము )

---

## పంచమ దృశ్యము.

పూరి— శ్రీ జగన్నాథ దేవాలయ ప్రాంగణము.

కళాపహాడ్, పండితులు ( పండాలు ) ప్రవేశము.

కళా:— ప్రభూ! ప్రభూ ! ఎన్నటి కీపాపజీవియెడ కృప జనించును? నిన్ను పిలిచి పిలిచి దేహమున రక్తము శుష్కించి పోయినది. హృదయ తేజము లుప్తమై పోవసాగినది. దేవా ! మఱి పిలువఁజాలను. ప్రభూ! దర్శన మిమ్ము. ఓ ! పతితపావనా ! ఈ దీనుని యెడ దయఁజూపుము. దీన జనావనా ?

ప్రథమ పం:— అరే ! యవనుఁడా ! ఏల వృథాయిట పడియెదవు? నానా జాతులిట సంక్రమించుట కిది "మసీదు" కాని 'చర్చి' కాని కాదు పొమ్ము.

కళా:— మహాశయా ! నేను హిందువునైయుంటినికదా ! నాఁడు చైతన్యదేవుఁడు మహమ్మదీయునికూడ హిందువు నొనరించి యుండెనే !

ద్వి. పం:— ఓహో! చైతన్యదేవుని విషయమెత్తుచున్నావు. అతఁడు మనవలె సామాన్య మానవ మాత్రుఁడనుకొంటివా? బేబి ఖారివి. నీవు ముసల్మానువైననేమి? కిరస్తానువైననేమి? ఎవ్వరికి కావలయును? కాని, చూడుము. ముక్తమండపము* నందలి సభ్యులెవ్వరును 'వెట్టిచాకిరి' చేయుటకు కూర్చుండ లేదు. ఊరకయె నీకొఱకు సభసలిపి ఈ మీమాంస పరిష్క రించుటకు ఏదియో కొంత వెలికి తీయుము. పండితులకు సమ ర్పింపుము. నీవుకూడా లేనివారి యింటిబిడ్డవు కావుకదా!

కళా:— ప్రభూ! ప్రభూ! ఏమి వినఁజేయుచుంటివి? ఈ పాపకర్ణ పుటముల ఎట్టి కలుషితవాణి వినఁజేయుచుంటివి? సుపవిత్ర హిందూధర్మ మిటులేల నిందిత మొనర్చుచుంటివి?

ద్వి. పం:— ఏమి ధర్మభావము? పదవయ్యా! ఇచట నిలిచియుం డిన ఏమి దొరకును? ముక్తమండపమున కూర్చుండిన ఇప్ప టికి రెండు కానులు చేఁజిక్కియుండును.

ప్ర-పం:— చూడుము. సాహెబూ! ఇట పడి యుండుటవలన ఏమియు ప్రయోజనము లేదు. ఒకపరి హిందూ ధర్మమును పరిత్యజించిన మరల ఆధర్మ స్వీకారమున కెట్టి వారికిని అర్హత లేదు.

---

* ముక్తమండపము = ఇది (పూరీ) జగన్నాథస్వామి ఆల యము నందలి యొక సుప్రసిద్ధ మండపము. విశాలమై, శిల్పచా తుర్యమొప్ప, నయనానందకరమై విలసిల్లుచుండును. పండితులెల్ల వేళల నిట నిండియుందురు. ఏదియేని శాస్త్రవిషయము వచ్చినపు డిట వీరు సభజరపి పరిష్కరింతురు. తక్కిన వేళల యాత్రికులను యాచించి ధనము గడింతురు.

పు. అప్పలస్వామి.

కళా:— ఈ ధర్మ మింత నిదారుణమా ? మహాశయా ! కాదు. ఇంకొకపరి సరళ హృదయమున భావించి చూడుఁడు. ఈ దౌర్భాగ్యుఁడు, ఈ పాపాత్ముఁడు గుండెలపై చేయినిడి చెప్పు చున్నాడు— ఈ పాతకి పద్మాక్షుని పవిత్ర నామోచ్చారణ మొనర్చి చెప్పుచున్నాఁడు. ఈ అకించనుఁడు యథార్థముగ అనుతప్తుఁడు. ఈ దోషి నిజపాప పరిహారమున కెట్టి కఠోర ప్రాయశ్చిత్తమునకైన సంసిద్ధుఁడు. ఒక్కపరి మాత్ర మను మతింపుఁడు. ఒక్కసారి మాత్రము దయార్ద్ర హృదయులై ఆజ్ఞ నొసంగుఁడు. ఈ అధమాధముఁడు తన దీన జననీపాద కమలముల మఱల సేవింపఁగలుగు సత్యము నిరూపింపుఁడు. ఈ భాగ్యహీనుఁడు తన సాధ్వీ మతల్లియగు నర్థాంగి ప్రణయము పడయగలుగు నుపాయ మాదేశింపుఁడు.

ద్వి-పం:— పదవయ్యా ! నీని యుపన్యాసము విను చున్నావేమి ? ఈ ముండ కొడుకేమైన ఒసఁగునా యేమి ? ఇట నిలచి యుండుటకు ?

కళా:— అయ్యా ! మీరు పండితులు కారా ? పండితు లాచరింప దగినదేనా యిది ?

ద్వి-పం:— వినండయ్యా ! వినండి ! మా పాండిత్యమునే దెప్పు చున్నాఁడు. ఓరి తురక ముండకొడుకా ! మేము పండితులము కాకపోయిన నీవా పండితుడవు? డబ్బు పైకితీయుము. చూచెదవు మా పాండిత్యము ! శాస్త్రమువలన ప్రాయశ్చిత్త విధానము నొప్పించెదమో లేదో నీవే చూచెదవు.

కళా:— న్యాయము లంచముపై ఆధారపడియున్నదా ? — వివేకముపై కాదా ? ప్రాయశ్చిత్త మర్థముపై ఆధార పడియున్నదా ?— అను తాపముపై కాదా ? ఇదియేనా హిందూ ధర్మము ? ఇదియేనా సర్వపురాతన నానావిధ శాస్త్రాలంకృత నానా విధావతార పరిశోభితమగు హిందూధర్మము ? దీని

పరిణామ మిదియా ? అసంభవము !! అసంభవము !!! ప్రభూ! ప్రభూ ! పరీక్షించుచున్నావా ? దీనుని యెడ కరుణింపుము. అభాగ్యుని యెడ ప్రసన్నుఁడవుకమ్ము.

ద్వి-పం:— మ్లేచ్ఛుఁడు చాలభక్తుఁడే ! యవనుఁడు సర్వశాస్త్ర పారంగతుఁడే ! అహ్హాహ్హా !

ప్ర-పం:— వదవయ్యా తెల్లవాఱకమునుపు తురకవాని మొగము రోజును చూచు చుండుటవలన అన్నియు అనర్థకములే. వీని నిట నుండి గెంటివేయ కుండిన మనకు మంగళ మొదవదు. ఓరీ ద్వారపాలకులారా ! ఎవరురా అక్కడ ? మీ కనులకు కనుపడదా యేమి ? మాసము నుండియు ఈ తురకవాఁడు వచ్చి సింహ ద్వారమును అపవిత్రమొనర్చి వేయుచున్నాఁడు. ఇది యేనా మీద్వారపాలనము ?

ప్ర-ద్వా:— స్వామీ ! మీవంటి పండితులే ఊరకుండిన మావంటి మూఢుల మేమిచేయగలము ? అదియుఁగాక ఇతఁడు ముక్తి మండపమునకు దరఖాస్తు పెట్టికొన్నట్లును కూడ విన్నారము.

ప్ర-పం:— దరఖాస్తు త్రోసివేయబడినది. కావున వీని నిట నుంప వలదు. గెంటివేయుఁడు.

ద్వి-పం:— లెండు. తత్క్షణమే యీడ్చివేయుఁడు. ఈ ముండకొడుకు చాల గడుసువాఁడు. చేతిది విడువకూడదు. కార్యము చక్కఁబడవలెను.

కళా:— హా ! ప్రభూ ! ప్రభూ ! ఈ పాపి చాలా ఆశతో వచ్చి యున్నాఁడు. హతాశు నొనరింపకుము. ఈ నీ సేవకులను సుప్రసన్నులను చేయుము. ఈ కలుషాత్ముని ఉద్ధరింపుము.

ప్ర-ద్వా:— అయ్యా ! లెమ్ము. అటనుండి వెడలిపొమ్ము.

ద్వి-పం:— ఏమిరా! వాఁడు యాత్రికుఁడనుకొనుచున్నావా యేమి? "అయ్యా" "గియ్యా" అని మాట్లాడుచున్నావు. తగుల నిమ్ము రెండు. తురకముండాకొడుకును. చూచెద రేమి? రెండు గట్టిగ తగులనిండు.

ద్వారపాలకులు:— మార్ సాలాకు మార్! (కొట్టెదరు)

కళా:— ప్రభూ! ప్రభూ! ఈ శాస్తియే ఆదేశించియుంటివా? నీవు కరుణానిధివయ్యు, ఇట్టిశిక్ష నాకొసంగితివా? కానిమ్ము, ఈ పాపి ఈ కఠోరశిక్షల సానందుఁడై అనుభవించును. ఈ శాస్తి నీ దోషి ప్రహృష్టహృదయుఁడై స్వీకరించును. ఇదియే నీ ఆదేశమైన, ఇందుచే ఈ పాతకికి ప్రాయశ్చిత్తమగును. ఈ ధర్మపతితుఁడు మఱల సుధర్ముఁడగును. ఈ కులభ్రష్టుఁడు మఱల కులమున ప్రవేశింపఁగలుగును.

ప్ర-పం:— ఓరీ! వీఁడు మొండికెత్తెను. "వస్తాదు" వలె పడి యున్నాఁడే! ఈడ్చివేయుఁడు. ముండాకొడుకును.

(ద్వారపాలకులు మఱల కొట్టుచుండ దులియా ప్రవేశము)

దులి:— ప్రాణేశ్వరా! ప్రాణేశ్వరా! ఏమి ఈ దృశ్యము? యేమి ఈ భీషణవ్యాపారము?— (ఆలింగనము).

పం:— ఓహో! వీనికొక భోగముది కూడ నున్నదే! తన్నుఁడీ చండాలపు ముండను.

(ద్వారపాలకులు దులియాని ప్రహారము సలుప ఆమె మూర్ఛిల్లును).

(ఫిరోజా ప్రవేశము).

ఫిరో:— నరాధములారా! రాక్షసులారా! ఏమి చేయుచున్నారు మీరు?

పం:— ఇంకొక తెకూడ వచ్చినది. చూచెద రేమిరా?

ద్వా:— (ఫిరోజాను ప్రహారము సలుపుట).

(షరీసూనుఁడు ప్రవేశించును).

ప్రిసూ:— ఏమి ఈ భీభత్స కాండము ? (శ్రీ) నీలాచల నాథుని సమ్ముఖమునసే ఏమి అత్యాచారము ? నారీ జనమునెడ అత్యాచారము !— భక్తునియెడ అత్యాచారము !! అసహ్యము అసహ్యము ! పండితులారా ! ఇదియేనా మీ శాస్త్రాలోకనమునకు నిదర్శనము ? ఇదియేనా మీ ధర్మాచరణమునకు ఉదాహరణము ? ఇట్టి భావముల తోడనేనా మీరు హిందూ ధర మాహాత్మ్యము విజృంభింపఁ జేయుచున్నారు ? ఇట్టి భావముతోడనేనా మీరు (శ్రీ) జగన్నాథుని మహిమ సంకీర్తనము చేయుట ? ఛీ ! మీకు ధిక్కారమగుఁగాక ! పండితులగు మీకేల ఈ జడత్వము ? బ్రాహ్మణులగు మీకేల ఈ నీచత్వము ?— ( కళాపహాడ్ నుద్దేశించి ) ఆర్యా ! ధర్మభీరూ ! నిరుత్సాహుఁడవు కావలదు. పశ్చాత్తప్తుఁడవు కమ్ము— క్షమార్పణా సక్తుఁడవు కమ్ము.

ద్వి. పం:— ఎవఁడీ పల్లెటూరివాఁడు ? వీఁడుకూడ ఈ కూటములోనివాఁడె యని తోఁచుచున్నది. చూచెద రేమిరా ? కొట్టుఁడు.

( ప్రిసూనుని ప్రహారము సలుపుట. )

ప్రిసూ:— ప్రభూ ! నీలాద్రినాథా ! నేఁడేమి భీభత్సలీల ప్రదర్శించుచున్నావు ?

( కళాపహాడ్డు లేవ నుంకించును. )

ప్ర-పండా:— ఓహో ! యవనుఁడు మరల లేచుచున్నాఁడు ? చూచెద రేమిరా ?

( కళాపహాడ్డును కొట్ట నేగుదురు. )

ప్రిసూ:— కొట్టుఁడు. మీ యిచ్చవచ్చినటుల నన్ను కొట్టుఁడు. కాని, పరుని యెడ అత్యాచారమును చూచి సహింపనోపను. హిందూఁజాతి ఇంత నీచముగ పతితమగుట సహింపఁజాలను.

(ప్రసూనుఁడు కళాపహోదున కడ్డమువచ్చుట, అతని పండితులు కొట్టుట, ప్రసూనుఁడు పడిపోవుట).

క:— (సక్రోధుఁడై లేచి) ఇదియేనా హిందూజాతము? ఇదియేనా హిందూధర్మము?— ఇంత నీచాశయమా? ఇంత తుచ్ఛ సంకల్పమా? మఱి సహింపఁజాలను. స్వవిషయమున జరిగిన అత్యాచారమును సహించితిని. ఆత్మీయులయెడ అత్యాచారమును సహితము సహింపఁగలిగితిని. తుదకు పరునియెడ, స్వజాతీయునియెడ, మమ్ముల రక్షింప నేగుదెంచిన పుణ్యాత్మునియెడ అత్యాచారమా? అసహ్యము! అసహ్యము! నితాంతాసహ్యము!!!

పం:— అబ్బో! వీఁడు మండిపడుచున్నాఁడు. పాఱిరండు! పాఱిరండు! (పలాయనోద్యుక్తులయ్యెదరు).

కళా:— పాఱిపోకుఁడు. పలువలారా! నిలువుఁడు. ప్రకృతమున మీ రేమియు భయపడవలదు. మిమ్ములను తెగటార్పఁబూని నాకరముల నపవిత్ర మొనర్పను. ఇయ్యది మీపాపాచరణమునకుఁ దగుప్రాయశ్చిత్తమును కాఁజాలదు. మీప్రాయశ్చిత్తమున కేమి ప్రతిక్రియ నూహించితినో వినియెదరా? మీమతము నెడ, మీధర్మము నెడ, ఎట్టిప్రతిక్రియ కావింపనుంటినో వినియెదరా? మీ స్వామి విగ్రహము నెడ ఎట్టి దండన విధానమును కల్పింప నెంచితినో వినియెదరా? నిలువుఁడు! కర్ణముల విస్ఫారిత మొనరింపుఁడు. అనిమిషనయనులుకండు! హృదయము లస్పందహీన మొనరించి కొనుఁడు.

అందరు:— ఆఁ! ఆఁ!— ఏమిది! ఏమిది!—

ప్రసూ:— స్థిరులుకండు. ప్రభూ! స్థిరులుకండు.

కళా:— వినుఁడు. నరపిశాచములారా! మీరెట్టి అత్యాచారము నేఁడీ నిరీహబాలికలయెడ సాగించితిరో, ఎట్టి నృశంస వ్యవహారము ఈ నిర్దోషబాలకునెడ ప్రదర్శించితిరో, సరిగ మెట్టి అత్యాచారమును, ఎట్టి వ్యవహారమును, ప్రత్యంగమునను మర్మభేద్యముగ ననుభవించితినో, అట్టి అత్యాచారమునే అట్టి నృశంస వ్యవహారమునే ప్రతి హిందూబాలకయెడలను సాగించెదను; ప్రతి హిందూపురుషుని యెడలను ప్రదర్శించెదను.

ప్రసూ:— శాంతింపుము. ప్రభూ! శాంతింపుము.

కళా:— అంతియె కాదు. రక్కసులారా! తులువలగు మీ ఆరాధ్య దేవతను ప్రాణశూన్య జడపూర్ణ కాష్ఠ పుత్తలికను అచిరకాలమున చూర్ణ-విచూర్ణ మొనరించివైచెదను. మీ అనూన కలానిధాను, మీ మహోన్నతకీర్తి పుంజమును అగు మీయీ మహామందిరమును అనతికాలమున ధ్వస్త, విధ్వస్త మొనర్చి వైచెదను. మీ జాతీయ యాత్రాస్థలమును, మహాక్షేత్రము నగు ఈ పూరీధామమును, అచిరకాలమున భస్మీభూత మొనర్చివైచి కాళరూప మహాసముద్ర గర్భమున విలీన మొనర్చివైచెదను. సమగ్రరాజ్యమపుడు విహీన తేజమున మృతప్రాయమై కన్పట్టును. సమగ్ర భారతవర్షమపుడు ఆగ్నేయగిరి సదృశప్రకంపనమున అల్లాడిపోవును. సమగ్ర భూమండలమపు డనిమిషనయనముల విస్మయాన్వితమై పరికించును. రుధిరస్రవంతులతో ఈ వంగోపసాగర మరుణరంజితమైపోవును. శవభారమున ఈ పృథ్వి రసాతలగామియై భూతసంఘముల ప్రాణవాయువు స్తంభించిపోవును. అపుడెల్లరు సమస్వరమున చిత్కార మొనర్చెదరు. భూమ్యాకాశము లేకమై ప్రతిధ్వని రూపమున ఉత్తర మొసఁగును. ఏమని?— "హిందూజాతము మఱిలేదు" అని — "హిందూ

మతము — హిందూధర్మము మఱిలే"దని — "హిందూవిగ్రహము, జగన్నాథవిగ్రహము మఱిలే"దని — "హిందూ మహామందిరము, సుప్రసిద్ధ మహామందిరము మఱిలే"దని.—

ప్రసూ:— ప్రభూ! ప్రభూ!

(ఎల్లరు నిశ్చేష్టితులగుట).

ద్వితీయాంకము సంపూర్ణము.





ఓం

# ఉత్కలపతనము.

## తృతీయాంకము.

ప్రథమదృశ్యము.

రంగము. అక్బరుమంత్రణామందిరము.

(ప్రవేశము. అక్బరు, వీరబలుఁడు.)

అక్బ— ఇంతటి ప్రతారణమా? ఇంతటివిశ్వాసఘాతుకత్వమా?

వీర— గుర్తింపుఁడు. జహాఁపనాహ్! ఈపర్యాయము గుర్తింపుఁడు. విశ్వసించి యుంటిరికదా!

అక్బ— విదూషకా! విశ్వాసములేనిచో రాజ్యశాసన మసంభవము.

వీర— కాని, విదూషకునియెడమాత్ర మీసూత్ర మత్యంతవ్యతిరేకము.

అక్బ— అదెటుల? నిన్ను నేను విశ్వసించుచుండలేదా? నీవు నా ప్రధాన సభాసదులలో నొకఁడవుకాదా?

వీర— అది నా స్తవమె. కాని, యెంతవఱకు? ఈ సముచిత వస్త్రాదుల ధరించి యుండునంతవఱకె. ఈ సభాగృహమున నుపస్థితుఁడనై యుండునంతవఱకె. ఈ సభాగృహమున నుపస్థితుఁ

డనై యుండునంతవఱకె. మఱియు నన్ను విశ్వసించుచుండుటయు సత్యమె. ఎంతవఱకు? అన్యులవచనముల వినక నావచనముల వినుచుండునంత వఱకె.

అక్బ— (నవ్వుచు) విదూషకా! నీవాక్యగర్భితార్థము నెఱుంగుట మిగులఁ గష్టసాధ్యము.

వీర— అదిసత్యమే. నావాక్యములు కేవల మసందర్భములు. చాకచక్యభరితములై యుండినఁగదా పాదుషాహృదయమున నాటఁ గలుగుటకు.—



అక్బ:— (నవ్వుచు) సరియే. సంగతియేమి?

వీర:— కతలుఖానునుగూర్చి కొంచెము పర్యాలోచింపుదము.

అక్బ:— ప్రకృతవిషయము నేనా?

వీర:— కాదు. కాదు. గతించిన విషయమును. నాఁటి మానభంజన యాత్రా దిన వృత్తాంతమును విదూషకుని వచనములు కేవలము పరిహాసములని నోనాడితిరికదా!

అక్బ— (నగుచు) నిశ్చయముగ విదూషకుని విదగ్ధవచనములను గ్రాహ్యమొనర్చికొనుట సహజముగ సుసాధ్యముకాదు. (గంభీరముగ) వీరబలా! ఎవ్వని నేనాబాల్యమునుండియు పుత్రవాత్సల్యమున ప్రేమించి యుంటినో, ఆకతలుఖానుఁడేనా యీతఁడు? ఎవ్వని సామాన్యసైనికస్థానమునుండి ఉత్కృష్ట సైన్యాధ్యక్షపదవి నలంకరింపఁ జేసితినో, ఆయాశ్రితుఁడేనా యీతఁడు? ఆనాఁటి కతలుఖానుఁడె ఇంతటి విశ్వాసఘాతకుఁడగునని, ఇంతటి రాజద్రోహి యగునని యూహాపథమున నెన్నఁడును స్ఫురించి యుండలేదు. స్వప్నావస్థయందు సైత మిట్లగునని భావించి యెఱుఁగను. వీరబలా! అతఁ డెన్నఁడును ఇటులొనరింపలేదుసుమా!

వీర:— ఎటులొనరించును? ఇంతవఱకును ఆతని హృదయాసనమున నహింసాదేవి ప్రతిష్ఠితయై యుండలేదు. నేఁడది జరిగినది.

(ముకుందదేవుని ప్రవేశము.)

ము:— సార్వభౌమున కభివాదనము!

అక్బ:— మహారాజా! అభివాదనము– కాని, మహారాజా! నను నీవు "మిత్రమా!" అని సంబోధింపక "సార్వభౌముఁ" డని పల్కెదవేల?

ము:— ఈకించి ద్రుమపాదుపా యంతవానికి మిత్రుఁడగుటకు యోగ్యుఁడా?

అక్బ:— నీవుకించి ద్రుఁడవా! జగన్నాథుని నికటమున, నా సమక్షమున నీవు వీర శ్రేష్ఠుఁడవు. స్వతంత్ర నరేంద్రుఁడవు. సహజ మిత్రుఁడవు.

ము:— క్షమింపుము మిత్రమా! ఇవన్నియు ననుచిత ప్రశంసావాక్యములు. వీనిని వినుటకు నేను లజ్జితుఁడనగుదును.

అక్బ:— నేనుకూడ లజ్జితుఁడనగుచున్నాను. ఏలయందువా? వీరుని యథోచితముగ ప్రశంసింపఁ జాలకున్నాఁడను. గుణవంతుని యథోచితముగ వినుతింపఁ జాలకున్నాఁడను. చెప్పుము. మిత్రమా! చెప్పుము. ఏ మిత్రుఁడు తనస్వార్థముఁ ద్యజించి ప్రాణములఁగూడ తృణప్రాయముగ భావించి అవ్యాజముగ, అన్యమతస్థుఁడగు వానియెడ ఇంత మహోపకార మొనర్పఁగడంగును.

ము:— సార్వభౌమా!

అక్బ:— మఱల సార్వభౌమశబ్దమా?

ము:— మిత్రమా! ఉపకారము సంపూర్ణము చేయఁజాలియుండ లేదుకదా!

అక్బ:— అదెటుల సరి యగును? కతలు, రహమత్ఖానుల విశ్వాస ద్రోహముల వలన, మీస్వల్ప సైన్యముల తోడ యుద్ధమున జయము ప్రాప్తింప కుండుట సత్యమే యగుగాక; కాని ప్రయత్నలోపము లేదుకదా? ఆ యుద్దేశము తోడనే మీరు నేఁడిచ్చటి కేగుదెంచుట కూడ!

ము:— ఎటులైనను మిత్రమా! నాకిపుడు సెలవొసంగుఁడు. సమర రంగమున జయము సంపాదించు వఱకు, విశ్వాస ఘాతకుల బంధించి సార్వభౌము నెదుట నిలుపునంతవరకు నామానసము శాంతి వహింపకున్నది.

అక్బ:— వలదు. మిత్రమా! నేఁడెంత మాత్రమును మీరు వెడల వలదు. స్వల్పకాల మిటనుండి విశ్రాంతి నందవలయును.

( మానసింహుని ప్రవేశము. )

మా:— జహాఁపనాహ్! సరిగ దశ సహస్ర సైన్యము లాయత్త పఱుపఁబడినవి.

ము:— బాగుగనే యున్నది. నా స్వసైన్యములను కూడ రావలయు నని నా స్వదేశమునకు వార్తనంపితిని.

మా:— ( దీర్ఘ నిశ్వాస పూర్వకముగ మానసమున ) "స్వదేశము" "స్వరాజ్యము" "స్వసైన్యము" ఇంతకంటెను రాజగు వానికి గర్వింపఁదగిన దేమున్నది? ఇంతకంటెను క్షత్రియు డగు వానికి సౌభాగ్యమేమి కలదు?

ము:— ( మానసింహునితో ) మహారాజా! ఎల్లరు సంసిద్ధులై యున్న వారుకదా!

మా:— (స్వగతమున) ఆహా! మహారాజెవ్వరు? ఈపరాధీనుఁడా? ఈ పరముఖాపేక్షియా? ఛీ! ఛీ! ఈ క్షత్రియ కుల కలంకుని యెడ ఇట్టి సంబోధనముకూడ క్షత్రియ లోకమునకెల్ల అవమాన కరము! (ప్రకాశముగ) మహారాజా! అందఱు సంసిద్ధులై యున్నారు!

ము:— (అక్బరు నుద్దేశించి) మిత్రమా! సర్వమును సిద్ధమైయుండ వృథా కాలహరణమువలన ఏమి ప్రయోజనము?

అక్బ:— మిత్రమా! ఈ హితుని స్వల్పకాంక్షితమును పాలింపఁ జనదా?

ము:— క్షమింపుఁడు. ప్రథమమున మిత్రకార్యమును ముగింపనిండు. తదుపరి యిట మీ యిచ్చవచ్చినంత దనుక వసింప నేనెంత మాత్రమును సంకోచింపను.

అక్బ:— ఆహా! ఎంత మహోదార స్వభావము! ఎంత గాఢ స్నేహము! రమ్ము! మిత్రమా! ఒక్కపరి ప్రేమాలింగనమున మైమఱతము.

ము:— ఔరా! ఈ అకించనున కెట్టి సౌభాగ్యము! విశాల భారత ధరణీశ్వరుని ప్రేమాలింగనమునకు నేఁడు పాత్రుఁడగుచున్నాఁడు!

అక్బ:— ఈ అకించనునకదికూడ సామాన్య సౌభాగ్యమా! నిఖల హిందూరాజన్య ముకుటమణి ప్రేమాలింగనమునకు పాత్రుఁడగుచున్నాఁడు. రమ్ము. ప్రాణమిత్రమా! సభామందిరమున కరుగుదము. రమ్ము.

(అక్బరు ముకుందదేవుల ప్రస్థానము).

మా:— (స్వగతమున) ముకుందదేవుఁడు క్షత్రియుఁడు. ఈ భాగ్యహీనుఁడుకూడ క్షత్రియుఁడే! కాని, అతఁడు మిత్రుఁడు!

నేను భృత్యుఁడను! అతఁడు సింహాసనాసీనుఁడు. నేను పాద తలాసీనుఁడను. అతఁడు స్వర్గమున— నేను నరకమున— సాగర సరోవరములకున్న ప్రభేదము. ఆకాశ పాతాళముల కున్నంత వ్యత్యాసము! ఛీ!

వీర:— మిత్రుఁడా! ఏమి చింతించుచున్నావు! రమ్ము. మన మిరువురముకూడ ప్రేమాలింగనము నొనరింతము. పరిభువు ప్రభువును కౌఁగిలించుకొనిన, భృత్యుఁడు భృత్యుని కౌఁగిలింపఁజాలఁడా?

(సేవకుని ప్రవేశము)

సే:— మహారాజా! విదూషకవర్యా! పాదుషావారు తమకై నిరీక్షించుచున్నారు?

మాన:— నిరీక్షించు చుండుట యేమి? ఆజ్ఞాపించు చున్నారనుము. (స్వగతమున) ఎంత లజ్జాకరము! ఎంత హేయము!! ఈ క్షత్రియ వీర్యము. ఈ క్షత్రియ ప్రతేజము, దాస్యార్ణవ గర్భమున విలీనమై పోయినవి కదా!

వీర:— మిత్రమా! నడువుము. నడువుము. ఆజ్ఞా పత్రము జారీ చేయఁబడినది కదా! (సేవకునిచెంత) ఏమి? స్నేహితుఁడా! సంకుచిత చిత్తుఁడ వగుచున్నావేల? ముందు నడువుము. నీవును సేవకుఁడవె, మేమును సేవకులమె. నీవు ద్వారములను కాచెదవు, మేము రాజ ద్వారములను కాచెదము. ఇదియేకదా ప్రభేదము. నడువుము. నడువుము.

( సేవకుని భుజముపై చేయినిడి పోవును. )

మాన:— సత్యము విదూషకా! సరిగ వచించితివి.

( ప్రస్థానము. )

## తృతీయదృశ్యము

### వంగదేశమున నవాబు రంగమహలు.

(కతలుఖాన్, రహమత్ఖాన్, అబ్దుల్లా (మారువేషమున) ప్రవేశము.)

ర:— ఛోకరా! తేరానామ్ క్యా?

అ:— హమారానామ్- హమరానామ్- ఛోకరా.

ర:— అరే బేకుఫ్! హమ్‌బోల్తేహైం ఛోకరా, తేరానామ్ క్యా ఛోకరా?

అ:— ఆప్ జెత్నావఖ్త్‌బోల్తేహైం ఛోకరా, హమరానామ్ క్యా అవుర్ కుఛ్ హోనే సక్తా?

ర:— తూ అచ్ఛా ఛోకరాహో. అచ్ఛా! తేరానామ్ జలీల్?

అ:— హుజూర్! ఖుదావంద్! హమారానామ్ జలీల్.

ర:— అచ్ఛా! జలీల్! హమ్‌క్యాహువా?

అ:— ఆప్ నవాబ్ హువా.

కత:— హమ్?

అ:— ఆప్ పాదుషా.

ర:— నహీం. హమ్ పాదుషా.

కత:— నహీం. హమ్ పాదుషా.

ర:— జలీల్! తూ ఝూట్ కర్కేబోల్. హమ్ క్యా?

కత:— జలీల్! తుసచ్చాబాత్ బోల్ హమ్ క్యా?

అ:— అచ్ఛా! హమ్ సమఝాదేతేహైం. జరాసాఠయిరియే. దేఖో! ఆఫ్ నవాబ్ కుమార్ కే నవాబ్ హువా; ఆప్ నవాబ్ హో.

షోర్, ఏపాదుషాహ్కురకాకే ఆప్కునవాబ్ బనాయా. ఏ పాదుషాహై.

ర, కత:— (అబ్దుల్లుని లెంపలు వాయించుచు) అరే! ఠీక్ బోలో.— ఆరే! సచ్చాబోలో.— అచ్చాఛోకరాహూ, అచ్చాఛోకరాహూ (తెరవంకఁజూచి) వారేవా! ఏబాయిజీలోఁగ్ కిధర్ ఆతేహైఁ? కోన్ బులాయా?—

అ:— అమ్.

(భోగమువాండ్ర ప్రవేశము.)

కత:— అచ్చాఛోకరాహూ. తూ అచ్చాఛోకరాహూ. అరే! సిరాజి లావో. సిరఫ్లావో, గావో బాయిజీలోఁక్. ఖూబ్ మితాగానా గావో. మజాఉఠావో.

భోగ:—(పాడుచు నాట్యమొనరింతురు.)

(అబ్దుల్లా మద్యమును పోయుచుండ రహమత్, కతలుఖానులు త్రాగిత్రాగి పరవశులగుదురు.)

అ:— (మారువేషమును పరిత్యజించి) పొండు. సుందరులారా! మఱి మీప్రయోజనము లేదు.

భోగ— చిత్తము. సహజాదా! (పోవుదురు.)

అ:— ఇఁక నా కార్యమున నేను ప్రవిష్టుఁడ నయ్యెదను. (గుప్త ఖడ్గమును వెలికిఁదీసి) ఈ—ఈ ఖడ్గమె రహమత్! ఈ ఖడ్గమె యొసఁగియుంటివి. ఈ ఖడ్గమును కొనియె భ్రాతృ తుల్యుఁడగు కళాపహాడ్డును హత్యగావింప నేగియుంటిని. నా సోదరీ మణి సర్వనాశ మొనరింప నరిగియుంటిని. దైవము రక్షించెను కాని—కాని, ప్రతికృతము నేనేమి కావించితిని? పితృవ్యుని నిర్మల రక్తమున దీనిని రంజిత మొనరించి వైచితిని? ఒక్క—

పెట్టున నర రక్తమును, రాజ రక్తమును, పితృ రక్తమును శోషింపఁ జేసితిని. అహ్హాహ్హా ! పితృదేవుని సార్థక పుత్త్రుఁడను నేను ! భూపాలుని సార్థక దేశీయుఁడను నేను !! చూడుము ! ఏమిత్త్రుని యుపదేశము వలననే నిట్టి సార్థకత్వ మునందితినో ఆ మిత్త్రునకు, ఆ నర పిశాచాధమునకు ఎట్టి సార్థకమిత్రుఁడనో నేఁడు చూడుము.

( అబ్దుల్లా రహమత్ఖానుని పొడువ నుంకించు సమయమున నేపథ్యము నుండి " పిస్తోలు " దెబ్బవలన భూపతితుఁడగును. వెంటనే కళాపహాడ్ ప్రవేశము. )

( రహమత్ కతలుఖానులు భయ కంపితులై నిలిచెదరు. )

క:— నవాబ్ సాహెబ్ !— ఎవరిది ? నవాబెచ్చట ? రహమత్ఖాన్ !

అ:— హా ! విశ్వాస ఘాతుకునకు ప్రతిక్రియ సలుపలేక పోయితిని. హృదయవాంఛ సఫల మొనరింపఁజాలక పోయితిని — హా ! తండ్రీ ! తండ్రీ !—

క:— ఎవరు ? ఎవరునీవు ?— అబ్దుల్లా ?—

అ:— హా ! ఎవ్వరిదీ కంఠస్వరము ?

క:— అబ్దుల్లా !

అ:— కళాపహాడ్ ! హా ! సోదరా ! నిశ్చయముగ నీవు తిరిగి వచ్చితివా ?

క:— ఆహా ! నే నెట్టి ఘోర మొనరించితిని.

అ:— నీ దోషమేమియు లేదు. సోదరా ! నా పాపమునకు సరి యగు ప్రాయశ్చిత్త మొదవినది.

క:— ఆఁ ! ఆఁ ! ఏమి పాపము ?

అ:— ఏమి పాపము ? హా ! ఆ పాపమునకు ప్రాయశ్చిత్తము కలదా ? ఈ హంతకుని ప్రాణము హరింపఁబడినంత మాత్ర మున నా పాపమునకు ప్రాయశ్చిత్త మగునా ? హా !

క:— హత్యయా ? ఏమది ?

అ:— ఏమి హత్యయా ? దానిని తెలిపిన మాత్రమున పాప మొదవును. దాని శ్రవణ మాత్రమున పాప మంటును.

క:— సోదరా ! చెప్పుము. చెప్పుము. ఏమది ?

అ:— చెప్పుమందువా ? చెప్పుదునా ? హా ! నరహత్య. రాజహత్య. పితృహత్య.

క:— ఏమంటివి ? అబ్దుల్ ? నవాబు ప్రాణముతో లేఁడా ? నవాబు ప్రాణముతో మఱిలేఁడా !

అ:— ఉన్నాఁడు. ఉన్నాఁడు. పరికింపుము. ఆ ఊర్ధ్వ గగనమండలమును పరికింపుము. శశితారకల మధ్యము న లక్ష్యముంచి పరికింపుము. ఆదుగ్ధపథమున — అదిగో దివ్యమూర్తిధారణుఁడై, దివ్యాసనమున నుపవిష్టుఁడై, దివ్య తేజః కిరణముల ప్రసరింపఁ జేయుచున్నాఁడు. కాని,— కాని,— నాయెడ ఏమి యీ కుటిల భ్రూకుటి ప్రదర్శనము ? ఏమి యీ ఆధర దంశన స్పందము ?

క:— అబ్దుల్లా ! అబ్దుల్లా !

అ:— తెలిసికొంటిని. నా పితృవ్యుని కోప కారణమును తెలిసికొంటిని. సోదరా ! సోదరా ! నా కత్తినిమ్ము. శీఘ్రముగ నా కత్తినిమ్ము. విశ్వాస ఘాతుకునికి దండనము జరుగుట లేదు. పాప ప్రవర్తకునికి శాస్తి జరిగియుండదు.— ( లేచుటకు యత్నించి పడిపోవును. ) ఆహా ! నెలవేటినది కాదు.

నా సంకల్పము నెఱవేఱినది కాదు.

క:— అన్నా ! ఏమి సంకల్పము ?

అ:— విశ్వాస ఘాతుకుని హత్య. పాతకి రహమత్ఖానునికి శాస్తి.

క:— తెలిసికొంటిని. సర్వమును తెలిసికొంటిని. ఈ పాతకి రహమత్ఖానే ఈ సర్వనాశనమునకు మూలకందము. ఎవరక్కడ ?

సేవకుని ప్రవేశము.

సేవ:— హుజూర్ ! జహాఁపనాహ్ !

క:— బంధింపుమీ దురాత్ముని. (కతలుఖాను నుద్దేశించి) నీవెవరు?

కత:— నే—ను—నే—ను—క—క—

క:— ఎవరునీవు. శీఘ్రము చెప్పుము ?

కత:— హుజూర్ ! జహాఁపనాహ్ ! నేను కతలుఖాన్.

సేవ:— జహాఁపనాహ్ ! ఈతడు మొగలు సేనానాయకుఁడు. ప్రభుద్రోహియై మనతోడ మైత్రి నెఱపి యున్నాఁడు. రహమత్ఖానుని ముఖ్య స్నేహితుఁడు.

క:— ఈతఁడొక విశ్వాస ఘాతకుఁడా ? అయిన నీ మిత్రద్వయకరములఁ గీలింపఁ జేయుఁడు. (ఇరువురను సంకెలలు వేయుదురు.) ఆహా ! నవాబును మఱి చూడఁ జాలక పోయితిని. సోదరా ! అబ్దుల్లా ! నేనెంత ఘోర మాచరించితిని. ( అబ్దులును ఆలింగన మొనర్చికొనును.

అ:— అన్నా ! చింతించుటవలన ప్రయోజనమేమి ? నన్ను ప్రశాంత చిత్తమున మరణింపనిమ్ము. అన్నా ! దులియా ఏదీ ? ఆమె నా సహోదరి. ఆహా ! నే నామెయెడ ఎంత అన్యాయ మాచరించితిని ! ఆమె నన్ను భాతృభావమున నెంత ఆదరమున మన్నించుచుండెడిది : హా ! నేను ఘోరపాతకిని. పాపలాలసుఁడనై, కామాంధుఁడనై, ఆమె కెంత క్లేశమొదవఁ జేసితిని ! ఆహా ! నేనెట్టి పాపమాచరించితిని ? ఇందులకు క్షమార్పణము కలదా ?

(దులియా ప్రవేశము.)

దు:— అవశ్యము కలదు. ఎవరీ మూర్ఖుఁడు ?

క:— (హటాత్తుగ లేచి) దులియా! నేను మహాపాప మాచరించితిని. సర్వనాశ మొనరించితిని.

దు:— ఏమి ఆ సర్వనాశము! ఏమి ఆ పాపాచరణము? ప్రాణేశ్వరా?

అ:— సోదరీమణీ!— ఏమియు లేదు.—

దు:— ఎవరిది? అన్నా! (దగ్గఱ కేగును).

అ:— వలదు. సోదరీ! నీ దురాత్ముఁడు నీ శత్రువు. నీవంటి దేవతుల్యయగు సోదరీమణికి 'సోదరు'డని గర్వించు భాగ్య మీ రక్కసున కసంభవము.

దు:— అన్నా! అన్నా! అబ్దుల్లా! హా! నేఁడేమి నీకీ దుర్దశ?— (ఆలింగనము).

అ:— ఇది నా సుదశ. సోదరీ! రమ్ము! సోదరీ! నా ప్రాణమా! రమ్ము! జీవితకాలమున ఒక్కపరియైన నిన్నాదరించి యెఱుఁగను. సోదరీ యని నోరార పిలిచి యెఱుఁగను! రమ్ము! ఈ మహాయాత్రా సమయమున ఒకపరి మస్తకము మూర్కొని ముద్దాడి జీవనము సార్థక మొనరించుకొనెదను.

దు:— అన్నా! అన్నా! ఈ దుర్లభామృత పానీయము కరముల కందించియు ఏల లాగికొనియెదు? హా! నిక్కముగ నీ కనిష్ట సోదరిని భాత్రృవిహీనగ సలిపి పోవుచున్నావా? ప్రేమ సౌధము నొక్కపెట్టున విధ్వస్తమొనర్చి పోవుచున్నావా?

క:— ప్రాణేశ్వరీ! నా మూలముననె నీకిట్టి సర్వనాశము సమకూడినది కదా?

దు:— నాథా! అదెట్టుల?

క:— నా "పిస్తోలు" దెబ్బవలెననె ఇంతటి దుర్దశ సంభవించినది.

దు:— హా! మీా "పిస్తోలు" దెబ్బవలననా?—

అ:— సోదరీ! అది దైవప్రేరితము. నా పాపప్రాయశ్చిత్తము. ఇందొరుల దోషమేమికలదు?— హా!— నాశక్తి క్షీణించి పోవుచున్నది. నేను మఱి మాటాడఁజాలను.— సోదరీ!— సర్వవిషయములును లిఖించి నీ శయనాగారమున భద్రపఱిచితిని. చదివి తెలుసుకొనుము. నా కర్తవ్యమున — మీా అనుసంధానము, స్వరాజ్యోద్ధరణము, సఫలములైనవి. కాని- కాని- ఒక్క ప్రధానకర్తవ్యము మాత్రము నెరవేరినదికాదు. పితృహత్యా ప్రతిక్రియ - నారకీయ రహమత్ఖానునికి అర్హమగు శాస్తి.—

క:— సోదరా! ఆ భారము నేను వహించెదను.

అబ్దు:— అబ్బా! ఇప్పుడు నేను నిశ్చింతుఁడను. నన్ను క్షమింపుము. సోదరీ!— ఈ— హతభాగ్య—సోదరునకు—నీ— హృదయమున— ఇంచుక స్థాన మొసఁగుము—హా—దు—లి— (మృత్యువు.)

దు:— ఆహా! జనకుఁడు లేఁడు! పితృవిహీననైతిని. పితృసమానుఁడగు సోదరుని బడసియు పోగొట్టుకొంటిని. ఒక్కసారిగ పితృభ్రాతృస్నేహములకు దూరమైతిని.— (మూర్ఛిల్లును.)

క:— హృదయేశ్వరీ! ఏమియు చింతింపకుము. ఈ నరపిశాచముల శోణితవర్షవర్షణమున మన తప్తజీవములు శీతలముకాఁగలవు. లెమ్ము.

(ప్రసూనుని ప్రవేశము.)

ప్రసూ— దేవా! రక్తపాతమున తప్తప్రాణముల శీతలమొనరింతువా? "ఖుదా" యభిప్రాయము రక్తపాతము కాదుకదా!

క:— ఈ సామాన్యరక్తపాతమే ఖుదా యభిప్రేతము కాదని తలఁచుచుంటివి. కాని, నేనెట్టి రక్తపాతావరణమున కుద్యుక్తుఁడనై యుంటినో అందు ఇది ఒక శీకరముకూడ కాదుసుమా!

ప్రసూ— ప్రభూ! ఈ ఘోరప్రతిజ్ఞను పరిత్యజింపుము. ఈ నృశంస
[illegible]వమునుండి విముక్తుఁడవుకమ్ము. మానవుఁడవై రాక్షసోచిత
కార్యము సలిపెదవా? వివేకివై మృగముకరణి ప్రవర్తిల్లెదవా?
స్వర్గమందలి దేవగణమేమని పల్కును? పాతాళమందలి నాగ
బృందమేమని వచించును ? మర్త్యమందలి జీవసంచయము
నిన్నేమిగ భావించును?—

క:— అహ్హాహా! బాలకా! నిందాభయమున నాప్రతిజ్ఞను త్యజించెద
నని తలంచితివా? వృద్ధశేషుఁడు తన సహస్రముఖములను నా
నిందాఘోషము సలిపినను, చతుర్ముఖుఁడు తనచతుర్ముఖముల
నుండియు నాకుత్సితముల వేదఘోషవలె గానమొనర్చినను,
జీవగణమీ సమగ్రసృష్టి యంతటను నాకళంకమును వ్యాపింవ
ప్రయత్నించినను, నా ప్రతిజ్ఞమాత్రము దృఢతమము—అచ
లము— స్థిరీకృతము.

ప్రసూ— ప్రభూ! నిందాభయము లేకుండిన ధర్మభయ మున్నది
కదా! నిజహృదయాంతరాళమున రవంత పరికించి చూడుఁడు.
దయయును, మాయయును సలుపు క్రందన మొకింత యాలిం
పుఁడు. అనుకంప స్పర్శ మొక్కపరి యనుభవింపుఁడు.—
ఎటుల మీరు దృఢప్రతిజ్ఞులై నిలిచెదరు? ఎటుల మీరు కఠిన
హృదయులై యుండగలిగెదరు? ఎటుల దృఢచిత్తులై, అచ
లులై, సుస్థిరులై నిలచెదరు?

క:— బాలకా! మాటలాడకుము.— హృదయమా! కంపించెద వేటికి?
మందగిరి సదృశముగ దృఢీభూతవుకమ్ము. నారకీయ వృత్తి
చయమా ! నిష్ప్రభమై యడగి పోయెద వేటికి ? ఘృతా
హుతి పోషిత వహ్నివలె జ్వాలాకరాళకీలికవై విజృంభింపుము.
నా కోమ కాలి భస్మీభూతమై పోవుఁగాక!— సంసారిక బంధ
నము ఛిన్న భిన్నమై శూన్య ప్రదేశమున విలీనమై పోవుఁగాక!
నా నిశ్వాసమున ఝంఝా ప్రభంజన ముద్వేలిత మగుఁగాక !

నా నేత్రయుగళమునుండి దావాగ్ని యుద్గీరణ మగుఁగాక! నా భాషణముల సముద్ర వజ్ర నిర్ఘోషణ ముద్భాసిత మగుగాక !— నేను నరహంతకుఁడ నయ్యెదను.— నర పిశాచము నయ్యెదను.— నర రక్త లోలుపుడ నయ్యెదను. నా భీషణ ప్రతిజ్ఞ నేను పాలించెదను.— హిందూ ధర్మము: ధర్మమున్నంత పర్యంతము లుప్త మొనరించి వైచెదను.— హిందూ రాజ్యము రాజ్యము లున్నంత పర్యంతము రసాతలగామిగ సలిపివైచెదను. హిందూ జాతమును, జాతమున్నంత పర్యంతమును విధ్వస్త మొనరించి వైచెదను.

కత:— ఖుదావంద్ ! ఈ సేవకుని ప్రాణములు రక్షింపఁబడిన మీ మహోద్దేశ సాధనమున శక్తి వంచనలేక యథోచితముగ సహాయ పడఁగలఁడు.

ర:— ఈ సేవకుని యభిలాషము కూడనదియె ఖుదావంద్ !

క:— (స్వగతము.) ఇట్టి సహాయ్య మవసరము. నా యుద్దేశ సాధనము నిమిత్తము విశ్వాస ఘాతుకునితోడి బంధుత్వ మావశ్యకము. ఆతతాయితోడి మిత్రత్వమిపుడు (ప్రకాశము) కతలుఖాన్! నీ ప్రాణములు నేను రక్షించితిని. నేటినుండియు నీవు నా ప్రధాన సేనానాయకుఁడవు.

కత:— యా అల్లా ! జో హుకుమ్ ఖుదావంద్ !

ర:— ఈ భృత్యు ప్రాణములు గూడ రక్షింపుడు జహాఁపనాహ్ !

క:— సరియే. నీ ప్రాణములగూడ రక్షించితిని.

దు:— (లేచి) కాని నేను రక్షింపజాలను. జహాఁపనాహ్ ! శోకతప్తురాలి సమ్ముఖమున ఆతతాయి ప్రాణరక్షణమా ? తనయ సమక్షమున తత పితృహంతకుని జీవ సంరక్షణమా ? భగినీ సమ్ముఖమున తత్ భ్రాతృ హంతకుని ప్రాణప్రదానమా ?— అసంభవము— అసంభవము— అసంభవము—

క:— సరియే. ప్రాణేశ్వరీ ! అయిన నీవే రహమత్ఖానుని దండన విధానమును విచారించి నిర్ణయింపుము.

దు:— నేను విచారణ సలిపి దండన విధానమును నిర్ణయించుటయా? దండన విధానమేమి నిరూపింతును ? ఎట్టి దండన ముపయుక్తమగును ? నేనేమియు నిరూపింపఁజాలను. ప్రాణేశ్వరా ! నీవే విచారణము సలిపి దండన విధానము నాదేశింపుము.

క:— వలదు. ప్రాణేశ్వరీ ! నీ భ్రాతృహంతకుని శిక్షావిధానమును నీవే నిర్ణయింపుము. (ఇంచుక సేపాగి) సరియే. సేవకులారా ! ప్రస్తుతమీతనిఁ గొనిపొండు. సరియగు శిక్షాక్రమము నాదేశించు వఱకు నిర్జనాంధకార కారాగృహమున బంధింపుఁడు. కతలుఖాన్ ! నీవుకూడ వెను వెంట జనుము.

ర:— షాజాదీ ! షాజాదీ !

( రహమత్ఖానుని గొని సేవకులతో కతలుఖాను నిష్క్రమణము. )

దు:— అయ్యో ! అన్నా ! నీ సోదరిని విడిచి వెడలిపోయితివా ?

(అబ్దుల్లా శవముపైఁబడి రోదించును).

క:— ప్రాణేశ్వరీ ! వృథా శోకమునకిది అదనుకాదు.- కేవల మిపుడు కర్తవ్యము ప్రతిహింస—ప్రతిహింస—ప్రతిహింస—

(వేగముగ ప్రస్థానము).

దు:— నాథా ! సత్యము బల్కితివి.—ప్రతిహింస—ప్రతిహింస—ప్రతిహింస—

(త్వరితముగ వెన్నంటిపోవును).

ప్రసూ:— సోదరీ ! సోదరీ !— ప్రభూ ! ప్రభూ ! — హా ! ఇదియే నా మీ కర్తవ్యము ?—

(అనుసరించి పోవును).

## తృతీయ దృశ్యము.

(అంతఃపురము).

ప్రసూనుని ప్రవేశము.

ప్రసూ:— ఆహా! ఆతని నే విధమునను మరలింపఁ జాలకపోయితిని. దులియా మూలమున నేమైన సాధింపఁ గలుగుదునా!— యేమైనను ఆమెను మాత్రము కొంత శాంతపరుపఁజాలితిని. నరహత్యకు ప్రతిక్రియ నరహత్యయా? స్వజనుల హత్యవలన కలిగిన శోకము నివారించు సాధనము హంతకుని హత్యయొనరించుటయా? అసంభవము— శోకశాంతికి సాధనమా శాంతినిధానమగు పరమాత్మను ధ్యానించుటయే. అపరాధ మొనరించినవారి నాదరించుటయె తగు ప్రతిక్రియ—

గీతము *

ఎన్నిమారులు నిన్ను నే నీసడించి
నీయెడ మహాపచారముల్ నెరపుచున్న,
నీవు కలవో లేవో యంచు భావమందు
నహరహంబును సందేహమందుచున్న,
తాలిమి యొకింతయేని స్వాంతమున లేక
తీవ్రభాషల నిన్ను నిందించుచున్న,
హే ప్రభూ! ఈ ఖలాత్మపై నెన్నఁడేని
అలుక బూనవు ప్రేమమై నాదరింతు
వహహా! నీదు వాత్సల్య మేమని నుతింతు!

(కలాపహాడ్ ప్రవేశము.)

కృ— స్మృతి పథమునం దెట్టి విషయములు రేకెత్తుచున్నవి?— హృదయఫలకమునం దెట్టి ఛవి ప్రతిఫలించుచున్నది?— ప్రసూనా!

---

* నామురళీధ్వనిలోనిది.

ప్ర:— జనాబ్!

క:— నిజము చెప్పుము. నీవెవరు?

ప్ర:— ఈ సేవకుఁడు పలుసారులు విన్నవించికొని యున్నాఁడుకదా! జనాబ్!

క:— కాని, నాకు విశ్వాస మొదవకున్నది. వంగదేశ నివాసివయ్యు, జాతమున హిందువవై యుండియు, నిష్ఠాపరుఁడవగు బ్రాహ్మణుఁడవయ్యు, విమతస్థులగు ముసన్మానుల సేవచేయుటయా?— ఆశ్చర్యము!

ప్ర:— జనాబ్! ఇందాశ్చర్యవిషయ మేమికలదు? ముసల్మానులను కొలిచినంత మాత్రమున హిందువు ముసల్మానై పోవునా?— విజాతీయుల సేవ సల్పినంతమాత్రమున జాతి పరివర్తనము ఘటిల్లదుకదా! స్వజాతీయత, స్వధర్మము, స్వాచరణము, కేవలము మనోభావమునందుమాత్రమె సంపూర్ణముగ ఆధారపడియుండును.— అదియునుగాక, విశేషించి నేను ప్రేమమునకు దాసుఁడను. ఎచ్చటఆదరణముండునో అచ్చట నేనుభృత్యుఁడను

క:— ప్రసూనా! నీవీ పెద్దపెద్ద మాటలెల్ల ఎచ్చట నేర్చికొంటివి?

ప్ర:— జనాబ్! ఇవి పెద్దమాటలో చిన్నమాటలో నేనెఱుంగను, కాని, ఇదియె నా నిశ్చిత సంకల్పము. ఇదియె నాదృఢవిశ్వాసము.

క:— సరియె. కాని, నీవిట సముచితాదరణము నందఁ గలుగుచున్నావా?

ప్ర:— సంపూర్ణముగ.

క:— అది ఎటు లెఱింగితివి?

ప్ర:— ఎటులా? ఇదిగో! ప్రభువులయ్యు మీరు భృత్యునితో నిష్టాలాపము లాడుచుంటిరికదా! ఇదేమగును?

క:— సరియె. అయిన నాయెడల వినయవిధేయతల నెఱపుట నీకుచితమెకదా!

ప్ర:— ఆహా! సందేహమేమి? పూజించుటయుకూడ ఉచితమె.

క:— అయిన నేనేమి చెప్పిన అది సలిపెదవా?

ప్ర:— అవశ్యము— కర్తవ్యాకర్తవ్యముల నాలోచించి.—

క:— అటులైన నీవు నాకు తగిన భృత్యుఁడవుకావు.

ప్ర:— అయిన నన్నంపివేయుదురా?—

క:— అంపివేయుటయా?— నిన్నా?— అసంభవము.

ప్ర:— ఆఁ! ఇదిగో! నన్నుతగిన భృత్యునిగ స్వీకరించుచున్నారే! నాయెడఁగల అగాధ ప్రేమమునకు నిదర్శనముకాదా యిది?-

క:— సత్యము. ప్రసూనా! నీ ఈ ప్రసూన కమనీయ వదనమున ఈ ప్రసూన సౌరభమయ మృదుభాషణముల ఎట్టి ప్రమోద మాధుర్య మిమిడియున్నదియొ కాని, నా మనఃప్రాణముల నాకర్షించుకొని లగ్నమొనర్చికొనుచున్నది.

ప్ర:— భృత్యునెడ ఇంతకరుణా కటాక్షమా? జనాబ్!

క:— వినుము. ప్రసూనా! ఆ హిందూ పాపక్షేత్రమున నాకొఱకై నీవు సహించిన దుస్సహవేదనమునకు, నాకొఱకై ఆత్మబలి యొనర్చుటకు సంసిద్ధుఁడవైనందులకు, కృతజ్ఞతా నిదర్శనముగ నీయెడ కృత్రిమ స్నేహము, కృత్రిమ ప్రేమమును ప్రదర్శింపలేదు. నాఁడు నిన్ను సందర్శించినంత మాత్రముననే నా పాషాణ హృదయమున నవీన ప్రేమతరంగిణి ఉప్పొంగసాగినది. నీవే నా సౌఖ్యమనియు, నీవే నా శాంతియనియు, నేననుక్షణము ననుభవించుచున్నాను. ప్రసూనా! ఇంత ప్రేమాభిమానము లెవ్వరియెడను నాకు తలచూపి యుండ

లేదు సుమా!— సరియేకాని, ప్రసూనా! నాకడ నింతకాల ముండియు ఒక్కనాఁడయిన నీ వేతనమునుగూర్చి ప్రసంగింప వైతివికదా! ఎవ్వరితోఁడను ప్రసంగవశమునవైన నీవీ విషయమును పలుకవైతివే!— ఏమి? నీకింకెవ్వరు నాత్మీయులు లేరా?

ప్ర:— నాకందఱును కలరు. జనాబ్! ఈశ్వరానుగ్రహమున నేఁటిదనుక అట్టి అభావమేమియు సంఘటించి యుండలేదు.

క:— అయిన కేవలము నీవొక విధమగు సౌఖిక సేవకుఁడవు. ఇట్టి సేవకుఁడవు కానియెడల నేను నీకడనుండి ఇట్టి అపూర్వానందమును పొందియుందునా? ఇంత ప్రశాంతి ననుభవించి యుందునా?— కాని నిన్ను బహూకరించుట నా ధర్మము కదా!

ప్ర:— ఇపుడా విషయమువ చింత యేటికి జనాబ్! నా కట్టి అవసరమే కలిగినపు డడిగి కొనియెదను.

క:— సరియె మంచిది.

( సిద్దీ ప్రవేశము )

సి:— జహాఁపనాహ్! దూత చనుదెంచి యున్నాఁడు. చాల అవశ్యకమగు కార్యము.

( దులియా ప్రవేశము )

దు:— ఏమా అవశ్యకార్యము?

క:— నే నీ క్షణముననే తెలిసికొని వచ్చెదను ప్రాణేశ్వరీ!

( సిద్దీతో కళాపహాఁడు ప్రస్థానము )

ప:— బేగము సాహెబా!

దు:—మఱల నదియే సంబోధనమా?

ప్ర:— మఱచితిని సోదరీ! — సోదరీ! నేను చెప్పినది మఱచి పోవలేదు కదా?

దు:— లేదన్నా! మఱువలేదు. యథోచితముగ ప్రయత్నించుచునే యున్నాను.

ప్ర:— తమరు—

దు:— మరల "తమరు"?

ప్ర:— నేఁడు చాల భ్రమ యొదవుచున్నది. సోదరీ!— వినుము నీ వెఱుంగుదుకదా! ఏయేమతమున నేయే మంచిచెడ్డలు కలవో, ఆయామతావలంబులకు తమతమ మతములయెడ ఎట్టి అభిమానముండినను ఇతరమతమునెడ ఎట్టిసహనము నెఱపుట విద్యుక్తధర్మమో, నీ వెఱుఁగుదువుకదా! స్వార్థపరులగు వ్యక్తు లొనరించు కార్యముపై మతధర్మ మాధారపడి యుండదుకదా!

దులి:— సోదరా! ఆవిషయము నేను చక్కఁగ ఎఱుఁగుదును. ఏది నేఁటివఱకును ఎఱిఁగి యుండలేదో, అది నీవలన చక్కఁగ నేర్చికొంటిని. వినుము. సోదరా! నేను మహమ్మదీయునైనను, హిందూధర్మము నా స్వధర్మముగ భావింతును. నా స్వామి హిందూమతద్వేషియైనను, హిందూమతమునెడ నాకు పూర్ణమగు సహానుభూతి కలదు. హిందూముసన్మానులు, కాఫరు, మ్లేచ్ఛులు, భిన్ననామముల భిన్నార్థముల పరిగణితులగుచుండినను, నాదృష్టిపథమున మాత్రము వారిరువురును సమానులె.

ప్ర:— సోదరీ! ఈ భావము— ఈ సహనము— ఆయునయందు కలిగి యుండిన—

దు:— ఏమియు విచారము వలదు. "ఖుదా" అనుగ్రహమువలన నంతయు చక్కఁబడును. జగన్నాథుని కటాక్షమువలన అన్నియు సమకూడును.

ప్ర:— మన ప్రయత్నము సైత మావశ్యకముకదా!

దు:— అది సత్యమే. కాని సోదరా! ప్రాణేశ్వరుఁడు హిందూ సంభూతుఁడయ్యు, స్వజాతి విధ్వంస ప్రయత్నమునం దింత యున్మత్తుఁడగుచున్నాఁడుకదా! విచారించి చూచిన, ఆజాతియందు దోషమే లేదందువా?

ప్ర:— నిశ్చయముగ కలదు. స్వజాతియందుకు సంస్కారము, లోపములు, కలవేని వానిని సంస్కరించుటయే మానవుని "కర్తవ్యము"

దు:— ప్రధాన కర్తవ్యము. సోదరా! నా "కర్తవ్యము" జ్ఞప్తికివచ్చుచున్నది.— ప్రతిహింస— ప్రతిహింస— భ్రాతృ పితృహంతకుల ప్రతిహింస—

ప్ర:— సోదరీ! మరల నా నారకీయ భావనమా? రక్తపాతమునకు ప్రతిక్రియ మఱల రక్తపాతమా? ఏరక్తపాతము పాపహేతుకమో, ఆరక్త పాతమునే మఱల కావించుటయా? ఏరక్తపాతమువలన అశాంతి యొదవెనో, ఆరక్తపాతమునే పొనర్చి తదశాంతిని ద్విగుణిత మొనర్చుటయా? ఇట్టి ప్రతిహింసా చింతనము నితాంతపాశవికము. అత్యంతాస్వాభావికము. ఇట్టిసాధనమున ప్రశాంతి నందఁగోరుట భ్రమము— మహాభ్రమము.—

దు:— అయిన. ఆ నరహంతకుఁడు నా పితృరక్తమునున నాభ్రాతృరుధిరపానమున— నిశ్చింత హృదయుఁడై హాయి గనుచుండ నేను— నేను— ఆ పూజ్యుని సంతానమగు నేను ఆ పూజ్యుని సోదరినగు నేను— చూచుచు మిన్నకుండవలయునా ?

ప్ర:— సోదరీ ! పాపాత్ముఁడెప్పుడును నిశ్చింత హృదయుఁడై యుండ జాలఁడు— మరణాంతమున గూడ ఆతఁడు నిశ్చింతితుఁడగుట కల్ల. అదియును కాక దోషకారి దోష విషయమునగాని, పాపాత్ముని శిక్షా సంబంధమునఁగాని విచారణ సలుపుట మన కార్యముకాదు. ఎవఁడు పాపపుణ్యముల విచారణ

కర్తయో శిక్షింపను, రక్షింపను ఎవ్వఁడు సమర్థుఁడై యొప్పా రుచున్నాఁడో ఆతని యెడనే మనకు ద్రోహ మొనరించువాని విచారించు భారమును. శిక్షించు భారమును వైచి నిశ్చింతులమై యుండుట యుచితము. ఈ అపార దుఃఖసాగర గర్భము నుండి దరిచేర్చు నాతఁడా పరంధాముఁడే యని దృఢ విశ్వాస ముంపవలయును. ఆతఁడె మనకు శాంతి ప్రదాత. అతఁడె మన విషాదమయ జీవితమును ప్రశాంతిమయ మొనరించి వేయును.

దు:— ఆహా! సోదరా! ఈ తమమయ గగనమండలమున నీవు దివాకరుఁడవా? ఈ మరీచికామయ మరు ప్రదేశమున నీవు జలార్ణమవా!

ప్ర:— కాదు. సోదరీ! కాదు. నీ చిరానుగత సహోదరుఁడను.

దు:— వాస్తవముగ నీవు దుఃఖహారివి. శాంతి ప్రదాతవు.

( కళాపహాడ్ ప్రవేశము. )

క:— చాల శుభ సమాచారము—దులియా!

దు:— ఏమది? ప్రాణేశ్వరా?

క:— ముకుంద దేవుఁడు వంగదేశము నాక్రమించి యున్నాఁడు.

దు:— అయిన, ఇది శుభవార్త యెట్లగును?

క:— శుభవార్తకాదా? ముకుంద దేవుఁడు హిందూ జాతమున ముకుటమణి. హిందూ ధర్మమున కేకచ్ఛత్రాధిపతి. అట్టి ఆ హిందువు కుల తిలకమును నేఁడు రణ రంగమును భూతల శాయి నొనరంపఁ జాలినఁగాని, నిశిత కరవాలమున రెండు ఖండములుగ తెగటార్ప జాలినఁగాని— నా ప్రతిహింసాకరాళ జ్వాల కించిత్పరిమాణముగ శీతల మందెడినికదా?

చు:— ప్రాణేశ్వరా ! ఈ రాక్షస ప్రతిజ్ఞ విసర్జింపుము. సుజ్ఞా... య్యు కర్తవ్యతా జ్ఞానమును మఱచి పోఁజనునా ?

ప్రి:— దేవా ! తాము ధార్మికులయ్యు ధార్మిక జ్ఞానమును మఱచి పోఁజనునా ?

క:— ప్రసూనా ! నీవు హిందువు వగుటవలననా ఇట్లు వచించెదవు?

ప్ర:— జనాబ్ ! ఈ సేవకు నెడ అట్టి పక్షపాత గుణమె యుండిన హిందువయ్యు హిందూ విద్వేషుల దాసత్వము స్వీకరింపఁ జాలునా ?

క:— వాస్తవము.

ప్ర:— అయిన జనాబ్ ! హిందువు నెచట వీక్షించినను, శిశువై నను, యువకుఁడైనను, వృద్ధుఁడైనను వాని విధ్వంస మొనరు నని ప్రతిజ్ఞచేసి యుండిరికదా ! ఈ సేవకుని యెడ మాత్ర మింత యనుగ్రహ మేటికి ?

క:— (అర్ధ స్వగతము) వాస్తవము. ఇంత అనుగ్రహమేటికి ? సామాన్య భృత్యు నెడ నింత వ్యామోహ మేటికి? ప్రేమమ స్నేహము ! ఆశ్చర్యబాధనము !

దు:— ప్రాణేశ్వరా ! నీ పదములంటి వేఁడి కొందును. ఈ నా కీయ ప్రతిజ్ఞను పరిత్యజింపుము.

ప్ర:— జనాబ్ ! ఈ భృత్యుఁడు కూడ పదములంటి ఆదే వేఁ కొనుచున్నాఁడు.

క:— (స్వగతము) హృదయమా ! ద్రవీ భూతవు కాకుము ( ప్రక శముగ) దులియా ! నీవు శుద్ధాంత వాసినివి. ప్రసూనా నీవు సామాన్య సేవకుఁడవు. మీ యిరువురకు ఉచి ప్రదేశ మంతఃపురము. మీ రాలోచింపఁదగినవి. గృ . ఈ జటిల విషయముల యెడ మీ కట్టి అ

కారమును లేదు. పోయెదను ! నేను శీఘ్రముగ సంసిద్ధుఁడను కావలయును. పోయెదను (ప్రస్థానము).

దు:— (వ్యథిత హృదయయై కళాపహారుని ప్రస్థానమును వీక్షించుచు నిలువఁబడి పోవును.)

ప్రి:— సోదరీ ! విషాదమును పరిత్యజింపుము. చూచితివా ? ఇపుడు స్త్రీ జాతి యెంత నీచముగ పరిగణింపఁబడుచున్నదో? సహధర్మ చారిణి కర్తవ్య మెంత సంకీర్ణముగ నెన్నఁబడుచున్నదో ?

దు:— అయిన ఇప్పటి కర్తవ్య మేమి సోదరా ?

ప్ర:— రమ్ము సోదరీ ! పురుషుఁడు స్త్రీ నెంత నీచముగ భావించినను పతి పత్ని నెంత వ్యర్థురాలిగ ఊహించినను స్త్రీకి అర్హమగు కార్యము నాచరింతువు గాని రమ్ము. పత్ని చేయు కర్తవ్యము నాచరింతువు గాని రమ్ము !

దు:— చెప్పుము. సోదరా ! నేను చేయఁదగు కార్యమేమో చెప్పుము.

ప్ర:— నీవు చేయ దగు కార్య మేమందువా ? నీ నాథుని పాప గ్రాసమునుండి ఉద్ధరింపుము. దుష్పథమునుండి మరలింపుము.

దు:— సోదరా ! నాథుఁడే నా దేవుఁడు. పాపియైనను పత్నికాతఁడు దేవుఁడేకదా ! పూజ నీయుఁడేకదా ! అట్టియెడ ఆతని సంకల్పమునకు విరుద్ధమగు కార్యము నే నెట్లాచరింతును ?

ప:— సోదరీ ! అయిన నీ పత్నీ కర్తవ్యమునెడ అవహేళన మొనర్చుచున్నావు.

దు:— అది ఎట్లు ? పత్నికి కర్తవ్యము పతికిప్రేమ ప్రదాన మొనర్చుట కాదా ? ఆ విషయమున నేను లవమాత్రమైన అవహేళన మొనర్చితినా ? నా కర్తవ్యమును నేను సంపూర్ణముగ నెఱవేర్చుట లేదా ?

ప్ర:— ఎట్లు నెఱవేర్చితివి? ఇదియేనా ప్రకృతిప్రేమ ప్రదానము? నీయందే ప్రకృతి ప్రేమ మావిర్భవించి యుండిన నీ కాంతుఁ డిటుల పాప కరాళ ముఖ గహ్వరమున ద్రుతగతిని కబళమై పోవఁగల్గి యుండునా? నీ యిప్పటి కర్తవ్యము నవగాహన మొనర్చుకొని యుండిన నేఁడు నీ స్వామి ఇట్లు దుష్పథము పట్టుట కింత యున్మత్తుఁడై వెడలియుండునా? సోదరీ! పతిని దుష్పథమునుండి మరలించుటకు ప్రాణములనైన ధారపోయుటకు ఉత్తేజిత యగుటయే పత్నికి ఇప్పుడు కర్తవ్యము. నాథుని పవిత్ర సుఖప్రశాంతు నొనర్చుటకు నిజ సుఖ శాంతిని విసర్జించుటకు ఉత్సహించుటయే పత్నికి యిపుడు ప్రణయప్రదానము.

దు:— ప్రసూనా! ప్రసూనా! ఎవరు నీవు? ఛద్మవేషధారణమున నాకర్తవ్యమును ప్రబోధింప నరుగుదెంచిన దేవతామూర్తివా? అబద్ధమగు నా మనోనయనము నేఁడు ఉన్ముక్తమైనది. అంధకార బంధురమగు నా హృదయ పేటిక నేఁడు కాంతిమయమైనది. రమ్ము! సోదరా! సహధర్మచారిణికి అర్హ కర్తవ్యమును నేర్పుము! రమ్ము!

ప్ర:— నడువుము! సోదరీ! ఈ భృత్యుఁడు తనవిధ్యుక్తధర్మమును నెఱవేర్చుకొనును. (ఉభయుల ప్రస్థానము.)

---

## చతుర్థదృశ్యము.

[శిబిరము—ప్రవేశము— ముకుందదేవుఁడు]

ము:— నా ఉత్కల సైన్యము లింతదనుక వచ్చి యుండలేదేమి చెపుమా? అవి అరుదెంచు చిహ్నము లేవియును కన వచ్చుట లేదు. కళాపహాడుని ఆక్రమణము ప్రతి ముహూర్తమును సందేహాస్పద మగుచున్నది. (నేపథ్యమున ముకుందదేవుని సైన్య

ముల ఆర్తనాదము) ఏమిది ఏమి ఈ ఆర్తనాదము. జగన్నాథుఁడే శరణము.

(ప్రవేశము— కళాపహాడ్)

క:— జగన్నాథుఁడే శరణము. రమ్ము. ముకుందదేవా? హిందూ రాణ్మణీ! యవనుని హస్తముల నేఁడు నిర్బంధితుఁడ వయ్యెదవు రమ్ము. స్వహస్తముల రేపు నీ శీతల శోణితమున తర్పణ మొనర్చి, నా ప్రతిహింసానలము నొకింత ప్రశాంత మొందఁ జేసెదను.

ము:— ఎవరునీవు? మనుష్యుఁడవా? రాక్షసుఁడవా?

క:— నేను రాక్షసుఁడను. గుర్తింపఁజాలవా కళాపహాడు రాక్షసుని!

ము:— నీవు కళాపహాడువా?

క:— హాహ్హాహ్హా! కళాపహాడును గుర్తింపఁజాలకుంటివా? నీవు హిందువుఁడ వయ్యును కళాపహాడును గుర్తింపఁజాల కుంటివా? హాహ్హాహ్హా!

ము:— ఇది యేమి యీరోషభీషణమూర్తి ధారణము! సేనాపతీ!

క:— భీషణమూర్తిని నేను స్వయముగ ధారణ మొనర్చియున్నాను. కాదు! ఈ నారకీయమూర్తిని నేఁడు నీహిందూసోదరులు నన్ను ధరింపఁ జేసి యున్నారు!

ము:— నేనేమియు గ్రహింపఁజాలకున్నాను, సేనాపతీ!

క:— గ్రహింప నావశ్యకము లేదు! మహారాజా! రక్తము! **కేవలము** హిందూ రక్తము నే కోరెదను! మహారాజా!

ము:— ఏమి యీ భీషణమూర్తి! లలాటప్రదేశము విజాతీయ విద్వేషమున కుంచితము! నేత్రయుగళము పైశాచిక క్రోధము నరంజితము! ఆపాదమస్తకము అప్రాకృతి స్పందనమున ప్రకంపితము! సేనాపతీ! స్వకీయరూపధారివి కమ్ము!

క:— స్వకీయ రూపధారి నయ్యెదను. ముకుందా! నీ యుష్ణశోణి తమును పాన మొనర్చిన పిమ్మట హిందూజాతమును విధ్వస్త మొనర్చిన పిమ్మటఁ హిందూ ధర్మమును మూలోత్పాటన మొనర్చిన పిమ్మట—

ము:— నీ వేమి? ధర్మవిహీనుడవా ? చండాలుఁడవా ?

క:— నేను చండాలుఁడను, ఏ జాతమున నేను జన్మించితినో, ఆ జాతము నెడ నేను చండాలుఁడను. ఏ ధర్మమును నేను ప్రప్రథమమున అవలంబించి యుంటినో, ఆ ధర్మము నెడ నేను చండాలుఁడను, ఏ క్షేత్రమున నేను శౌచీకరణ మందియుంటినో ఆ క్షేత్రమునెడ నేను చండాలుఁడను.

ము!— (స్వగతము) ఎట్టి చండాలుఁడు, మతత్యాగియైనంత మాత్రమున మానవుఁడిట్టి పిశాచమై పోవునా ?

క:—ముకుందదేవా ? మఱి విలంబనమున ప్రయోజనమేమి ? శీఘ్రముగ ఆత్మ సమర్పణ మొనర్పుము. హిందూరక్త పిపాస క్రమక్రమముగ అసహ్యమై విజృంభించు చున్నది.

ము:— హాహాహా ! సేనాపతీ ! నన్నేమి దుర్బలుఁడగు శిశువని ఊహించితివా ? భీరువగు కాపురుషునిగ ఊహించితివా ?

క:—నీవు వీరుఁడవు ! సాహసివి !! మఱియు సబలుఁడవగు యువకుఁడవు; కాని—

ము:— కాని ?

క:— ఉపాయ హీనుఁడవు !

ము:— ముకుంద దేవుఁడు పాయహీనుఁడా ?

క:— అవును. ఇది నేను మాత్రి మెఱుంగుదును.

ము:— ఎఱుంగుదువా ? సేనాపతీ ! ఒక సామాన్యాయుధ సహాయమున ముకుంద దేవుఁడొక్కఁడే, సహస్ర సహస్ర సైన్యముల యెదుట నిర్భయుఁడై పోరగలఁడు !

క:— (విస్మయుఁడై) అవును. ఆ సాహాయ్యమును పొందినగదా ?

ము:— ఎవరక్కడ !

(కతలు ఖాను తోడ మొగలుసైన్య ప్రవేశము.)

క:— చిత్రము ! మహారాజా !

ము:— ఇదిగో కతలు ఖానుఁడు ! ఇదిగో మొగలు సైన్యము !

( నేపథ్యమున మహారాజా ! వెడలిపోండు. పాఱిపోండు.

విశ్వాసద్రోహము ! విశ్వాసద్రోహము !!

ము:— ఏమిది ? ఈ కంఠధ్వని నా ఉత్కల సైనికులదివలె నున్నదే)

నేపథ్యమున హా ! ప్రాణములు పోయెను !— ప్రాణములు పోయెను!!

ము:— ఇది ముమూర్షకుల ఆర్తనాదము. సైనికులారా ! వెఱువకుఁడు. ( పోవ నుంకించును. )

కత:— (అడ్డువచ్చి) ఆగుఁడు. ముకుందదేవా !

క:— హాహాహా ! ముకుందదేవా ! నీ కరవాలమెక్కడ ! నీ ఉత్కల సైన్య నివహ మెక్కడ ? నీ మొగలు చమూ సమూహమిపు డెవ్వరి యధీనము ? వృథా స్వాలసము. వ్యర్థదాంభికత ! కతలుఖాన్ ! నీ కార్యమును నీవు నెఱవేర్పుము.

(కతలుఖాను ముకుంద దేవుని బాధింప నుద్యమించును.)

ము:— జాగ్రత్త ?— సృగాలమువయ్యు హార్యక్ష శరీర స్పర్శము నకు సాహసమా ?

క:— ముకుందదేవా! చాల లజ్జాకర విషయము! చాల లజ్జాకర విషయము!! సృగాల హస్తమున నేడు హార్యక్ష నిర్బంధన యోగము!

ము:— నాకు మతి భ్రమమొదవి యున్నది. నేను పొరపడితిని. ఉపాయ విహీనమగు మత్తకేసరిని సామాన్య సృగాలము సైతము పదాఘాత మొనరించును.

క:— కతలుఖాన్! ఊరక నిలిచి చూచెదవేమి? నీ కార్యమును నీ వొనరింపుము.

కత:—(భయపూర్వకముగ మెల్లమెల్ల ముకుందదేవుని బంధించి)ఎల్లరు నిపుడు చెప్పుడు. ఎవరు సృగాలము?— ఎవరు సింహాము?—

ము:— (స్వగతము) లలాట లిఖిత మనుల్లంఘనీయము!

క:— చమూపతీ! ఈ బంధితుని కారాగారమునకు తీసికొనిపొమ్ము. నా అనుజ్ఞ లేనిదే ఎవ్వరును బంధితునితోడ మాట్లాడుటకాని బంధితుని సందర్శించుటగాని జరిగింపరాదు.

కత:— నడువుము— రాజా!

ము:— ఆగుము. పోవుటకు ముందొకటి వచింపనిమ్ము. మొగలుసైనికులారా! ఇదియేనా మీ నిశ్చల నిష్కళంక రాజభక్తి?—ఇదియేనా మీ స్వాభావిక మానవత్వము? పాదుషా అన్నముతిని, పాదుషా ఆశ్రయమున ప్రతిపాలితులై అతనికి విరుద్ధముగ శస్త్రధారణ మొనరింతురా? ఆశ్రయప్రదాత వినాశమునే తలపెట్టెదరా?

మొ॥సై॥లు:— (మాట్లాడక నిలిచియుందురు)

క:— శీఘ్రముగ తీసికొనిపొమ్ము.

ము:— (పోవుచు) నేఁడేమి యీ విపరీత పరిణామము? నేఁడేమి యీ నీచగుణ ప్రదర్శనము? వాస్తవముగ మీరు మొగలు

లేనైయుండిన— వాస్తవముగ మీరు పవిత్రేస్లాము ధర్మావలంబులగు వీరశ్రేష్ఠులేనైయుండిన— ఈ నీచత్వమును విసర్జింపుఁడు. ఈ విశ్వాస ఘాతుకత్వమును పరిత్యజింపుఁడు. పితృతుల్యుఁడగు పాదుషా పక్షావలంబులై వీరదర్పమున శస్త్రధారణ మొనరింపుడు. వృక్షమువలె ఆశ్రయప్రదాతయగు సార్వభౌముని మంగళముకొఱకు మీ ఆత్మత్యాగము కావింపుఁడు!

మొ. సై.— మహారాజా! మహారాజా!

క:— పొమ్ము— శీఘ్రముగ కొనిపొమ్ము. సేనాపతీ!

(కతలుఖాను ముకుందదేవుని లాగికొనిపోవును.)

క:— మొగలుసైనికులారా! మీరేమి మతద్రోహులమ్యెదరా? నీచులగు కాఫరులై పోయెదరా? కాఫరువచనముల విశ్వసించి ఉన్మత్తులై పోయెదరా? సోదరులారా! ఈ నీచకాఫరుని యుద్దేశమును గుర్తింపఁ గలిగితిరా? తెలిపెదను. వినుఁడు. పవిత్రేస్లాము మతావలంబులను అపవిత్ర కాఫరుల స్వాధీనమొనర్చుటకు, ప్రాణాధికమై, పవిత్రతమమగు ఇస్లాము ధర్మమును హేయముగు, అపవిత్ర కాఫరు మతముగ పరిణత మొనర్చుట కీతని యుద్దేశము.

మొ॥సై— ఇంతటి ద్రోహమా! ఈ కాఫరుది? ఏడీ ఆకాఫరెక్కడ?

క:— మఱియు వినుఁడు. సోదరులారా! మీ పాదుషా అక్బరుతోడ నాకేమియు శత్రుత్వములేదు. వారితోడి వైరము నవాబు సులేమానుని మరణముతోడనే అంతర్హితమై పోయినది. పాదుషా అక్బరు మీకెటుల సార్వభౌముఁడో నాకు నటులే సార్వభౌముఁడు— జే! పాదుషా అక్బరుకు జే!

మొ॥సై.— జే! పాదుషా అక్బరుకు జే!

క:— రండు. సోదరులారా! భుజమున భుజము తగిల్చి, కరమున కరము గీలించి "అల్లాహో అక్బర్" చీత్కారమున భూమ్యా

కాశములవిదీర్ణమొనరించివైచి, కాఫరు జాతమును వినాశమొనరించు సాధనమున దృఢప్రతిజ్ఞులమై, ప్రమత్తులమై పోవుదము. కాఫరు మతవిచ్ఛేదమున బద్ధపరికరులమై విజృంభింతము.— కాఫరు నామము లుప్తమొనరించు ప్రయత్నమున ఉత్తేజితులమై పోవుదము.

మొ॥ సై:— ఆజ్ఞాపింపుఁడు. నవాబ్ సాహెబ్ ! మేమెల్లరము సంసిద్ధులము.

క:— ఇప్పటికి నా శిబిరమున కరిగి మీరొకింత విశ్రాంతి నందుఁడు.- ఎవరక్కడ ?— సిరఫ్, బాయిజీ లే ఆవో.

మొ॥ సై:— యా అల్లా ! క్యా తోఫా ! క్యామజా ! లావో బాయిజీ లావో సిరఫ్ ! (ప్రస్థానము)

క:— హిందూరాజు నేఁడు బందా ! హిందూధర్మాధీశుఁడు నేఁడు ఖైదీ ! రేపు హిందూ రక్తపాత ప్రదర్శనము ! మదీయాశా సాఫల్య మారంభమగును. పోయెదను. ఇపుడొకింత విశ్రమింతును.

(ప్రసూనుని ప్రవేశము.)

ప్ర:— విశ్రమింపఁజాలుదురా ! జనాబ్ !

క:— ఏల విశ్రమింపఁజాలను ? ప్రసూనా! ప్రసూనునివంటి సేవకుని సేవనమువలన ఎవ్వనికి విశ్రాంతి యొదవకుండును ? ఎవ్వని క్లేశ ముపశమింప కుండును ?-

ప్ర:— కాని, మనఃక్లేశము నెటుల పనోదన మొనరింపఁజాలుదురు?

క:— ప్రసూనుని ప్రసూన ముఖవిలోకనమున- ప్రసూనుని ప్రసూనవాక్య శ్రవణమువలన, సర్వచింతలును నిర్మూలమై పోవును. సర్వక్లేశములును విదూరమై పోవును. నా ప్రసూనమెల్లపుడు ప్రస్ఫుటితము. కాని, నేఁడిటు మ్లాన వదన మేటికి ప్రసూనా!

ప్ర:__ కీటదంశితము. జనాబ్ !

క:— ఏమి ? ఏదీ ఎక్కడ ? ఏకీటము దంశనమొనర్చినది ?

ప్ర:— ఏకీటకమా ! ఈ ప్రశ్నోత్తరమును తామే స్వయముగనే-ప్రథమమున సలిపిరి.

క:— ప్రసూనా ! ప్రహేళికా ప్రసంగము మానుము.

ప్ర:— అయిన, సెలవిండు. జనాబ్ ! నేఁడెవ్వని తా మంధకార కారాగృహమున బడఁద్రోసిసిరి ?— రేపెవ్వని తాము స్వహస్తముల విధ్వంస మొనరింప నుద్యుక్తులై యున్నారు ? ఎవ్వని పవిత్ర నామము లుప్త మొనరించి హిందూ జనముల హాహాకారముల వినుట కుత్కంఠులై యున్నారు ?

క:— (సస్మితుఁడై) బందా హిందూరాజు ముకుందదేవుని ప్రసూనా !

ప్ర:— "బందాహిందూ హిందూరాజు ముకుందదేవుని" ఈ పద సముదాయము నింత సహజముగ నుచ్చరింపఁ గలిగితిరా?_ నాలుక సంకుచితమై పోవలేదా ? హిందువుల ప్రాణము-హిందువుల సర్వస్వము- హిందువుల ధర్మరాజు— ముకుంద దేవుని నిధన చిత్రము నింతసులభముగ సృష్టింపఁ జాలితిరా ! శరీరము రోమాంచమున ప్రచలితమై పోవలేదా ?_ హిందువుల గగనవిదీర్ణార్త నాదమును ఇంత స్వాభావికముగ సహింప గమకించితిరా ? హృదయము ప్రకంపితమై పోవలేదా ? జనాబ్ ! జనాబ్ !

క:— ప్రసూనా! నీ వింతకాలము ముసల్మానుల మధ్యమున నుండియు నీ హిందూ భావములను విడువనే లేదేమి ?

ప్ర:— జనాబ్ ! మేఘావృతుఁడైనంత మాత్రమున సూర్యుఁడు తన యుష్ణత్వమునుఁ గోల్పోవునా ? రాహుగ్రస్తుఁడై నంత మాత్రమున శశాంకుఁడు తన శీతలత్వమును విసర్జించునా ?

క:— అయిన బాలకా ! రోదింపుము; హిందూప్రభువు బందా యయ్యెను. మొత్తికొనుము. హిందూప్రభువు శిరచ్ఛేద మొనరింపఁబడును; సంజ్ఞా విహీనుఁడవు కమ్ము. హిందూ నామ మచిరకాలమున నీ ధరా ధామమునుండి ఉత్పాటితమై పోవును.

ప్ర:— జనాబ్ ! జనాబ్ !

క:— నేను నిష్ఠురుఁడను. బాలకా ! నా ప్రతిజ్ఞను నేను సఫల మొనరింతును. హిందూరాజ్య వినాశమాచరింతును. హిందూ జాతమును సర్వనాశ మొనరింతును. హిందూ ధర్మమును విధ్వస్తమొనరింతును.

ప్ర:— అయిన నా కర్తవ్యము నన్నాచరింప నిండు, జనాబ్ !

క:— నీకర్తవ్యమేమి? బాలకా!

ప్ర:— నా కర్తవ్యము లేదా? హిందువునయ్యు నా కర్తవ్యము లేదా? ఒక హిందూద్వేషి హిందువుల సర్వనాశ మొనరించుచుండ హిందువునయ్యు నేనా దారుణ దృశ్యమును నిశ్చేష్టుఁడనై విలోకింతునా? జాతిత్యాగి నిజజాతి విచ్ఛేదసాధన మాచరించుచుండ నేను హిందువునయ్యు నిశ్చింత హృదయమున అది సహించి మిన్నకుందునా? అసంభవము!— అసంభవము!!

క:— హాహ్హాహ్హా! బాలకా! నీబాల్యచాపల్య మింతదనుక విడువవైతివి. చూచుచుంటినికదా! ఏమైనను నీస్వధర్మమునెడ నింత దృఢ విశ్వాసము నీ కుండినందులకు మిక్కిలి సంతసించితిని.

ప్ర:— (స్వగతము) నేను చాల పొరపాటొనరించితిని. ఉద్రేకవశమున నాభావనముల వ్యక్తపఱచి వైచితిని— (ప్రకా) జనాబ్ !

క:— ఏమి? ఏమనియెదవు? ప్రసూనా?

ప్ర:— రేపు హిందూప్రభుని రక్తపాతమగును. హిందూధర్మము సర్వనాశమగును!—

క:— అవును. అది అయి తీరును.

ప్ర:— ఆసర్వనాశమగుటకు పూర్వ మీ హతభాగ్యుఁ డొక్కపరి సజీవుఁడగు హిందూప్రభువును సందర్శింప నభిలషించుచు న్నాఁడు. ప్రభూ! ఇదియే ప్రార్థనము.

క:— వధ్యస్థానమున సందర్శింపఁ గలవు.

ప్ర:— వలదు జనాబ్! ఈ హతభాగ్యుఁడు ధర్మసంబంధమున కించి దుపదేశమందఁ జూచుచున్నాఁడు.—ఏకాంత మందుల కవసరము

క:— నీవు చాల ధర్మాభిమానివై కన్పట్టుచున్నావు. ప్రసూనా! సరియె. ఎపుడు సందర్శింపఁ గోరెదవు?

ప్ర:— నేఁటి నిశావసాన సమయమున— చతుర్థయామమున— కారాగృహమున నే అనుకూలమగును.

క:— ప్రసూనా! బందాతోడ ఏకాంతగోష్ఠియా! మఱియు నిశా సమయమున నా? ఇది నా ఆజ్ఞా విరుద్ధము. నీతివిరుద్ధము.

ప్ర:— జనాబ్! ఈ సేవకుని చిరకాల సేవాసంచిత వినిమయమున ఇంతటి స్వల్పానుగ్రహమును మాత్రము ప్రదాన మొనరింపుఁడు.

క:— సరియె. ప్రసూనా! నీ మనోవాంఛ నేను నెరవేర్చెదను. రమ్ము. నా నామాంకితమగు రత్నాంగుళీయక మిప్పుడే నీ కొసంగెదను.

ప్ర:— జే! నవాబ్ బహదూరుకు జే!

---

(పంచమ దృశ్యము).

కారాగృహము, ముకుందదేవు.

ము:— పొమ్ము యామినీ! చాల భాగ్యవతివి నీవు. నిష్కళంక భావమున నేడు నావద్దనుండి వెడలిపోవుచున్నావు! రమ్ము-ఉషఃకామినీ! రమ్ము. లజ్జించెద వేటికి? నే నెఱుంగుదును. నీవు స్వచ్ఛమనస్కవు. కాని, నేనేమి చేయుదును? ఇపుడు అధర్మమే అధికారము వహించియున్నది. అన్యాయమె శాసన మొనరించుచున్నది. ఏల దుఃఖించెదవు? వ్యర్థముగ యేల కన్నీరు కార్చెదవు? ఇంతమాత్రమున స్వధర్మావలంబు నెడ ధర్మత్యాగున కనుకంప యొదవునని యూహించితివా? విశ్వాసఘాతకుని శాణిత కృపాణము మొక్కవోవు ననుకొంటివా? నా శీతల రక్తప్రవాహము ప్రతిరుద్ధమైపోవునని యెంచితివా? అసంభవము! ఓ ప్రభూ! జగన్నాథా! నన్నిట్లే యుద్ధముచేయకయే బంధితమేషమువలె ప్రాణబలికి పాల్పడఁజేసెదవా? భీరువులకు బలె, కాపురుషులకు బలె నా మరణము లిఖించితివా? ఆః! క్షత్రియ హృదయమున ఎట్టి పరివేదన! వీరుని మర్మముల ఎట్టి పరిక్లేశము!

(కరవాలధారియై, ప్రసూనుని ప్రవేశము).

ప్ర:— ఈ దీనుని మర్మములయందు కూడ ఎట్టి పరిక్లేశము!

ము:— (ఆశ్చర్యమున) ఎవరు నీవు? బాలకా!

ప్ర:— నే నొక హతభాగ్య హిందువును ధర్మరాజా!

ము:— ఈ మహమ్మదీయ పరివార మధ్యముననా నీ నివాసము?

ప్ర:— చిత్తము. మహారాజా!

ము:— అయిన హిందువు నని పరిచయ మొనరించి బందాతోడ ఈ పరిహాస మేటికి బాలకా ?

ప్ర:— పరిహాసము కాదు మహారాజా ! విశ్వసింపుఁడు !

ము:— విశ్వ సింతునా ? కరమున కృపాణము ! నిశీథమున ఆగమనము ! బందా తోడ నిర్జన ప్రదేశమున సాక్షాత్కారము ! విశ్వసింతునా ? నిశ్చయముగ నీవు రహస్య హత్య కావింప పంపఁబడితివి.

ప్ర:— రహస్య భావమున రక్షణ మొనరింప పంపఁబడితిని మహారాజా !

ము:— రహస్యముగ సంరక్షించుటకా ? ( ఆశ్చర్యమున చూచు చుండును. )

ప్ర:— ఈ అధముని విశ్వసింపుఁడు మహారాజా !

ము:— విశ్వసింతునా ? ఎవ్విధమున స్వాధీనులగు యోధుల విశ్వ సించి నేఁడిట్టి దుర్భర నీచావస్థకు పాల్పడితినో సరిగా అట్లులె ఈ బాలకుని—శత్రు గృహ వాసిని, విశ్వసించుటయా ! అసంభవము ! అసంభవము !!

ప్ర:— (మోకరించి—శిరమువంచి) ప్రభూ ! ప్రభూ ! ఈ అధముని విశ్వసింపుఁడు.

ము:— (స్వ) సరళ హృదయుఁడీ బాలకుఁడు ! ( ప్ర ) సరియే బాలకా ! లెమ్ము—చెప్పుము. నన్ను కరుణార్ద్ర హృదయులై విముక్తుని గావింప ఉద్యమించిన ఉదార హృదయు లెవ్వరు ? చెప్పుము. ఎవరా దయా శీలురు ?

ప్ర:— అ దయా శీలు రెవ్వరా ? ఆ ఉదార హృదయు లెవ్వరా ? దేవా ! ఎవ్వఁడు గౌరవ లాఘవ భేదము లేక సమస్తమును సమదృష్టిని, ఉదార భావమున— లాలించి పాలించునో,

ఎవ్వఁడు గగన మండలమున గ్రహ తారకలను, భూమండలమున తరు లతాది సకల జీవరాలసును, సమభావమున కరుణించుచుండునో, అట్టి దేవ దేవుఁడు— జగన్నేత కాక ఇంత యుదార హృదయుఁ డింకెవ్వఁడు కాఁగలఁడు ? ఎవ్వఁడు దయాశీలుఁడు కాఁగలఁడు ?

ము:— విశ్వాస మొదవు చున్నది. బాలకా ! నీవు సామాన్య బాలకుఁడవు కావు. నీవు దేవ దూతవు. పాపుల నుద్ధరింప పేరితుఁడవు. (ఊర్ధ్వదృష్టినిడి) ఆహా ! ఎట్టి ఉదారత ! ఎంత దయా శీలత ! దేవా ! అశేష గుణధారి వగు నీ పాద పద్మముల కిదె ప్రణిపాత మొనరించెదను. (శిరము వంచును) బాలకా! నీవు కూడ నాకు ప్రణమ్యుఁడవు! (శిరమువంచును )

ప్ర:— దేవా ! ఈ అకించనుని క్షమింపుఁడు ! ఈ సేవకుఁడు తన కర్తవ్యమును మాత్రము పాలించుచున్నాఁడు.

ము:— ధన్యుఁడవు. బాలకా ! నీ కర్తవ్యపాలనము ధన్యమైనది. కాని, బాలకా ! నేను క్షత్రియుఁడను—వీరుఁడను. ఇట్టి నే నొక కాపురుషునివలె పలాయన మొనరించుట ఉచితమా !

ప్ర:— వలదు.

ము:— అయిన—?

ప్ర:— పరాక్రమ ప్రదర్శన మొనరించి వీరునివలె పోవుట కేమియు అభ్యంతరముండదు కదా !

ము:— కాని, నేను సహాయహీనుఁడను కదా !

ప్ర:— ఏమైనను— నా కౌశలమెల్ల ప్రదర్శించి కారాగృ రక్షకుని దగ్గఱనుండి తాళము సంపాదించితిని. (కారాగృహ ద్వారముల దెఱచి, ఖడ్గమును ముకుందదేవుని చేత నిడి ప్రకాశముగా) ఇదియే సాయము కైకొనుఁడు. దేని యభావమున మిమ్ముబోలు వీరుఁడిట్టి దుర్దశాగ్రస్తుఁడయ్యెనో దాని సాహాయ్యమును స్వీకరింపుఁడు.

ము:— బాలకా! నీవు సహజ వీరుఁడవు. వీరుని మనోభావమును గ్రహించి, వీరుని ప్రధాన సాధనము నేమరక సంచరించితివి. (ఖడ్గముఁ గైకొని) రమ్ము! కృపాణమా! వీరుని యేకమాత్ర సహాయమవు! క్షత్రియుని ఏకమాత్రావలంబనమవు!

ప్ర:— మహారాజా! ఇప్పుడు రాత్రి యంతమగుచున్నది. ప్రమత్తులు కండు. అదే కావలివారి పాదధ్వని వినవచ్చుచున్నది.

(ప్రస్థానము)

(కావలివారి ప్రవేశము).

కా:— ఏమిది! ఖైదీ వీడిపోయెను! చేత కత్తియున్నది. కావుఁడు. లెండు. లెండు. కావుఁడు.

ము:— భయము వలదు. ఖైదీ వీడుపడుట నిజమే. కాని, పాఱిపోవ నుంకింపఁడు.

కా:— ఆహా! ఎంత అమాయకుఁడు! పాఱిపోవుటయే యెఱుఁగఁడు.

ము:— పాఱిపోవుటయా! క్షత్రియుఁడై పాఱిపోవుటయా! క్షత్రియుఁడెన్నఁడును పాఱిపోవుట నెఱుఁగఁడు. క్షత్రియుఁడెఱుంగునది ఒక్కటియె! "కార్యం వా సాధయేత్ - శరీరం వా పాతయేత్.

కా:— అచ్ఛా! భేష్! అయిన మాతో యుద్ధము చేయుము.

[యుద్ధము చేయుదురు. కావలివాండ్రు పాఱిపోవుట.]

ము:— ఈపరి నా మార్గము నిష్కటంకమైనది.

(కళాపహాడ్ ప్రవేశము).

క:— కాని కళాపహాడు మాత్రము సమ్ముఖమున కలఁడు. వృథా ఆశ, బందా! వ్యర్థాశ.

ము:— కాదు. కాదు. వ్యర్థాశ కాదు. నేఁడు పహాడును (పర్వతమును) ఉల్లంఘింపఁ గలుగు సుయోగము లభించి యున్నది.

క:— క్షుద్రుని కింత గర్వమా!

(ఉభయులును యుద్ధము చేయుచుండ కతలుఖాను సైన్య
సమేతుఁడై యరుదెంచి కళాపహాడునకు
సహాయము చేయును.)

ము:— (యుద్ధ మొనరించుచుండగా ఖడ్గము విఱుగును) మఱి యుపాయము లేదు. జగన్నాథుఁ డొక్కఁడే సహాయము.

క:— ఇదియే మంచి సమయము. మఱి విలంబనమున ప్రయోజనము లేదు.

(ప్రసూనుని త్వరితగతి ప్రవేశము)

ప్ర:— మఱి విలంబనమున ప్రయోజనము లేదు. ఇదిగో యీఖడ్గమును కొనుఁడు. (ముకుందదేవునికి ఖడ్గమొసఁగును)

క:— ఇదేమి? వీఁడు ప్రసూనుఁడు! విశ్వాసఘాతుకుఁడు, యుద్ధము! యుద్ధము!!

(మఱల యుద్ధ మొనరింతురు. ఎల్లర పరాజితులఁజేసి ముకుందదేవుఁడు
దుర్గితగమనమున నిష్క్రమించును).

ప్ర:— ధన్యుఁడవు వీరముకుందదేవా! ధన్యుఁడవు. ధన్యుఁడవు ప్రభూ! జగన్నాథా! ధన్యుఁడవు.

క:— ముకుందదేవుఁ డొక్కఁడే మనల నిందర పరాజితుల సల్పి పాఱిపోయెగా!

కత— ఎయీ చోకరాకా వాస్తె ఖుదావంద్! ఎయీ చోకరాకే వాస్తె.

ప్ర:— (కతలుఖాను నుద్దేశించి) మఱి వీరుఁడవై నీవు సుస్థిరుఁడవై చూచుచుంటివా?

క:— (క్రోధమున) ప్రసూనా! ఇంతటి విశ్వాసఘాతుకుఁడవా నీవు? ఇదియేనా నాస్నేహప్రదానమునకు నీవొసంగిన వినిమయము? ఇదియేనా నా ఆశ్రయ పరిదానమునకు ప్రతిఫలము?

ప్ర:—జనాబ్! ఈభృత్యుని కర్తవ్య మితఁడు నెఱవేర్చియున్నాఁడు.

క:— ప్రభువునెడ విశ్వాసఘాతుకత్వమును సల్పియా?

ప్ర:— ప్రభువుని ధర్మరక్షణ మొనర్చి జనాబ్!

క:— హిందూప్రాణ వినాశనమే నాధర్మము.

ప్ర:— అధర్మము జనాబ్!

క:— నీకు కావచ్చును.

ప్ర:— సమస్త జగద్వాసులకును జనాబ్!

క:— కాని నాకు మాత్రముకాదు.

ప్ర:— అయిన దేవర ఈ జగద్వాసులుకారా?

క:— అవసరము లేదు.

ప్ర:— అయిన హిందూ రక్తపాతము వలన నేమి ప్రయోజనము?

క:— నీతోడి యీ వృథాలాపములకంటె అధికతర ప్రయోజనము కలదు. ఎవరక్కడ? పట్టికట్టుఁడీ విశ్వాసఘాతకుని. ప్రథమమున నీతనిరక్తపాతమునె నేను స్వహస్తములతో గావింతును. నా ప్రతిజ్ఞాపాలనమునకు భూమిక ఇచటనే ప్రారంభించెదను.

కత:— ఈసారి యీ యువకుఁడేమి చేయునో చూతము.

(బంధింపఁబోవును).

ప్ర:— జాగ్రత్త విశ్వాసఘాతక శునకమా! (కళాపహాడ్ దెస) జనాబ్! అన్యులతోడి ప్రయోజనమేమి? ఈ సేవకుఁడు సహర్షమున తన ప్రభుని ఆదేశమును పాలించును).

క:— (స్వగతమున) హృదయమా! ఏల[illegible]మెత్తవడియెదవు? కాఠిన్యమును వహింపుము. పాషాణసదృశ కాఠిన్యమును వహింపుము. దయాశీలత్వమా! నీవు విశ్వాసఘాతుకవు. నీతోడి ప్రయోజనమింక నాకీ లోకమున లేదు. పొమ్ము తత్‌క్షణమె దూరముగ తొలఁగి పొమ్ము. క్రోధమా! ద్వేషమా! ఓ మధురతమ ద్వేషమా! రండు. ఈ హృదయాసన మాయత్తపఱచితిని. రండు నిస్సందేహ చిత్తమున అధిష్టింపుఁడు. నేను హిందువుల రక్తమును త్రావెదను. హిందూరాజ్యమును వినాశన మొనరించెదను. హిందువుల ధర్మమును విధ్వంస మొనరించెదను. (ప్రకాశముగ ప్రసూనుని దెస) శీఘ్రము సంసిద్ధుడవుకమ్ము! విశ్వాసఘాతకా! (కత్తి నెత్తును)

ప్ర:— ఇదే సంసిద్ధుఁడను ప్రభూ! (మోఁకరించును) ఓ ప్రభూ! నీలాచలధామా! జగన్నాథా! ఈ నా ప్రభువునకు మంగళము చేకూర్పుము— ఈ దీనమానవునకు నీ కృపారాజ్యమున ఆశ్రియమిమ్ము.

క:— ఏమి అపూర్వబాలకుఁడు! ఆశ్చర్యము!— ఊఁహూఁ! (వధింప కత్తినెత్తును. కత్తి చెయిజాఱి పడును). ఏమిదీ? ఏమైనది! ఖడ్గము నేఁడు మత్కరచ్యుతమై పోయె నేటికి?— సర్వాంగములును కంపించుచున్నవి!— హృదయము కంపించుచున్నది!— పృథివి కంపించుచున్నది!— ఆకాశము కంపించుచున్నది!— సమస్త సృష్టియును కంపించుచున్నది!— ఓ! ఏమి యీదుర్బలత్వము? కళాపహాడునకు నేఁడేమి యీ దుర్బలత్వము?— సామాన్యుఁడగు నీక్షుద్రబాలకుని యెడ ఇంత మమతయా? సామాన్యుఁడగు ఒక సేవకాధముని యెడ ఇంత యభిమానమా? అసంభవము! అసంభవము!!— ఎవఁడురా అక్కడ?— తెమ్ము. నాఖడ్గమును శీఘ్రము నాకందిమ్ము.—

(కతలుఖాను ఖడ్గమును తీసి యిచ్చును.)

క:— చూచెదఁగాక నే హిందూరక్తమును! చూచెదఁగాక నే హిందూహింసను!! చూచెదఁగాక నే హిందూ విధ్వంసమును!!!

(కత్తి నెత్తును)

ప్ర:—తుదకు నిన్నొక్కపరి చూడనిమ్ము ప్రభూ! కడసారి నిన్నొక్కపరి చూడనిమ్ము.—

కళాపహాడ్డు ప్రసూనులు పరస్పరము మంత్రముగ్ధులగునటుల వీక్షించుచుందురు.

ఎత్తఁబడిన కళాపహాడు చేతి ఖడ్గము నేల బడిపోవును.

---

తృతీయాంకము సంపూర్ణము.







ఓం

# ఉత్తరాభిపతనము.

## చతుర్థాంకము.

### ప్రథమదృశ్యము.

శిబిరము.

( ముకుందదేవుఁడు, దేహరక్షకులు ప్రవేశము. )

ము:— దేహరక్షకులారా ! నాకు శక్తి యొదవుచున్నది. నను వెడలనిండు. మఱల యుద్ధ మొనరించెదను.

దేహ:— మహారాజా ! నిజ దేహము నొకపరి విలోకింపుఁడు.

ము:— విలోకింతునా ? కార్యావసరమున నిజదేహ విలోకనమా ? క్షత్రియు నెడ నిది అసంభవము. ముకుంద దేవునకిది అస్వాభావికము.

దేహ:— మహారాజా ! శిఖి మోనాయిల వలన ప్రకృతము యుద్ధ కార్యములు చక్కఁగ నడచుచున్నవికాదా ?

ము:— శిఖి మోనాయిలపైని భారముంచి నిశ్చింతత వహింపవలయునా ? దాయిత్వ జ్ఞాన శూన్యులగు వారిపై నాధారపడి

యూరకుండ వలయునా? ఆహా! వారు తగు సమయమున కేయిట కరుదెంచి యుండిన, నన్నీ క్షతగాత్రునిగ, రక్త రంజిత దేహునిగ మీరు చూచి యుండకుందురుకదా! విజయలక్ష్మి అనాయాసముగ, జనక్షయము కాకుండ మన కలవడి యుండునుకదా! నన్నుఁబోవనిండు. కరవాలము నందిండు. మఱి విలంబమును సహింపఁజాలను. (కత్తిఁగైకొనుచు) రమ్మ. ఖడ్గమా! క్షత్రియున కేకమాత్రావలంబనీయవు. విజయ పథమున క్షత్రియున కేక మాత్రాధారమవు.

(నేపథ్యమున కోలాహలము)

ము:— జే! జగన్నాథస్వామికి జే!

(నేపథ్యమున జే! జగన్నాథస్వామికి జే!)

ము:— ఏమిది? ఇది మన సైనికుల కంఠధ్వనియే. వీరు విజయులా? పరాజితులా?—

(సైనికులతో శిఖి, మొనాయిల ప్రవేశము.)

శిఖి:— మేము విజయులము. మహారాజా! అదే శత్రు శిబిరము వంకఁ దిలకింపుఁడు. ప్రకంపిత గాత్రమై శ్వేతపతాక మెటుల శాంతి భిక్ష నర్థించుచున్నాదో!

మొనా:— ఈ దెసఁ దిలకింపుఁడు. శత్రు శిరోమణి యెటుల వినయ వినమితోత్తమాంగుఁడై మందగమనమున సంధి భిక్షార్థియై మహారాజశ్రీ చరణముల నాశ్రయింపఁ జనుదెంచుచున్నాఁడు?

ము:— (స్వగతమున) ఆశ్చర్యము!— కళాపహాడింత శీఘ్రముగ పరాజితుఁడయ్యెనా? (ప్రకాశముగ) సహకారులారా! మీరు ధన్యులరు. సైనికులారా! మీరును ధన్యులరు.

మీ మూలమున నేను నేఁడీ మహా గౌరవ మండితుఁడను. విజయ సంకలితుఁడను.

( కళాపహాడు ప్రవేశము )

క:— అభివాదనము మహారాజా !

ము:— అభివాదనము సేనాపతీ

క:— ధన్యమైనవి మహారాజా ! మీ బల వీర్యములు, సమర నైపుణ్యము, ధన్యమైనవి. ఈ విధమున నిజ శరీరమును తృణప్రాయముగ గణించి, ప్రాణమును తుచ్ఛమని యెంచి, దృప్త మృగేంద్ర సదృశముగ, అగణిత సైన్య నివహము నొంటరివై యెదిరించి నిలచిన వీర వతంసమును మహారాజా ! ఈ విశాల భారత వర్షమున అత్యల్పముగ వీక్షించియున్నాను. దిల్లీశ్వరుఁడగు అక్బరు పాదుషాయే స్వయముగ తమతోడి పోరున నిగ్రహింపఁజాలక పరాజితుఁ డయ్యెఁగదా ! దేవా ! ఇవి చారణుని ప్రశంసా గీత వాక్యములు కావు. నేను స్వయముగ ననుభవించి యున్నాఁను. స్వయముగ పరీక్షించి యున్నాను.

ము:— వీరశిఖామణీ ! ఏ గుణాలంకార వాక్యముల నీ వకించనుని విభూషితు నొనరించితివో, వాని కెల్ల నీవ యోగ్య పాత్రుఁడవు. నీ వంటి వీర వతంసుఁడు, రణకుశలుఁడు, ఈ భారత వర్షమున నన నేటికి— సమగ్ర పృథ్వీ మండలమున— లేడనిన అత్యుక్తి కాఁజాలదు. స్వయముగా దిల్లీశ్వరుఁడె, ఈ విద్రోహ దమనార్థము నన్నామంత్రణ మొనర్చియు, నిశ్చింతుఁడు కాక స్వసైన్యముల నొసఁగి కతలుఖానుని నా సహాయార్థ మేల పంపియుండెనో ఆ కారణమును నే నిప్పుడు తెలియఁ గలిగితిని. ఈ సమరమున హృదయంగమ మొనరింపఁ గలిగితిని.

శిఖి:— వీరుని తోడ వీరునికి సమ్మేళన మొదవినందులకు నేఁడీశ్వరునికి ధన్యవాదములు. మణితోడ నేఁడు కాంచనమునకు సమ్మేళన మొదవినది.

అందఱు:— జే ! మహారాజ ముకుంద దేవా ! జే ! జే !!
కళాపహాడు సేనాపతీ జే!

ము:— జే ! అక్బరు పాదుషాకు జే!

అందఱు:— జే ! అక్బరు పాదుషాకు జే !

క:— విచ్ఛేయుఁడు, మహారాజా ! మిత్రభావమున నేఁడు నా ఆతిథ్యమును స్వీకరింపుఁడు.

ము:— ప్రథమమున సంధి షరతులు లిఖించి ఢిల్లీశ్వరుని సమక్షమునకు పంపనిండు. మఱొకమాట, సేనాపతి ! సంధిపత్రమును వ్రాయుటకు పూర్వము విశ్వాస ఘాతుకుఁడగు కతలుఖానుని నా కర్పింప వలయును. ఢిల్లీశ్వరుఁ డీసంధి షరతుల నాలించుటకు పూర్వమే ఆ నరాధముని భిన్న మస్తకమును తప్పక వీక్షింప వలయును.

శిఖి:— కతలుఖాను నిహతుఁడయ్యెను మహారాజా !

ము:— కతలుఖాను నిహతుఁడయ్యెనా ? అయిన ఆతని భిన్నమస్తకమేదీ ?

శిఖి:— అతని మృతగాత్ర మంతర్హిత మైనది.

ము:— అంతర్హితమా ! అదియెటుల ? సందేహ మొదవుచున్నది !

శిఖి:— నే నను సంధాన మొనరించి చూచితిని. ఆతని విశ్వాస పూరితులగు కొంద ఱనుచరులు తమ ప్రభుని మస్తకమును ఛేదించెదరను భయమున ఆతని మృత కళేబరము నెచటనో భూగర్భమున దాచివైచిరని వినుచున్నాను.

ము:— (స్వ) నా కిందు సందేహ మొదవు చున్నది. నేను స్వయముగ చని అన్వేషింప వలసి యుండును.

( ఢిల్లీ దూత ప్రవేశము. )

దూత:— జే ! మహారాజ ముకుందదేవుకు జే !

ము:— రాయబారీ ఢిల్లీ సమాచారములేమి ? సరియే. ఆ శిబిరాంతరమునకు పోదము.

( దూత ప్రస్థానము. )

ము:— శిఖి మోనాయిలారా ! చమూపతిని సమాదర పూర్వకముగ మదీయ ప్రశస్త శిబిరమునకుఁ దోడ్కొని పొండు. నే నిప్పుడే యరుదెంచెదను.

( ప్రస్థానము. )

శిఖి:— నవాబు సాహెబ్ ! ఢిల్లీ దూత ఆగమన కారణము నూహించితిరా ?

క:— యుద్ధము నందలి ఫలాఫలముల నరయుట కని తలంతును.

శిఖి:— అదియొక కారణము కావచ్చును. మఱియొకటి యేమనిన జరుగ నుండిన పాదుషా జన్మ దిన మహోత్సవమున కాహ్వానము కూడ కావచ్చును.

మోనా:— వహవ్వా ! అటులే యైన రక్త పాతము లేకుండగనే కార్యము పరిష్కారమై పోవును.

క:— అనుమానములపై నిర్భరులమై మన మానంద మందుట యుచితము కాదు. ప్రస్తుతమా ప్రశస్త శిబిరమునకు పోవుదము. ఈ విధమున నిట సంభాషించుట నెవ్వరైన వీక్షించిన మనల సందేహింప వచ్చును. మన గుప్త మంత్రణ మతి గోపనమునఁ అప్రమత్తులమై యొనరింప వలయును.

శిఖ:— అవును. దయ చేయుఁడు. నవాబ్ సాహెబ్ !

మొనా:— (స్వ) ఆహా ! "మొనాయి మహాంతి" సేనాపతి పదమున నెపుడు ప్రతిష్ఠింపఁబడునో కదా !

( అందరు నిష్క్రమింతురు. )

---

## ద్వితీయ దృశ్యము.

(అరణ్యము).

(సన్యాసి వేషమున ప్రసూనుని ప్రవేశము).

ప్ర:— నేఁడు తలఁటిమి వేయఁబడి ఈ అరణ్యవాసినయ్యు, నేను మహా సౌఖ్య మనుభవించుచున్నాను. నా మానస మానందమున ప్రపూరితమై యున్నది! నా ప్రభువును నరహత్యా పాతకమునుండి రక్షింపఁ జాలితిని. ధర్మరాజు ప్రాణరక్షణము సలుపఁ జాలితిని. కాని, ఈ సంగ్రామ మంత్యమగు వఱకు మహారాజిటనుండి సురక్షితముగ వెడలిపోవువఱకు నిశ్చింతత వహింప నేరకున్నాను.

(ఫిరోజా ప్రవేశము).

ఫి:— నిశ్చింతత వహించుట కవకాశమెక్కడిది ? ప్రసూనా ?

ప్ర:— ఏమి విషయమేమి ? ఫిరోజా ! యుద్ధసమాచారము లేమి ?

ఫి:— సంధి జరిగినది. ముకుందదేవుఁడు పాదుషా జన్మదినోత్సవమున కాహ్వానింపఁబడి ఢిల్లీయాత్ర సాగించియున్నాఁడు.

ప్ర:— అయిన నిది మంచి సమాచారమే కదా ! ఫిరోజా !

ఫి:— ముకుందదేవుని సహకార వర్గము విశ్వాస ఘాతకులై యుండనిచో సుసమాచారమై యుండెడిది.

ప్ర:— ఏమి ? విశ్వాస ఘాతుకత్వమా !

ఫి:— ముకుందదేవుఁడు సంధి నిబంధనల ననుసరించి పఠానుసైన్యముల నస్త్రవిహీనులఁ గావించి, రాజ్యమున శాంతిస్థాపనఁ గావింప సహకారుల కాతఁడా దేశ మొసఁగిపోయెను కాని, వారు తమ రాజు వెడలిన తత్క్షణమె, నిజసైన్యముల నిరస్త్రులఁ గావించి, పఠాను సైన్యముల నాయుధ హస్తులఁ గావించి, ఉత్కల దేశాభిముఖముగ నడపియున్నారు. ఈ సంధి కపట సంధి యనియు, నవాబు ఉద్దేశ మేమనిన — ముకుందదేవు నెటులైన స్థానాంతరమునకు వెడలనడిచి, నిజోద్దేశమును— ఆ పైశాచిక ప్రతిజ్ఞాపాలనమును; నెఱవేర్చుటయనియు, నెచ్చెలి చెప్పి యుండెను.

ప్ర:— ఆ జగన్నాథుని సంకల్ప మేమో ఆతఁడె యెఱుంగును. సరియే ఫిరోజా ! ముకుందదేవుఁడింత తీక్ష్ణబుద్ధియు, రాజనీతి జ్ఞుఁడునై యుండియు శాత్రవుని యీ కపట తంత్రమును తెలిసి కొనలేకపోయెనా ?

ఫి:— కాపట్యమును గుర్తించుట కవకాశ మెక్కడిది ? పాదుషా నిమంత్రణ మంతయు నిష్ఫల మొనరించెను.

ప్ర:— ఇప్పుడుపాయ మేమి ? ఫిరోజా ! మనము జీవితులమైయుండ గనే మన నవాబిట్టి క్రూరకార్యమున ప్రవృత్తుఁడగుటయా ! ఇట్టి భీషణ నరకకుండమున పతితుఁడగుటయా ?

ఫి:— ఆ ఖుదా తన యిచ్ఛ తానే యెఱుంగును.

ప్ర:— ఖుదా యిచ్ఛ నటుండనిమ్ము. మనకర్తవ్యమును మన మొనరింతము నడువుము. ఫిరోజా !

ఫి:— రమ్ము. ప్రసూనా ! నెచ్చెలియు నీ యాగమనమునకు ప్రతీక్షించుచున్నది. (స్వ.) ఆశ్చర్య మీ బాలనుని ప్రవర్తనము.

(ఉభయులును గమనోద్యుక్తులగుదురు).

ప్ర:— ఫిరోజా! చూచితివా! అదిగో! ఇరువు రెవరో యిటు వచ్చుచున్నారు. మన వెదకేగిన వారి వలెనే తోచుచున్నది.

ఫి:— అవును. వారు కతలు రహమత్ఖానులు, కతలుఖానెటుల బ్రదికెను? అతఁడు మరణించెనను వదంతి యుండెనే!

ప్ర:— రహమత్ఖాను కారాగార బద్ధుఁడై యుండెఁగదా!

ఫి:— అవును—కాని, కొన్ని దినములకు పూర్వ మాతఁడు పలాయనుఁడయ్యె నని వదంతి వ్యాపించెను. హతభాగ్యుఁడగు కారాగృహ రక్షకుఁ డందువలన మరణదండన మనుభవించెను.

ప్ర:— హతభాగ్యుఁడగు నా కారాగృహ పాలకునికి బదులుగ కతలు ఖానా మరణ దండన మనుభవించుట యుచితమై యుండెను. ఈ విషయమున నిశ్చయముగ ఆతని సాహాయ్యము కలదు. ఇదిగో వారు వచ్చిరి. వారి ప్రవర్తనమునుబట్టి ఏదియో నిగూఢ వ్యాపార మొనర్ప నున్నారని స్పష్టముగ తెలియ వచ్చుచున్నది, రమ్ము. ఈలతాంతరాళమున డాఁగి ఆలింతము.

(ఫిరోజా ప్రసూనులు లతాంతరాళమున డాఁగియుందురు.)

[కతలు రహమత్ఖానుల ప్రవేశము]

క:—రహమత్! ఖుదా కృప వలన మన పరస్పర మనోవాంఛలు సఫల మొనరింపఁ జాలుదుమని ఆశ యొదవుచున్నది.

ర:— ఎటుల?

క:— చారునివలన విని యుంటివి కదా! ఈ ఉత్కలాక్రమణమున నేను కళాపహాడునకు ప్రధాన సహాయుఁడ నయ్యెదనని,

ర:— ఆ! అది విని యుంటిని.

క:— అయిన తదుపరి కార్య మాలింపుము. కళాపహాడునకు నేను పరమ విశ్వాసి నయ్యెదను. ఆ సంయోగముననె— ఆ యవకాశమునసె నీ కంటకమును విచ్ఛిన్న మొనరించి వైచెదను.

ర:— వాః! వాః! తోఫా! తోఫా!

క:— మఱియు వినుము. ముకుంద దేవుఁడు కళాపహాఁదుని విశ్వాస ఘాతుక కృత్యమును, ఉత్కలాక్రమణమును విని వ్యస్తత్రస్త హృదయుఁడై తప్పక యిటకు చనుదెంచును.

ర:— అయిన ఏమగును?

క:— అతనికి సాయమొనరింతునని నీవు చక్కఁగ అతనికి విశ్వాస మొదవఁజేసి తదుపరి నా కంటకమును విచ్ఛిన్న మొనర్ప వలయు.

(అంతరాళమునుండి ఫిరోజా) ఆః! ఖుదా!

ర:— (చమకితుఁడై) ఎవరిది! ఎవరిదీ స్వరము. (వృక్షాంతరాళము నకు పరువెత్తును)

క:— నిశ్చయముగ శత్రువులె! తత్‌క్షణము నాశన మొనరింపుము. మన రహస్యాలోచన మంతయు ఆలించి యుందురు.

(పరువెత్తును.)

(వేగముగ ఫిరోజా ప్రసూనులు ప్రవేశము.)

ఫి:— ప్రసూనా! రక్షింపుము. రక్షింపుము.

ప్ర:— ఫిరోజా! అల్లాను స్మరింపుము. ఆతఁడె రక్షించును.

(ప్రసూనుఁడు యుద్ధమొనర్ప సంసిద్ధుఁడగును.)

(వేగముగ కతలు రహమత్ఖానుల ప్రవేశము.)

క:— ఇదుగో! దుష్మన్!

ర:— ఈమె ఫిరోజా!

క:—రహమత్! తెగటార్చుము. విలంబమున వినాశము సంభవించును.

ప్ర:— ఫిరోజా! నీవు నిశ్చింత చిత్తమున నావెనుక నుండుము. నా జీవనము లుండు దనుక నీ కేమియు భయము లేదు.

ర:— వాః! ముదుసలిది చాల సాహసము.

ప్ర:— పోరు సలుపుఁడు— నరాధములారా!

(యుద్ధము చేయుచుండ ప్రసూనుని కృత్రిమపు గడ్డము జాఱిపోవును.)

క:— వీఁడు ప్రసూనుఁడు. కొట్టుము. చంపుము. శీఘ్రముగ రహమత్! వీఁడు భీషణ బాలకుఁడు.

(ఘోరముగ పోరు జరుగుచుండ ప్రసూనుని ఖడ్గము విఱుగుట)

ఫి:— ఈ పర్యాయము సరి! ఖడ్గము విఱిగిపోయినది. ఈ పరి సరి. హా! ఖుదా! (మూర్ఛిల్లును.)

ప్ర:— (భగ్న కృపాణమున యుద్ధము చేయుచు నేపథ్యమున కరుగును.) హా! ప్రభూ! జగన్నాథా! ఫిరోజా ప్రాణముల రక్షింపుము.

క:— ఈ పరి నిరస్తుఁడవు కమ్ము! బాలకా!

ర:— ఈ సారి జగన్నాథుని మహిమ చూడుము!

(వెన్నాడనున్న సమయమున రివ్వురివ్వున కొన్ని శరములు రహమత్ కతలుఖానుల శరీరముల దూసికొని పోవును.)

ర-క—హా! (భూపతితులగుదురు).

(వేగముగ వేటకాండ్రగు కిరాతకుల ప్రవేశము.)

కిరాత:— (చూచి) అరే! వరాహము కాదురోయి! ఇద్దఱు మనుష్యులు! బాగో! బాగో! (పారిపోవుదురు)

ప్ర:— దేవా! వాస్తవముగ నీవు దీననాథుఁడవు. ఫిరోజా! లెమ్ము చూడుము. ఖుదా నేఁడెట్టి కృపాళువో! శత్రుగృహద్వారము నుండి మనల నెటుల ఉద్ధరించునో!

ఫి:— (లేచి) ధన్యుఁడవు ఖుదా! నీ ఆర్తత్రాణ పరాయణత్వము ధన్యమైనది.

(ఉభయులు ప్రస్థానము).

———(♦)———

## తృతీయదృశ్యము.

(కక్ష్యాంతరము).

(దులియా ప్రవేశము).

దు:— హా! పితా! నేఁడు నీ జన్మదివసము! ఎంత ఉత్సవము జరిగి యుండును! ఎంత ఆనందమంది యుందును! కాని అవన్నియు ఎక్కడ! నలుమూలలను నేఁడు కేవలము రోదన ధ్వనులు. శోకముయొక్క విషాదమూర్తి ప్రదర్శనము, ఎవ్వనిమూల మున నేఁడీ దృశ్యము! ఎవ్వనివలన నేఁడీ ఆర్తప్రణాదము! రహమత్! పాపిష్టుఁడు! వాఁడు పలాయితుఁడయ్యెను. యంత్రణా విముక్తుఁడయ్యెను. ఇదియేనా ఖుదా న్యాయ విచారము!

(ప్రసూనుని ప్రవేశము).

ప్ర:— సరియగు న్యాయవిచారము సోదరీ!

దు:— బందీముక్తుఁడై యుండుటయా!

ప్ర:— కాదు! నరకలోకమున కంపఁబడుట!

దు:— బందీముక్తుఁడగుట నరకలోకముక కంపఁబడుటయా!

ప్ర:— అవును. రహమత్ఖాను నెడ సరిగ నట్టులే జరిగినది.

దు:— పరిహాసము వలదు. ప్రసూనా !

ప్ర:— పరిహాసము బేగము తోడనా ! అదే నవాబు విచ్చేయుచున్నాఁడు. అంతయు నాతని వలన వినియెదవు. నే నీ యవని కాంతరాళమున కరిగెదను. ( ప్రస్థానము )

( కళాపహాడు, ఫిరోజా ప్రవేశము. )

క:— కతలుఖాను కూడ హతుఁడయ్యెనా ? ఫిరోజా ?

ఫి:— ఇరువు రొక్కపెట్టుననే హతులైరి. జహాఁపనాహ్ !

దు:—తక్కిన వాఁడెవ్వఁడు ? ఫిరోజా !

ఫి:—ఆ నరపిశాచము. మీ పితృ భ్రాతృ హంతకుఁడు రహమత్ ఖాను

దు:—రహమతా !—ఖుదా ! ధన్యుడవు !

క:—అఁ ! కతలుఖాను హతుఁడయ్యెనా! నా ప్రధాన సహాయకుఁడు నిహతుఁ డయ్యెనా ? ముకుంద దేవుని ప్రధాన వైరి కడతేఱెనా ?— ఇపు డుపాయమేమి ?

ఫి:—జహాఁపనాహ్ ? కతలుఖాను విషయమున నింతటి విచారమేటికి ? అతఁడు విశ్వాస ఘాతకుఁడు ? మీకు విరుద్ధముగ కూడ నాతఁడు కుతంత్రములు పన్నుచుండెను.

క:— నా విరుద్ధమున కుతంత్రమా ! విడువు మీ మాటలు. నేను ప్రస్తుత కర్తవ్యమునకు గడంగ వలయును.

దు:—ధన్యుఁడవు ఖుదా ? విశ్వాస ఘాతకు లిరువురు నొక్కపరియే త్రెళ్ళిరి ! ప్రసూనా !

క:—ఏడీ ప్రసూనుఁడు !

దు:—( నాలుక కరచుకొని ) ఆతఁడు మఱి యీ స్థానమున నున్నాఁడా ! తరిమివేయఁబడెను కదా !

క:— (నిట్టూర్పు పుచ్చి స్వగతమున) చక్కని బాలకుఁడు!— పోనిమ్ము. ఎటులైనను నేను నేఁడు ఉత్కల దేశాభిముఖముగ జైత్రయాత్ర సలుప వలయును. కతలుఖాను లేకుండిన, ముకుంద దేవుని ప్రధాన వైరుల శిఖి మొనాయిల సహాయ లాభము నందియున్నాను. (ప్రకాశముగా) ప్రియా! నేఁడు నేను ఉత్కల యాత్ర సాగింతును. నీవు శీఘ్రముగ నా ప్రయాణమునకు తగు నాయత్తముల సలుపుము.

దు:— ప్రాణేశ్వరా! ఉత్కలాక్రమణమును నేఁటికి విరమింపుఁడు. హిందువుల దుష్కర్మమునకు తగిన శాస్తి వారే యనుభవింతురు. కతలు రహమత్ఖానుల దుర్గతి నోకించుక పరికింపుఁడు. ఖుదా నిశ్చయముగ పాపుల దండించి తీరును.

క:—హాహాహాః! ప్రాణేశ్వరీ! ఖుదా నెపుడైన తిలకించితివా? అతని కేమి మన వలె నంగ ప్రత్యంగములు గలవా? కార్య కరణ శక్తి కలదా!

దు:— కార్య కరణ శక్తి యుండనిండు. లేక పోవనిండు. అంగ ప్రత్యంగములుండ నిండు! లేక పోవనిండు. అతఁడుకలఁడనియే నా దృఢ విశ్వాసము.

క:— భ్రమము. భ్రమము. మహాభ్రమము. లేక యతఁడే యుండిన నతఁ డొక మహా జడ పిండము. కార్యమొనరించు శక్తిలేదు. సర్వకార్యములను మనమే చేయుదుము. విడువుము. ఈ కుతర్కమున ప్రయోజనము లేదు. నేను శీఘ్రము సంసిద్ధుఁడ కావలయును. నా ప్రతిజ్ఞను నేను పాలించెదను. హిందూ రక్తము — హిందూ మాంసము — హిందూవిధ్వంసము.

(వేగముగ ప్రస్థానము)

దు:— సోదరా? ప్రసూనా!

(ప్రసూనుని ఆగమనము)

ప్ర:— బేగమ్! సోదరీ!

దు:— ప్రస్తుత ముపాయమేమి ?

ప్ర:— ఉపాయము నా జగన్నాథుఁడే కన్పఱచును.

దు:— వాస్తవము. సోదరా ! ఉపాయము నా జగన్నాథుఁడే కన్పఱచును. చూడుము. నేను ఒక్క విశ్వాస ఘాతుకుని ఒక్క రహమత్‌ని ప్రాణము నాశనము మాత్రమె కావించి యుండును కాని ఒక్క పర్యాయమే ఇరువుర విశ్వాస ఘాతుకుల నీకిరియ ప్రాణ నాశనమొనర్చుటకు ఆ జగన్నాథుఁడో లేక ఖుదాయొ కాక అన్యుఁడెవడు సమర్థుఁడగును ? ప్రకృతమున కూడ నాతఁడె ఆధారము. ఆతఁడొక్కఁడు మాత్రమె శాంతి ప్రదాత.

ప్ర:— అటుల నిశ్చింతులమై యూరకుండిన కార్యము నడువదు అతఁడుపాయమును కన్పఱచును. మనము కార్య మొనరింప వలయును.

దు:— అవును. అయిన నేదీ యొక్కపరి యా మహిమామయుని, జగదీశ్వరుని స్తుతి గీతము నొకటి గాన మొనర్పుము. ఆలించి హృదయము ప్రఫుల్లమగును !

ప్ర:— గీతము.

గాఢాంధకార సం
కలిత దుర్గమ భూమి
నునుడించి పోయెదెలా !
నానాథ !
నా పైని కోపమేల ?
ఆత్మ సంజనిత ఘో
రార్త ప్రణాదంబు
నాలింప రా వేలనో
నానాథ !

జాలిఁ జూప వదేలనో ?

( మురళీధ్వని )

అదిగో నవాబు సాహెబిటు జనుదెంచుచున్నారు.

( ప్రస్థానము. )

( కళాపహాఁడు ప్రవేశము. )

క:— ఎవరు పాడు చుండిరి ? దులియా ! ఇది ప్రసూనుని కంఠస్వరము వలె తెలియ వచ్చుచుండెను !

దు:— మీరు ప్రసూనుని కల గనుచున్నారా యేమి ?

క:— ప్రసూనుని నే నహోరాత్రములు కలగనుచున్నాను. దులియా! (అర్థ స్వగతము) సామాన్య సేవకుఁడయ్యు నావంటి పాషాణ హృదయునిపై కూడ ఎట్టి ఆకర్షణ ప్రభావమును విస్తరింపఁ జేసెను ! ఇప్పటికిని నే ననుభవించుచున్నాను. నే నాతని సేవకుని వలె నా కాతఁడు ప్రభువు వలె— ఉఁ—పోనిమ్ము. ( ప్రకాశముగ ) ప్రాణేశ్వరీ ! ప్రకృతము చాల శుభ సమాచారము.

దు:— ఏమి యా శుభ సమాచారము ? ప్రాణేశ్వరా !

క:— “ రామచంద్ర భంజు ” నాకు సహాయ మొనరింతునని దూత నంపి యున్నాఁడు.

దు:— ఎవ్వఁడీ నరాధముఁడు !

క:— నరాధముఁడు కాఁడు ! సుందరీ! ఆతఁడు ‘సారంగ గడము’న కధీశ్వరుఁడు. ముకుంద దేవుని సామంత నృపాలుఁడు.

దు:— ప్రాణేశ్వరా !

క:— నేను నీ ఆలోచన లేమియు విన నోపను. నా సైన్యము లన్నియు సిద్ధమైనవి. నేనీ క్షణముననే యాత్ర సలుప వలయును.

దు:— ఈ క్షణముననేనా ?

క:— అవును. ఈ క్షణముననె ! మఱి ఆలస్యమున ప్రయోజనము లేదు. ( ప్రస్థానము. )

దు:— ( దీర్ఘ నిశ్వాస పూర్వకముగ ) ఖుదా యొక్కఁడు మాత్రమె దిక్కు ! ( ప్రస్థానము. )

( ప్రసూనుని ప్రవేశము. )

ఫి:— ప్రసూనా ! సర్వమును వింటివి కదా !

ప్ర:— విచారించుట వలన నేమియు ప్రయోజనము లేదు. ఫిరోజా ! ఆయన తన కర్తవ్యమును పాలించు చున్నాఁడు. మనము మన కర్తవ్యమును పాలింతము.

ఫి:— కాని మన యుద్దేశమును సాధింపఁ జాలుదుమా !

ప్ర:— ఆత్మ బలి నొసంగిన నిశ్చయముగ సాధింపఁగలము.

ఫి:— మన మెల్లప్పుడు నా విషయమున సంసిద్ధులమె కదా !

ప్ర:— కేవల మాత్మాహుతి యొనర్చిన మాత్రమున ప్రయోజనము లేదు. ఏది కోమలాంగుల పక్షమున నితాంతా యోగ్యమో ఏది నారీజన పక్షమున నత్యంతానుపయుక్తమో, అట్టి కార్యమునే మన మొనరింపవలయును. అట్టి కార్యమునకే మనము సంసిద్ధులము కావలయును.

[ యోధుని వేషమున దులియా ప్రవేశము. ]

దు:— అట్టి కార్యము నొనర్చుటకే వెడలితిని ప్రసూనా ! అట్టి కార్యమునకే సంసిద్ధనై వచ్చితిని.

ఫి:— ఇది యేమి వేషము నీది బేగము సాహేబా !

దు:— ఇట్టి వేషమే ప్రస్తుత మవసరము. ఫిరోజా ! పొమ్ము. నీవు కూడ ఇట్టి వేషముననే సుసజ్జితవై యరుదెమ్ము. ఏమి సోదరా! ఇట్టి వేషము నీ మానసమునకు నచ్చుచున్నదా !

ప్ర:— చాల బాగుగ నచ్చుచున్నది. సోదరీ! ఇట్టి వేషమే ప్రస్తుత మావశ్యకము. జగన్నాథుని కార్య సాధనము కొఱకు ప్రస్తుత మిట్టి భావమె ప్రయోజనీయము. రమ్ము. ఫిరోజా! మనము కూడ ఇట్టి వేషములనె ధరించి, ప్రభు వును సంరక్షింప నుద్యుక్తుల మగుదుము. ధర్మ సహాయ మొనరించు నిమిత్త మగ్రగ సరుల మగుదుము.

దు:— కేవల మంతియెకాదు. యథా సాధ్యముగ మన యుద్దేశ్య మును పరిచార మొనర్చి, బలవృద్ధి సంపాదనమునకు ప్రియ త్నింతము.

ప్ర:— జే! జగన్నాథ స్వామికి జే!

అందఱు— జే! జగన్నాథస్వామికి జే! అల్లాహో అక్బర్!

(వీరదర్పమున, ధీరగమనమున నందఱును పోవుదురు.)

---

## చతుర్థ దృశ్యము.

### (పార్వతారణ్యము).

(సైన్యసమేతముగ రాణీ ఇందుమతి ప్రవేశము).

రాణీ:— సైనికులారా! శత్రువులు నికటవర్తులై యున్నారు. మఱి యొకపరి మీరు ఉచ్చైఃస్వరమున "జే! జగన్నాథ" రావ మున దిగ్దిగంతముల కంపిత పరికంపితమొనర్చి ఈ భూధరా పర పార్శ్వమున నిశ్చలభావమున నవస్థాన మొనరింపుఁడు.

సేనాపతి:— ఇది యెట్టి ఆదేశము—మహాదేవీ!

రా:— తెలుప సమయము కాదు సేనాపతీ!

సే:— మహాప్రసాదము.

అందఱు:- — జే! జగన్నాథస్వామికి జే!— జే! ముకుందదేవ మహారాజుకు జే!

(సైనికులు వేగముగ నిష్క్రమింతురు).

(నేపథ్యమున అల్లాహూ అక్బర్! జే! కళాపహాడు నవాబుకు జే!)

రాణీ:— ధ్వనికి ప్రతిధ్వని వెలువడినది. మఱి యీ స్థానమున నుండుట యుచితము కానేఱదు.

(వేగముగ ప్రస్థానము).

(సైన్యసమేతుండై కళాపహాడు త్వరితగతి ప్రవేశము).

క:— ఈపరి శత్రుసందర్శనము కలిగినది. (నలుగడల పరికించి) శత్రువు లెక్కడ? ఎవ్వరును కనవచ్చుటలేదే! అయిన శబ్ద మెటనుండి వచ్చినది? సైనికులారా! ఒకపరి యిటునని పరికింపుఁడు.

సై:— నడచుటకు శక్తిచాలదు. జనాబ్! ఆః! చాల దాహము!— చాల దాహమగుచున్నది.

క:— (స్వ) నా అవస్థయు నట్లేయున్నది. (ప్ర) అయిన శీఘ్రముగ జలాన్వేషణము గావింపుఁడు.

సై:— (ఇటు నటు పరువులిడి) మార్గమేదీ! జనాబ్! నల్గడల ఘోరారణ్యము. మహాపర్వత పంక్తి.

క:— (నిట్టూర్పు పుచ్చి) వాస్తవము— ఇపుడుపాయమేమి? ఎట్టి భ్రాంతిని మున్గితిని? మార్గమును గుర్తింపక కేవలము శబ్దమునె లక్ష్యమొనర్చి, శత్రువుల నేల అనుసరించితిని? రామచంద్రశిఖి మొనాయిలను కలసికొనకయె ఈ కార్యమొనర్చితి నేటికి? వారలా సాంకేతిక స్థలమున మాకొఱకు నిరీక్షించుచుందురు కదా!

సై:— నవాబు సాహెబ్! మఱి మేము సహింపఁజాలము. యీ స్థలముననె మాకు నేడు చిర అవస్థానము.

(క్లాంతి వశత కొందఱు కూర్చొనెదరు, కొందరు శయనింతురు).

క:— విషయసమస్య!

(నేపథ్యమున జే! జగన్నాథస్వామికి జే!)

క:— మఱల నదే శబ్దము. (నిరీక్షణ మొనర్చి) ఎందుండి వచ్చుచున్నది?

(సైన్యసమేతముగ రాణీ ప్రవేశము).

క:— అదిగో శత్రునివహము! సైనికులారా! ఆఁ! ఏమి ఈ భీషణ మూర్తి! ఏమి యీ రణచండికావతారము!

రా:— ఆక్రమింపుఁడు! సైనికులారా!

క:— లెండు! వీరులారా! శత్రువు సమ్ముఖ వర్తియయ్యెను. లెండు. అస్త్రధారణ మొనర్పుఁడు.

ము:— మాటాడుటకే శక్తిలేదు. జనాబ్!

ఉ:— కొట్టుఁడు. చంపుడు. మంచిసమయము.

రాణీ:— ఆగుఁడు. సైనికులారా! శత్రువులు క్లాంతులై యున్నారు. నిరస్త్రులు. కేవల మసంసిద్ధులు. వారు సంసిద్ధులగుట కవకాశ మొసంగుఁడు.

ఉ-సై:— మహారాణీ! మహారాణీ!

రా:— శాంతి వహింపుఁడు!

క:— ఎవరు నీవు? జగద్ధాత్రీరూపిణివగు జగజ్జననివా?

ము-సై:— అమ్మా! అమ్మా! దయాహృదయవై అవకాశ మొసంగితివి. ప్రాణములఁ గాపాడి పుణ్యమునఁ బొమ్ము తల్లీ! కొంచెము జలము. చాల దాహము — దుర్భరము.

రా:— సైనికులారా! తృషార్తుల మనోవాంఛ సఫలమొనరింపుఁడు.

ఉ-సేనాపతి:— వీరు శత్రువులు మహాదేవి!

రా:— కాని ప్రకృతమున కారు.

ము-సై:— అబ్బా! దాహము! దాహము! ప్రాణములు పోవు చున్నవి.

రా:— ఒసఁగుము! సేనాపతీ! తృషార్తులకు పానీయ మొసగుము. క్షుధాతురులకు ఖాద్య మొసఁగుము. ముమూర్షకుల ప్రాణముల రక్షింపుము. శత్రు మిత్ర విచారణ కిది సమయము కాదు.

ఉ-సే:— మాకడ నుండిన పానీయములు, ఖాద్య సామాగ్రియు నైపోవచ్చినది.

రా:— అయిన నా కొఱకు ప్రత్యేకింపఁబడిన ఖాద్య పానీయముల నున్నంతవరకు వీరికి పంచి యిండు.

ము-సై:— అమ్మా! అమ్మా! నీ వెవరు? మానవరూపధారిణివగు దేవీమూర్తివా? నీ వచన సుధావర్షణమున మా ఆకలి దప్పులు దూరమై పోవుచున్నవి.

(ఉత్కల సైనికులు ముసల్మాను సైనికులకు
అన్నపానము లొసంగుదురు).

క:— నయన యుగళమా! నే నెట్టి దృశ్యమును విలోకించుచున్నావు? హృదయమా! నే డేమి ఈ ప్రశాంత భావాను భవము.

రాణీ:— ఇఁక మీరు యుద్ధమున కాయత్తమయ్యెదరని తలంతును

క:— యుద్ధమా?

రా:— ఆశ్చర్యమేల?

క:— ప్రాణ ప్రదాత్రితోడ యుద్ధమా !

రా:— అయిన నీవు యోధుఁడవు కావా ? రణ నీతి నెఱుంగవా ?

క:— ఆవశ్యత కూడ లేదు. ప్రాణ ప్రదాయిని యగు జననీ సమ్ముఖమున పరాజయ మందినను, సంతానమున కెంత మాత్రము లజ్జ యొదవ నేరదు. దేవీ !

(రామచంద్ర భంజు, శిఖి మొనాయీల ప్రవేశము.)

రామ:— కాని నాకు లజ్జ యొదవు చున్నది. నవాబు సాహెబ్ ఇదియేనా మీ ప్రతిజ్ఞా పాలనము ! ఇదియేనా మిత్రు యెడ నల్పిన వాగ్దాన ప్రతి పాలనము ! వీర శ్రేష్ఠుల సామాన్య అబల సమ్ముఖమున అవనత మస్తకులగుటయా శిఖీ ! మొనాయీ ! కళాపహాఁడుని ఏదాంభి కత్వమునుగాంచి యాతని సహాయార్థ మింత దూర మగ్రిసరులైతిరి ? కళాపహా డుని ఏ సాహసమును చూచి నన్ను సహాయ మొనరింప నాహ్వానించితిరి ?

క:— (స్వ) వాస్తవము. మాయా ముగ్ధుఁడనైన నేను కర్తవ్యము నెడ నవహేళన మొనర్చితిని. (ప్ర) రాజాసాహెబ్ ! క్షమింపుఁడు. క్షణిక హృదయ దౌర్బల్యవశమున కర్తవ్య జ్ఞానమును గోల్పోయితిని. నన్ను మఱల మేల్కొలిపిన మీకు ధన్య వాదము లర్పించుచున్నాను. సైనికు లారా ! శత్రు విధ్వంసమునకుఁ దలపడుఁడు. (ఇందుమతి నుద్దేశించి) రాణీ ! ఆెచ్చపడి యేమి పరికించుచున్నావు.

రాణి:— పరికించు చున్నాను. శత్రువు మిత్రుఁడగును. మిత్రుఁడు శత్రుఁడగును.

రామ:— శత్రుత్వమును వహించుట వలననె మిత్రునికి (తనకు) మేలొదవునేని అట్టి ఆచరణమున మిత్రునియందు దోషమేమి కలదు ?

శిఖ:— ఏమియు దోషము లేదు.

మొ:— చాల పుణ్య మొదవు ననియే నా యూహ.

రాణీ:— విశ్వాస ఘాతుకు లారా !

రామ:— విశ్వాస ఘాతుకులము మేము కాము. రాణీ! విశ్వాస ఘాతుకుఁడు మీ ముకుందదేవుఁడు.

రాణీ:— విశ్వాస ఘాతుకుఁడవగు నీకే యది చెల్లినది.

రామ:— విశ్వాస ఘాతుకి యగు రాణికే యది చెల్లినది.

రాణీ:— ఇంతటి ప్రతారణమా !

రామ:— ప్రతారణము కాదు. రాణీ! ఏ న్యాయ క్రమమున విశ్వాస ఘాతుకుఁడగు ముకుంద దేవు నా సారంగ గడము నపహరించెను ? ఏ యుద్దేశమున నీ స్వాధీనుని రాజ సేవకుల కంటెను హేయముగ భావించు చున్నాఁడు ?

రాణీ:— నీ విద్రోహాచరణమును వీక్షించి ! విశ్వాస ద్రోహీ !

రామ:— నా విద్రోహాచరణమా ! ఎటుల వీక్షించెను ?

రాణీ:— ప్రస్తుతము నేను గాంచు చుండినటులనె ! ఇచటి ఎల్లరు దిలకించు చుండునటులనె !

రాము:— ఇంతటి స్పర్థయా ! అయిన యుద్ధ మాచరింపుము. ఎవ్వరిది న్యాయమో, ఎవ్వరి దన్యాయమో ఇచ్చటనే ఆ మీమాంస పరిష్కార మగుఁగాక.

రాణీ:— వినుఁడు. ధర్మరాజ సైనికులారా ! మహారాజు నేఁడిట ననుపస్థితుఁడు. అధీనస్థుఁడగు సామంత రాజు కర్మచారులును విద్రోహ మొనర్చి యున్నారు. మీ యధినాయిక ఇపుడొక సామాన్య నారి మాత్రమె. ఇట్టి క్లిష్ట సమయమున మీమీ కర్తవ్యముల మీరే యోచించు కొని కర్తవ్యపథమున నగ్రసరులు కండు.

ఉ॥సై:— ముకుంద దేవుని పక్షమున ప్రాణమొసంగి పోరు సలిపెదము. మహారాణీ! మీరేమియు చింతింపవలదు.

రామ:— ఉత్కలులారా! ఇదియేనా మీ వివేకము. న్యాయపక్షమును త్యజించి, అన్యాయ పక్షమున యుద్ధ మొనర్ప ముందంజ వైచెదరా?

ఉ॥సై:— మేము న్యాయాన్యాయముల నెఱుంగము. రాజా సాహెబ్! ఎవ్వరి యన్న వస్త్రముల మేము ప్రతి పాలితుల మగుచున్నామో, ఎవ్వరి శిక్షణమున మేము శిక్షితులమై యున్నామో, వారి పక్షముననె ప్రాణ మర్పించుటకు సంసిద్ధులము.

శిఖ:— ఏమియు భయము వలదు. రాజా సాహెబ్! మనసైన్యములు చాల కలవు.

క:— ఏమియు చింతవలదు. రామచంద్రా! నేంటి నుండియు నీవు ఉత్కలమునకు రాజువు.

రాణీ:— అగ్రిసరులు కండు. సైనికులారా! ఒక పరి జగన్నాథుని పవిత్రి నామమును స్మరించి మీ కర్తవ్య పథమున నగ్రసరులు కండు.

ఉ॥సై:— జే! జన్నాధ స్వామికి జే! జే! రాజా ముకుంద దేవునికి జే!

ము॥సై:— అల్లాహో అక్బర్! జే! నవాబు కళాపహాడునకు జే! జే! రాజా రామచంద్రికు జే!

( ఘోరముగ యుద్దము జరుగును. ముసల్మాను సైనికులు ఉత్కల సైనికుల తఱిమికొని పోవుట. )

నేపథ్యమున:— అల్లాహో! అక్బర్!

రాణి:— యుద్ధ మొనర్పుండు! సైనికులారా! పశ్చాత్పరులు కాకుండు. ఉత్కల నామమును కళంకిత మొనర్పకుండు.

ఉత్కల జాతిని కళంకిత మొనర్పకుండు. మరణింపుండు మరణింపుండు అటులనె మరణింపుండు. జయ పరాజయము లనిత్యాధీనమునిజ కర్తవ్యము నాచరింపుండు.

నేపథ్యమున:— అల్లాహో అక్బర్ ! జే ! నవాబుకు జే ! జే ! రామచంద్రకు జే !

రాణి:— "రామచంద్రకు జే !!" అసహ్యము. ఈ ప్రాణము లుండు దనుక నెన్నటికి నటు జరుగ నేరదు.

(ఉన్మత్త రూపమున పర్వెత్తును.)

ము॥ సై:— (వేగ ప్రవేశించి) భీషనారి ! ప్రచండ మహాకాళి ! అరె బాప్ రే ! అరే బాప్ ! ఖుదా ! ఖుదా !

(పలాయనము)

---

పంచమ దృశ్యము.

(దుర్గాంతర పుష్కరిణీ తీరము)

(రామ చంద్ర భంజుని భిన్న మస్తకమును గొని రాణీ ఇందుమతి ప్రవేశము.)

రా:— హాహ్హాహ్హా ! సృగాలమా !

దాని ప్రతిఫల మందితివి ! దాని యుపయుక్త శాస్తి నందితివి. మఱి నా హస్తమున నీ ప్రయోజనము లేదు. నినుంబోలు విశ్వాస ఘాతుకుని భిన్న మస్తక స్పర్శమునంగూడ పాపము సంభవించును. పొమ్ము. ఈ శుష్క భూముల దొరలు చుండుము.

(విసరి వేయును.

మిగిలినది శిఖి మొనాయిలు. వారికి కూడ నిట్టి దుర్దశ అనివార్యము.

(సైనికుని ప్రవేశము)

సై:— సర్వ నాశము. సర్వ నాశము. మహారాణీ!

రా:— ఏమి సర్వనాశము? సైనికా?

సై:— పఠానులు తిరిగి యాక్రమించి యున్నారు.

రా:— భయమేల? యుద్ధ మొనర్పుఁడు.

(ఇంకొక సైనికుఁడు ప్రవేశము)

రెం. సై:— మేము పరాజయుల మైతిమి! మహారాణీ!

రా:— లజ్జ యొదవుటలేదా! "పరాజయుల" మను పదము నుచ్చరించుటకు లజ్జ యొదవుటలేదా? ఇది ఉత్కల జిహ్వాయే యైన "విజయ" పదమునే యుచ్చరించును, లేదా చిరకాలము దనుక నిష్పందమై యుండి పోవును.

(మూడవ సైనికుని ప్రవేశము)

మూ. సై:— సేనాపతి నిహతుఁడయ్యెను. మహారాణీ!

రా:— సేనాపతి నిహతుఁడయ్యెనా? ఓ జగన్నేతా! నేనేమి వార్తల నాలించుచున్నాను!— ఏమియు భయము వలదు. సైనికులారా! నా కంఠమున జీవములుండునవఱకు మీ కేమియు భయము వలదు. అగ్రేసరులు కండు. యుద్ధ మొనర్పుఁడు. జయమునో లేక మృత్యువునో ఆహ్వాన మొనర్పుఁడు.

(పౌరకాంతల ప్రవేశము)

పౌ:— మహారాణీ! మహారాణీ! రక్షింపుము! రక్షింపుము! శత్రువులు గృహ మధ్యమున—

రా:— వీర రమణీమణులారా! శత్రుభయమున భీతచేతస్కులగుటయే పవిత్ర కర్తవ్యమా! అస్త్రధారణ మొనర్పుఁడు. వీర

దర్పమున శత్రుమారణమునకు విజృంభింతేడు. శత్రువు ప్రతిహతుండై మరలిపోవనిండు. లేదా— మన శవరాసులం గని జెచ్చువడనిండు!

క:— శవరాసులంగని జెచ్చివడి పోవలయునా? ఇంత దుర్మదాంధత్వమా! ఒక మానవుని మస్తకమును భేదింపం జాలినంత మాత్రమున నింత యహంకారమా?

రా:— కళాపహాడ్! నీ వెఱుంగవని తోంచుచున్నది. క్షత్రియ రమణి ఆత్మసమర్పణ మొనర్పం దలపెట్టిన నది ఎటుల సల్పునది నీ వెఱుంగవని తోంచుచున్నది.

క:— బాగుగ నెఱుంగుదును.— రమణీ స్వయముగ నిట ప్రదర్శింపుము— పరీక్షించెదను. సైనికులారా! బంధింపుండీ సతీ బృందమును.

(పఠాను సైనికులు బంధింప నగ్రసరులగుదురు).

రా:— జాగ్రత్త. పందలారా!

ప-సై:— (భయమున) అరె! బాప్ రె! (తొలంగి పోయెదరు).

క:— ఛీ! పురుషులై, ఆయుధ హస్తులై. సామాన్యమగు నబలకడ నింత భీతియా!

(ముసల్మాను సైనికు లస్త్రచాలన మొనర్తురు).

రా:— మఱి యుపాయములేదు. సోదరీమణులారా! ఈ నిర్మలాంబు ప్రపూర్ణ పుష్కరిణి యొక్కటి మాత్రమె ఆధారము.

క:— సైనికులారా! పుష్కరిణి చుట్టుముట్టు—

(నేపథ్యమున- సర్వనాశము. సర్వనాశము).

క:— ఏమిది? ఏమి సర్వనాశము?

(వేగముగ శిఖి మొనాయిల ప్రవేశము).

శి:— ఎవ్వరో మువ్వురు యువకు లాకస్మికముగ నరుదెంచి మన శిబిరములన్నియు కాల్చివైచిరి. పోరితిమి. మన సైన్యమున సగము సైనికులు నిహతులైపోయిరి.

క:— మీరు వీరులయ్యు నిశ్చలభావమున వీక్షించి వార్తదెలుపుట కరుదెంచితిరా ?

మొ:— నవాబు సాహెబ్ ! వారి నవతేజఃపుంజము— ఉత్సాహము గాంచినవారి నెవ్వరును మువ్వురని వచింపరు. త్రిశతమని, త్రిసహస్రమని వచించెదరు ?

క:— ఇంత శూరత్వమా ! నడువుఁడు ! సైనికులారా ! చూచెద మా యువకదళ బలపరాక్రమమును !

ము-సై:— అల్లాహో అక్బర్ !

(స్త్రీలుదక్క నందఱును నిష్క్రమింతురు).

రా:— ఇదియేమి యీ నూతన వార్త ! స్వయముగ జగన్నేత మాపై కరుణనూని ఇవ్విధమున సహాయమొనరింప నేతెంచెనా !

(నేపథ్యమున- అల్లాహో అక్బర్ !)

రా:— ఇది పఠానుల జయోల్లాసధ్వని ? ఆ యువకులు నిశ్చయముగ పరాజితులు. సోదరీమణులారా ! మఱి విలంబనమున ప్రయోజనము లేదు. మ్లేచ్ఛులాక్రమించుటకు పూర్వమే మన పవిత్ర శరీరముల నీ పవిత్ర పుష్కరిణీ గర్భమున దాచివేయుదము రండు.

పుర నారీగణము :— జే ! తల్లీ భగవతీ ! (పుష్కరిణీ మధ్యమున పడిపోవుట.

(నేపథ్యమున ప్రసూనుఁడు- జే! జగన్నాథస్వామికి జే!)

రా:— (దీర్ఘ నిశ్వాసము విడిచి) పరిహాసము! జగన్నాథ నామో చ్చారణ మొనర్చి పరిహాసము! చూఁడుడు! చనుదెంచి యవనులారా! మీచేత బంధింపబడుట కెంతమంది మిగిలి యుండిరో?

(దులియా, ప్రసూనుఁడు, ఫిరోజా ప్రవేశము).

దు:— ఎచ్చటవారు? రాణీ!

రా:— ఈ పుష్కరిణీ జలమున!

ప్ర:— రాణీ! రాణీ! (దరిఁజేరును).

రా:— (స్వ) ప్రాణేశ్వరా! ఈ జీవితమున మఱి సమ్మేళన మొదవి నది కాదు. నా దుశ్శంక కార్యరూపమున పరిణమిల్లినది. జగన్నేతా! ప్రభూ! ప్రాణేశ్వరుఁడు శత్రువుల జయించి, స్వాతంత్ర్యమును, స్వదేశమును రక్షించునుగాక!— లేక— రణమొనర్చుచు, సానందముగ స్వర్గధామమునకు వెడలిపోవుఁ గాక! ఇదియే నా కడసారి ప్రార్థనము.

దు:— రాణీ! రాణీ! క్షాంతి వహింపుఁడు. నేను దులియాను.

ప్ర:— నేను ప్రసూనుఁడను.

ఫి:— నేను ఫిరోజాను.

రా:— మీరలా! నేఁడేమి యీ రణవేషధారణులై నేఁడిట కరు దెంచిరి?

దు:— ఆశ్రియ ప్రదాత్రికి సహాయ మొనర్చుటకు.

రా:— ధన్యులు మీరు! బంధువులారా! కాని సహాయము నాకే మియు ప్రయోజనము లేదు. నా సోదరీ మణు లగ్నిగామిను లైరి. మఱి నేను విలంబ మాచరింపఁ జాలను.

( నేపథ్యమున— అల్లాహో అక్బర్ ! )

రా:— అదే ఆలింపుడు. శత్రు కోలాహలము ! అభి వాదనము ! అభివాదనము. (పుష్కరిణిలో పడిపోవును.)

(కళాపహాడు, శిఖి, మొనాయి, పఠాను సైన్యములు ప్రవేశము)

క:— రాణీ యెక్కడ ?

దు:— ఈ పుష్కరిణీ మధ్యమున—

(అందఱును పుష్కరిణి చెస నిస్తబ్ధులై ఆశ్చర్యమున పరికింతురు)

(యవనికాపతనము.)

చతుర్థాంకము సంపూర్ణము.





ఓం

# ఉత్కల పతనము.

## పంచమాంకము.

### ప్రథమ దృశ్యము.

( విరజా మందిర సమ్ముఖము. )

నేపథ్యమున:— అల్లాహో అక్బర్ !

( త్వరిత గతి ముకుంద దేవు ప్రవేశము. )

ము:— సైనికులారా ! మేల్కొనుఁడు. అప్రమత్తులరు కండు. ప్రాతఃకాలీన శకుంత కూజితములఁగలసి శాత్రవుల హుంకార ధ్వని శ్రవణ గోచర మగుచున్నవి. మఱి ఆలస్యమున కార్యము లేదు. రజనీ కాంతతో కూడ నిద్రాదేవిని విసర్జింపుఁడు.

ఉ॥ సై:— (వేగముగ ప్రవేశించి) జే ! జగన్నాథ స్వామికి జే ! జే ! గజపతి ముకుంద దేవు మహారాజుకు జే !

నేపథ్యమున:— అల్లాహో అక్బర్! జే! నవాబు కళాపహాడ్‌కు జే!

ము:— మఱి సహ్యాము కాకున్నది. రండు. సైనికులారా ! మాతృదేశ సంకీర్తన మొనర్చి నేఁటి యీ భీషణ సంగ్రామరంగమున

ప్రవృత్తుల మగుదము రండు. ఈ దివస కామినియె విజయ వార్తను దేశ దేశములకుఁ గొని పోనిండు. లేదా—మన మృత కళేబర సందర్శన మొనరించి అనంత కాళరాత్రముగ పరిణమింపఁ నిండు.

ఉ॥ సై:— జే! గజపతి మహారాజుకు జే! జే! జననీ జన్మభూమికి జే!

ము:— (తెరవంక నగ్రసరుఁడై చూచి) ఇది యేమి ఈ దృశ్యము! ఏమి ఈ లాంఛనము! జననీ! జన్మభూమీ! మాతా! నేఁడేమి నీకీ దుర్దశ! ఏదీ! సూక్ష్మ శిల్ప కార్య మండిత మందిర తోరణ ప్రదేశ మేదీ! హా! మందిర ప్రాంగణమా! నేఁడు నీ కెట్టి దుర్గతి వాటిల్లినది! మందిరమా— పవిత్ర మందిరమా! ఏదీ నీ స్థాన స్థాన వినిర్మిత లలిత విగ్రహ సురమ్య దృశ్యమేదీ! ఆహా! సర్వనాశము. నలుగడల నీ భీషణ దృశ్యమే! నలుగడల నీ హృదయ విదారణ ప్రదర్శనమే! ఆహా! అమూర్తి విచ్ఛిన్న కరపద! ఈ విగ్రహము శిరో మాత్రావశిష్ట! కళాపహాడ్! కళాపహాడ్! నేఁడు నీవెట్టి కీర్తి స్థాపించి పోయితివి!

(శిఖి మొనాయిలు ససైన్యముగ ప్రవేశము.)

శిఖి:— ఈ కీర్తి యింకను సమాప్తము కాలేదు. రాజా!

మొనా:— శ్రీ క్షేత్రమున కూడ సంపూర్ణమగుట అసంభవము.

ము:— మీ మరణాంతమున సంపూర్ణమగును. విశ్వాస ఘాతుకులారా!

మొనా:— హహ్హాహ్హా! మా మరణాంతముననా? లేక నీమరణాంతముననా?

శిఖి:— (ముకుంద దేవు నుద్దేశించి) కాదు! నీ మరణమె వాంఛనీయము! రాజా! మీ విశ్వాస పాతుడుఁడు సేనాపతి కోనీ

సింహారుఁడు. ఎవ్వని విశేషానుగ్రహ వశత నేఁడు మేము రాజద్రోహులమైతిమో, ఆ నీ కోనీ సింహారుఁడె నీకు విశ్వాస పాత్రుఁడు. అహ్హాహ్హా! ఆతఁడు సురలోకము నలంకరించెను లెమ్ము. అంతియె కాదు. రాజా! నీ అనూన ప్రియతమ నీ రాణి ఆతని ననుగమించెను. ఆమె సమాగమునకు నీ హృదయ ముత్ఫుల్లమగు చుండెను కాఁబోలు? ఆమె ఇహ ధామమున లేదు. నీ రాక కెదురు చూచు చుండును. పాపము——

ము:—— ఏమీ నారాణి మఱి లేదా! (నీరవుఁడగును.)

ఉ॥సై:—— మహారాజా! మహారాజా!

ము:—— భయము లేదు. అప్రమత్తులు కండు.—— చనుఁడు సైనికులారా! నిజ కర్తవ్యపథమున నగ్రేసరులు కండు. (శిఖి మొనాయిల నుద్దేశించి) విశ్వాస ఘాతకులారా! మీ రేమి యెఱుంగరా! ముకుంద దేవుని బాహుల నెట్టి భీషణ శక్తి కలదో మీ రెఱుంగరా!

ఈతని అస్త్ర ప్రచాలన మెట్టిదియో మీ రెఱుంగరా!

శిఖి:—— అందునకె మేము సంసిద్ధులము. రాజా!

ము:—— అయిన నాక్రమింపుఁడు సైనికులారా!

(యుద్ధ మొనర్తురు. పఠాని సైన్యములు పలాయనమగును
శిఖి మొనాయిలు పడి పోయెదరు.)

ము:—— విశ్వాస ద్రోహులారా! ఈ పరి మీ యుపయుక్త పురస్కారమును గ్రహింపుఁడు. (హత్యయొనరింప నుద్యుక్తుఁడై) వలదు. మిముఁబోలు నీచాతి నీచుల రక్త స్పర్శవలన నా హస్తముల కలుషిత మొనరింప నోపను. ఇదియును మీకు పయుక్త శాస్తి కాఁజాలదు. మీకు తగు శాస్తి ఈ యంగ

ప్రత్యంగ విహీన దేవతా విగ్రహముల దుర్దశ వంటిది. సైనికులారా ! ఈ నరాధముల బంధించి మన శిబిరములకుఁగొనిపొండు.

సై:— (అట్లు చేయుదురు.)

ము:— హా ! ప్రియా ! ఢిల్లీ నుండి తిరిగి వచ్చి నీ ప్రణయ మూర్తి సందర్శింతునని యెంత ఆశించి యుంటిని? కాని ఎవ్వరూహింపగలరు ! నిజ విశ్వాస సైనికులే యిట్టులు విశ్వాస ఘాతుకులయ్యెదరని ఎవ్వ రూహింపఁగలరు ? శత్రువుల కాపట్యమున నిట్టి దుర్దశ యొదవు నని ఎవ్వరూహింపగలరు ?

ద్వా:— (ప్రవేశించి) మహారాజా ! కటకము నుండి దూత వచ్చి యున్నాఁడు.

ము:— ఏమి దుర్వార్త వినవలయును ?—

(అందఱు నిష్క్రమింతురు.)

ద్వితీయ దృశ్యము.

శిబిరాంతర శయన గృహము.

(ముకుంద దేవు—దూత)

ము:— చెప్పుము. చెప్పుము. దూతా ! మఱి యొక పరి విని ధన్యుఁడ నయ్యెదను.— దేవి మఱి నీ వియోగమున ఖేద మొందను.— నీవు నీకుని యుపయుక్త సహధర్మిణివి. పతి లేని యెడల పత్ని కెయ్యది కర్తవ్యమో, నీవు దానినే పొనర్చి జీవయాత్రను ముగించితివి.— కాని రామచంద్రభంజు ఎంతటి విశ్వాస ఘాతుకుఁడు !

దూత:— చిత్తము. దేవా ! అతని వలననేకదా నేఁడు మాకీదుర్దశ

ము:— రామచంద్రా ! దేశీయుఁడ వయ్యు నీవు నేఁడు మాతృదేశము నెంత విధ్వంస మొనర్చితివి ! నీకు నా యెడ

నెంతైన వ్యక్తిగత విద్వేష ముండెనా దానికి ప్రతిక్రియగ నన్ను వినాశ మొనర్చి యుండిన బాగుండునే ! కాని నేడు నీ వేమి గావించితివి ? అమాయకులు నిర్దోషులు నగు దేశీయుల రక్త ప్రవాహమున స్వదేశమును ప్లావిత మొనరించి వైచితివి. దేశీయుల పరమ ధనము, శ్రేష్ట గౌరవము పూజనీయమగు స్వాతంత్ర్యమును, శత్రు కబళమున నిపాతిత మొనర్చి వైచితివి. సర్వ శ్రేష్ఠమును, హైందవుల గర్వ ధనమును అగు నా సనాతన ధర్మమును అధర్మ ద్రోహుల క్రీడా సామగ్రిగ నొనర్చి వైచితివి.— చనుము గూఢచారీ ! సైన్యములు సంసిద్ధములగు నటు లాదేశింపుము. నే నీ క్షణమున దండయాత్ర సలిపెదను. స్వరాజ్యము, స్వధర్మము నిటుల హైన్యగతి ననుభవించు చుండుట మఱి సహింపఁ జాలను.—

దూ:— మహారాజా ! ప్రకృతము చాల రాత్రి యతిక్రమించినది. ప్రభాతమగు పర్యంతము నోర్చి యుండుట శ్రేయస్కరము.

ము:— ప్రభాత పర్యంతమేనా ? ఇంత దీర్ఘ కాలము సహ్యము కాకున్నయది. చనుము. నా యాజ్ఞను పాలింపుము.

( దూత ప్రస్థానము. )

ము:— కళాపహాడ్! కళాపహాడ్! నీ వొక దినమున హిందువుఁడవై యుంటివి కదా !— నిష్టా పరుఁడవై పవిత్ర భావమున హిందూ ధర్మాచరణ మొనరించుచుంటివి కదా ! నేఁడు నీ దేమి యీ ఘోర కృత్యము ? నీ ఆ హిందూ ధర్మముయొక్క సర్వ నాశము ఆ హిందూ జాతముయొక్క సర్వనాశము నీ పరమ వ్రతమా ! ( సైనికులు దైన్య భావమున ప్రవేశము.) ఇదిగో సైనికు లరుదెంచిరి. సైనికులారా ! నే నీ క్షణమున నె జైత్ర యాత్ర సలిపెదను. మీరు సంసిద్ధులె కద !

సై:— (దైన్య భావమున) మహారాజా! శ్రీవారి ఆదేశము శిరోధార్యము!

ము:— ఏమది! మీ కార్యోత్సాహములు కాన రావేమి?

సై:— మహారాజా! నేడు మేము అత్యంత క్లాంతి ననుభవించు చున్నాము.

ము:— క్లాంతి ననుభవించు చున్నారా? అగునది సహజము. (స్వగతము) ఏమాశ్చర్యము! నేడు నే నెంతయో క్లాంతుఁడనై యుంటిని. స్వదేశ చింతనము వలన నదంతయు మఱచి పోయితిని. (ప్రకాశముగ) సరియే. సైనికులారా! మీ రెల్లరు సుషఃకాల పర్యంతము విశ్రమింపుఁడు. పొండు.

సై:— జే! రాజా గజపతికి జే!

(పోవుదురు.)

ము:— నేను కూడ కొంచెము విశ్రమించెదను. సప్త దీర్ఘ కాళరాత్రముల జాగరణముపైని నేఁడే ప్రథమనిద్ర. (ప్రస్థానము)

అదే రంగము.

(శిఖి—మొనాయిలు మెల్ల మెల్ల ఛురికా హస్తులై ప్రవేశము.)

శిఖి:— అరె! మెల్లగ! మెల్లగ!

మొ:— అరె భాయీ! ఎక్కడ పరుండి యున్నాఁడో చూతము రమ్ము.

శిఖి:— ఇస్! చూప్! నేను చూచెద నుండుము.

మొ:— నిశ్వాస మధికముగ విన వచ్చుచున్నది. ఏమియు భయము లేదు. గాఢ నిద్ర.

శిఖి:— ఇదియే ఆతని పెద్దనిద్ర.

ము:— భాయీ ! నాకు కత్తినిమ్ము. నా జీవితాభిలాషమును నేనె నేఁడు పూర్తి జేసెదను.

శిఖి:— వలదు. ఈ చేతులతోడనే వధింపనిమ్ము. చూడలేవా ? ద్వారపాలకుని రక్తపాలన మొనర్చిన యీ ఖడ్గము మరల రక్తలాలసమున నెట్లు దృఢతర ముష్టిబద్ధమై యున్నదో !

ము:— అన్నా ! అన్నా ! నేఁడేమి యీ భీషణమూర్తి !

శిఖి:— ఇస్ ! చూప్! శీఘ్రముగ కార్య మంత మొనరింతుమురమ్ము.

(ప్రస్థానము.)

నేపథ్యమున ముకుందదేవుఁడు:— హా ! ప్రాణములు పోయినవి. నా అభిలాషము నెఱవేఱినది కాదు. జగన్నాథ స్వామీ ! నీ ఇచ్ఛ ప్రపూరిత మగుఁగాక.

---

## తృతీయదృశ్యము.

### పూరీ నగర వీథులు.

(నాగరికుల ప్రవేశము.)

1-నా:— అన్నలారా ! పదండు. పారిపోవుదము. మఱి యీ స్థానమున నిలువఁజాలము.

2-నా:— అయిన నన్నలారా ! కొంచెమాగుఁడు. ఇంట నేను వెండి బంగారము చాల విడిచి వచ్చితిని. కొనివచ్చెదను.

1:— భేష్ ! వెఱ్ఱిము. ప్రాణములుకూడ అర్పించి రమ్ము.

2:— ప్రాణార్పణమా ! ఈ అమూల్య ప్రాణార్పణమా ! బ్రిది యుండిన బలుసుకూర తిందము. పదుఁడు. పారిపోదము.

3-నా:— అన్నలారా ! నా సతీసుతు లుండిపోయిరి.

1:— ఉండిపోయిన నేమి చేయుదువు? వారి నుదుటివ్రాత వా రనుభ వించెదరు. మన ప్రాణములు ముందు నిలువనిమ్ము.

(నేపథ్యమున- అల్లాహూ అక్బర్! జే! నవాబు కళాపహాడ్‌కు జే!)

అందరు:— అమ్మయ్యో! అదిగో వచ్చెను. కళాపహాడు!

(పలాయనోద్యుక్తులయ్యెదరు. దులియా, ప్రసూనుఁడు,

ఫిరోజా ప్రవేశించి అడ్డెదరు).

ప్ర:— నిలువుఁడు. సోదరులారా! నిలువుఁడు.

అం:— జోహారు నవాబు సాహెబ్! మా ప్రాణముల రక్షింపుఁడు.

1:— హే మహాప్రభువులారా! నా సర్వమును గైకొనుఁడు కాని, నన్నుమాత్రము వధింపకుఁడు.

2:— నా వెండిబంగారముల సర్వము తీసికొనుఁడు. నన్నుమాత్రము బ్రిదుకనిండు.

3:— నా పెళ్ళము పిల్లలనందఱను తీసికొనుఁడు. నన్నుమాత్రము బ్రిదుకనిండు.

పు:— ఏమంటిరి? భ్రాతృగణములారా! ఈ తుచ్ఛ జీవనముల కొఱకు నిజ పుత్రమిత్ర కళత్రాదుల శత్రుముఖమున బలి యొసంగఁ దలంచితిరా? నిజ మనుష్యత్వమును కాలగర్భ మునఁ గలిపివైచితిరా? ఛీ! మీ మానవత్వమునకు ధిక్కార మగునుగాక! మీరు మానవులా, లేక మానవరూపధారు లగు పశువులా? హేయమగు ఆత్మసౌఖ్యమున కాశించి, నిజ వివేకమును జడతుల్యముగ గణించి, మీ సర్వస్వము- స్వ రాజ్య సర్వస్వము- స్వమత సర్వస్వము- విధ్వంస మొనర్పఁ దలపెట్టితిరా? ఛీ! ఛీ! మీ మానవత్వమునకు ధిక్కార

మగునుగాక! మీ హేయ జీవితములకు ధిక్కారమగును గాక!

(అందఱును భయవిహ్వాలులై, పరస్పర విలోకనమున ముగ్ధులై యుందురు).

దు:— భయము వలదు. సోదరులారా! మేము మీ మిత్రులము. హితైషులము.

నాగరికులు:— మిత్రులా?

దు:— అవును. మిత్రులము. సోదరులారా! మీ సాయము నపేక్షించుచున్నాము.

నా:— సాహాయ్యమా! మాకడ నేమియు లేదుకదా!

దు:— ఏమియు లేదా! మీకడ సర్వస్వమును కలదు. సోదరులారా! దేహమున శక్తిగలదు. హృదయమున సాహసము కలదు. మానసమున దృఢత్వము కలదు. మేమీ సాహాయ్యమునే కోరెదము.

నా:— మహా ప్రభువులారా! మాకవి యేమియు లేవు. మమ్ము నింతటి సంకటముల నెందులకు ద్రోయం జూచెదరు?

దు:— ఎందులకా? మీరు జన్మాంధులా లేక బధిరులా? కను పడుట లేదా? మీ యీ స్వరాజ్యము— మీ వాసగృహము లెటుల ఆభీల జ్వాలా కరాళాగ్నిం బడి పరశురామప్రీతియగు చున్నవో— అదే పరికింపుఁడు. మీ పవిత్ర దేవమందిరములెల్ల ధ్వస్త విధ్వస్తములై స్మశానభూమి ననుకరించుచున్నవియో— అదే వినపడుట లేదా! మీ పుత్రమిత్ర కళత్రముల ఆర్త ప్రణాదమున మేదినీ మండలమెటుల ప్రకంపితమై పోవుచున్న దియో— గగనమెటుల విదీర్ణమై పోవుచున్నదియో! లెండు. ప్రబుద్ధులు కండు. అస్త్రధారణ మొనరింపుఁడు. కర్తవ్యమును నిర్వహింపుఁడు.

నా:— ఎవరు మీరు ? మా అంధకార యవనిక సడలించిన మహా పురుషులు మీ రెవరు ?

(నేపథ్యమున- అల్లాహూో అక్బర్ !)

దు:— అదే ఆలింపుడు. శాత్రవుల జయోల్లాసధ్వని! రండు! శక్తివంచన లేక శత్రునివారణ మొనరింతము రండు !

నా:— చిత్తము !

ప్ర:— అయిన పల్కుడు. ముక్తకంఠమున నందఱొక్కపరి జే! జగన్నాథస్వామికి జే !

అందఱు:— జే! జగన్నాథస్వామికి జే!

(అందఱు వేగముగ పోవుదురు).

---

## చతుర్థదృశ్యము.

(జగన్నాథస్వామి మందిరము)

(ఆయుధహస్తులై పండాలు శంకాభావమున నిలచియుందురు.)

ప్ర.పండా:— అన్నా ! మఱి రక్షణమార్గము లేదు. ఇదిగో యవనులు క్రమక్రమముగ నికటవర్తులగుచున్నారు.

ద్వి.పండా:— శత్రుసైన్యము సముద్ర తరంగములవలె వచ్చి పడుచున్నది.

నేపథ్యమున:— అల్లా హూో అక్బర్ !

తృ.పండా:—జగన్నాథస్వామీ ! ఇక నిన్ను నీవే రక్షించుకొనుము. దేవా ? మఱి మాకు సామర్థ్యము లేదు.

(పలాయనోద్యుక్తు లగుదురు.)

( నగరవాసులతో ప్రసూనుఁడు దులియా ప్రవేశము )

దులియా:— మంచి సామర్థ్యము కలదు. సోదరులారా! మీరు మీ యిష్టదైవ నామోచ్చారణ మొనర్చి యిష్టదైవ కార్యమున తత్పరులు కండు.

పండాలు:— ఎవరుమీరు? మీరేమి దైవ ప్రేరితులా?

ప్ర.పం:—అన్నా? నిశ్చయముగ వీరు జగన్నాథ ప్రేరితులు.

అందఱు:— జేయ్! జగన్నాథస్వామికి జే!

నేపథ్యమున:— అల్లా హూ అక్బర్!

( సైన్య సమేతముగ కళాపహాడ్ ప్రవేశము )

క:— వృథా ఆశ! హిందువులారా! వ్యర్థప్రయాసము!! పదదళిత కాలసర్ప విష దంష్ట్రా దంశనమునుండి నేఁడు మీరు రక్షింపఁ బడియెదరా? ప్రజ్వలితాభీల క్రోధాగ్ని గ్రాసమునుండి నేఁడు మీ ఆరాధ్య దైవమును రక్షింపఁ గలిగెదరా? అసంభవము— అనివార్యము — నిర్నిరీక్ష్యము — వీక్షింపుఁడు. చతుర్దిగము లెటుల భీషణ శ్మశానముగ పరిణమించినవో! హిందూ శవాలింగనమున భారాక్రాంతయై పృథ్వీధామ మెటుల నల్లాడి పోవుచున్నదో, హిందూశీతల రుధిర స్రవంతుల నీ యగాధ వంగోప సాగర మెటులు రక్త రంజితమై పోయినదో; వినుఁడాదెస! హిందువుల హాహా కారరావము గంభీర సముద్ర గర్జనమును ప్రతిహత మొనర్చి, గగన పృష్ఠమున నెటుల ప్రతిధ్వనిత మగుచున్నదియో, హిందువుల పవిత్ర దేవ మందిరములు శంఖ, ఘంటారావములకు బదులుగ, పిశాచముల భయానక కరతాళాట్టహాస ధ్వానములు నెటుల విజృంభించుచున్నవియో, వృథా! ఆశ!— హిందువులారా! ఇఁక వ్యర్థప్రయత్నము!!

పండాలు:— రక్షింపుఁడు — రక్షింపుఁడు నవాబ్ సాహెబ్! మా సర్వస్వమును ధ్వంస మొనర్పుడు. కాని ఈ మందిరమును మాత్రము రక్షింపుఁడు.

క:— అహ్హాహ్హా! మం రమును రక్షించుటయా? ఈ మందిరమును రక్షించుటయా? ,ఏ మందిరమువలన నీశ్రోత్రియ బ్రాహ్మణుఁడు చండాలునిగ పరిణమించి యున్నాఁడో ఆ మందిరమును రక్షించుటయా? అసంభవము— అనివార్యము— అప్రతిహతము.

ప్ర:— నవాబు సాహెబ్! దోషుల దండవిధానము నాచరింపుఁడు. అకారణముగ మందిరమును ధ్వంస మొనర్చెద రేటికి?

క:— (స్వగతమున) ఎవఁడీ యువకుఁడు? (ప్రకాశముగ) ఇదియే దోషుల దండన విధానము.

దు:— కాదు. ఇది హిందూ ధర్మమునెడ దండన విధాన మగుచున్నది.

క:— అవును. అదియె ప్రధానోద్దేశము— హిందూరక్తము హిందూ మాంసము— హిందూవిధ్వంసము—

దులి:— నవాబ్ సాహెబ్!

క:— మఱి నేనేమియు విననోపను. నా ప్రతిజ్ఞ నేను పాలింతును. సైనికులారా! చూచెద రేమి? మందిర మధ్యమున ప్రవేశింపుఁడు. ప్రతి దేవ దేవీ విగ్రహమును ఖండ ఖండములుగ నరికి వేయుఁడు. హిందువుల ఆ పరమ ధనము, ఆరాధ్య దైవము, జగన్నాథ విగ్రహమును పెటికికొని రండు— హిందూశిల్ప నైపుణ్య ప్రభాసితమగు నీ మహామందిరమును సమతల భూప్రదేశముగ పరిణతము గావించి వేయుఁడు.

ప్ర:— కాని, మా కంఠముల ప్రాణవాయువు లున్నంతదనుక నసాధ్యము. నవాబ్ సాహెబ్! అసాధ్యము! అసంభవము.

క:— ఏమీ యింతటి కండకావరమా? మృత్యుముఖమున చెలగాటమా? మత్తమృగేంద్రముతోడ పరిహాసమా? అయిన మరణమునకు సిద్ధుఁడవుకమ్ము.

(యుద్ధమగును. పండాలును, నాగరికులును
పలాయన మొనరింతురు.

క:— మఱి యింకేటికి సాహసము? యువకులారా! నిరస్త్రులు కండు.

ప్ర:— నిరస్త్రుల మగుటయా? అస్త్రధారణమునకు శక్తియుండు దనుకనా?

(యుద్ధ మొనర్తురు. కత్తివేటుతగిలి ప్రసూనుఁడు పడిపోవును).

క:— సైనికులారా! చూచెద రేమి ప్రవేశింపుఁడు!

దు:— నా జీవముండుదను సైనికులు ప్రవేశింతురా?— అసంభము.

క:— (స్వగత) ఎవ్వరీ యువకుఁడు? నా కన్య క్తముగ ననుకంప యొదవుచున్న దేటికి?— (ప్రకాశముగ) యువకుఁడా! నీ సంగఁడీని దశపరికించితివికదా! తొలఁగుము. ఏల వృథా ప్రాణములఁ గోల్పోయెదవు?

ప్ర:— (పడియుండియె) సోదరా! దేహమున శక్తియుండుదనుక, హృదయమున సాహసముండుదనుక, సూచ్యగ్రభూమికూడ నగ్రిసరుని కానీయకుము.

దు:— నా ప్రతిజ్ఞ, నా ప్రాణములుండుదనుక పాలించెదను. సోదరా! చింతింపకుము.

క:— మఱి క్షంతవ్యుఁడవు కావు. సైనికులారా! ఆక్రమింపుఁడు.
(సైనికు లాక్రమింతురు. కళాపహాడ్ ఖ మున దులియాను
పొడిచి మందిరమధ్యమున ప్రవేశింతురు).

ఫి:— (వేగప్రవేశించి) సఖీ! సఖీ!—

దు:— (క్రిందపడి) హా! ప్రాణములు పోయినవి! ప్రాణేశ్వరా!
నేను ధన్యురాలను. నీ హస్తమున ప్రాణమర్పింపఁ జాలితిని.-
ఆః! దాహాము— బాధ!— ఫిరోజా! కొంచెము దాహాము.

ఫి:— ప్రసూనా! ప్రసూనా! చూడుము. చూడుము నా సఖి దుర
వస్థను. (దుఃఖము).

ప్ర:— (కొంచెము లేచి) సోదరీ! సోదరీ! హా!—

దు:— కొంచెము నీరము— ప్రసూనా! కొంచెము నీరము— ప్రాణే
శ్వరా!

ప్ర:— శత్రుబృందమేదీ! అదిగో కోలాహలము వినిపించుచున్నది.
ఫిరోజా! నెచ్చెలిని పట్టుకొనుము— నాకు శక్తి యుడుగు
చున్నది— ఈ స్థానము నిరాపదముకాదు.—
(దులియానెత్తి ఫిరోజా పట్టుకొనును, మెల్లగ వెనుక
ప్రసూనుఁడురా, నందఱు నిష్క్రమింతురు).

——[*]——

పంచమదృశ్యము.

(సాగరతీరము.)

(చితాగ్ని ప్రజ్వలించి మండుచుండును. హిందువు లందఱు
భయవిహ్వలులై చూచుచుందురు. ముసల్మానులు సానందులై జగ
న్నాథ విగ్రహాముసు పట్టుకొని కళాపహాడ్ ప్రక్క నిలిచి
యుందురు).

క:— జ్వలింపుము! జ్వలింపుము! కరాళ చితాగ్నిహోత్రమా! మఱియు భీషణకీలికవై జ్వలింపుము! హిందూఅస్థువుల నమలితివి— హిందూ తప్త రుధిరమును పానమొనర్చితివి — ఇపుడు హిందూ మజ్జాశ్వాసన మొనరింపుము — నీ కరాళాభీల జ్వాలికకూడ శాంతి వహించును. లెండు. సైనికులారా! చితాగ్ని చిటపటధ్వానమున, గగన చుంబిత కరాళజిహ్వా విజృంభితమై ప్రజ్వరిల్లినది. లెండు. వేగనందు విసరి వేయుఁడు. హిందువుల గర్వధనమును, హిందువుల ప్రాణాధిక ప్రాణమును, ఆ జడపిండకాష్టపుత్తలికను, ఆ చితాగ్నిహోత్రి మధ్యమున విసరివేయుఁడు. నిమిషమాత్రమున నా హిందువుల సర్వస్వమును భస్మీభూతమై పోవును. నామరహితమైపోవును. భిన్ననిర్మూలనమై పోవును. నా హృదయ వాంఛ, నా భీషణ దృఢప్రతిజ్ఞ ప్రపూరితమైపోవును.

ము. సై:— అల్లా హో అక్బర్

హిం:— హా! హా! జగన్నాథ! జగన్నాథ!

ము. సై:— ( మఱల "అల్లా హో అక్బర్" ధ్వానమున చీత్కారమొనర్చి జగన్నాథ విగ్రహమును చితాగ్నినిఁబడ వేయుదురు.)
( హిందువులు జగన్నాథ నామ స్మరణను రోదింతురు. )

( ప్రసూనుని త్వరితగతి ప్రవేశము )

ప్ర:— వృథా క్రందనము నిష్ప్రయోజనము? ( అగ్నిమధ్యమునదుమికి తటాలున విగ్రహమునుగొని పైకివచ్చి ) రక్షింపజాలితిని ప్రభూ? కొనిపొండు స్వామిని సోదరులారా!
( హిందువులకు విగ్రహము నిచ్చివేయును. )

హిందువులు:— (విగ్రహమును కైకొని) జే! జగన్నాథ స్వామికి జే!
( పలాయనము) అందరు రిచ్చవడి చూతురు.

ప్ర:— అః ! మఱి నిలువ జాలను (పడిపోవును.)

క:— ఎవరు ? ఎవరీ అద్భుత బాలకుఁడు.

ప్ర:— ప్రభూ !

క:— ఆఁ ! ప్రసూనుఁడా ?

ప్ర:— (పగిడీ తీసివైచి) ప్రాణేశ్వరా ! (పాదము లంటిపడిపోవును.)

క:— ఏమీ ? ఈమె తిలోత్తమ ? తిలోత్తమా ! తిలోత్తమా! ప్రాణేశ్వరీ ! (అగ్రసరుఁడగును)

తి:— ప్రాణేశ్వరా ! ఈ దాసి కార్య మంత మైనది. ఈ దాసికిఁక శెలవొసంగుఁడు !

క:— సెలవా ?

తి:— మఱి ఉపాయము లేదు—

క:— ఉపాయము లేదా ?

తి:— వృథా ఖేదమును పరిత్యజింపుఁడు ప్రభూ ! ఈ దాసియెడ కించి దనుగ్రహ ముండిన, ఈ దీనురాలికి క్షమా భిక్షనొసంగి శాంతి ప్రదానము గావింపుఁడు.

క:— శాంతి భిక్షా ప్రదానము గావింతునా ? ఈ అశాంతి భార హృదయమును ధరించియా !

తి:— ప్రభూ ! ఈ నృశంస కార్యము నుండి యిఁక నివృత్తులుకండు. దీనబంధుఁడగు జగన్నాథు కృపా ప్రార్థన గావింపుఁడు. ఈ అశాంతి అచిరకాలమున లుప్తమై పోవును.

క:— అసంభవము !— ఎవ్వని ప్రఫుల్ల హృదయుఁడు ప్రభు భక్తి యుక్తుఁడు ప్రసూనుఁడు లేఁడో ఆతనికిఁక హృదయశాంతి అసంభవము. ఎవ్వని ధర్మ నిష్ఠ, కర్మ పరాయణ, తిలోత్తమ లేదో అతని కిఁక చిత్తశాంతి, అసంభవము.

తి:— పతిభక్తి పరాయణ, శేపీతుల్య, దులియా యుండుదనుక సర్వము సంభవము. ప్రాణేశ్వరా ! హా ! దులియా ! నా ప్రియ సోదరీ ! నిన్నొకపరి యీ అంతిమకాలమునఁ గాంచ లేక పోయితిని.—

(ఫిరోజా భుజము నానుకొని దులియా ప్రవేశము.)

దు:— ఏఁడీ సోదరుఁడు ? ఫిరోజా ! ఇదిగో ప్రాణేశ్వరుఁడు ! ఈ దాసి దెంతటి అమూల్య భాగ్యము ! స్వామి శ్రీచరణ సందర్శన మొనరించి ప్రాణముల బాయఁజాలెను.

క:— ఎవరిది ?

దు:— ప్రాణేశ్వరా ! (పగిడీ తీసివేయును.)

క:— ఇచటి కెటుల వచ్చితివి ? దులియా ! నీదేమి యీ వేషము- నీదేమి యీ దుర్దశ.

దు:— ఇది నా సుదశ ప్రభూ ! హృదయేశ్వరుని యీ దృశదుర్దశా సందర్శనముకంటె పత్నిపతకముని నిది సుదశ ప్రభూ ! ఆః ! మఱి జీవింపఁజాలను. మఱి కూర్చొనఁజాలను. ఫిరోజా !— ప్రసూనా ! హా ! సోదరా ! (పడిపోవును.)

క:— దులియా ! దులియా !— వలదు— తిలోత్తమా— వలదు—

దు:— తిలోత్తమయా ?— ఏదీ ?

తి:— ఇదిగో ఇచ్చట ! సోదరీ !

దు:— ఏదీ ? ఇతఁడు ప్రసూనుఁడు— ప్రసూనా ! ప్రసూనా !— ఇదేమిది ? ఈమె స్త్రీ—

తి:— నీ సోదరి తిలోత్తమను గుర్తింపఁజాలవా ? సోదరీ !

దు:— నీవేనా తిలోత్తమవు ? సోదరీ ! సోదరీ !— నీకును నా దశ యేనా ?— సోదరీ ! సోదరీ !—

(పడుకొని యే పరస్పరము నిరువురు నాలింగన మొనర్చుకొనుట)

— రము! సోదరీ! మన కర్తవ్యమంత్యమైనది. ఇపుడు శాంతి
ప్రదాత నాశ్రయింతము— రమ్ము!— ప్రాణేశ్వరా! ఈ దాసీ
ద్వయమునకు సెలవొసంగుఁడు— జగన్నేతా! హృదయేశ్వ
రునికి సుమతి ప్రదానము గావింపుము.

(మృత్యువు).

దు:— ప్రియతమునకు మంగళమగుగాక— సెలవు. ప్రాణేశ్వరా!

(మృత్యువు).

(మూర్ఛ)

షి:— హా! సఖీ! సఖీ!

క:— హాహాహా! హాహా! అందఱు నిశ్చింతితులు — కళాపహాడ్ సైతము
నిశ్చింతితుఁడు. (శూన్యమునుగని) ఎవరు నీవు? నీకు భయము
లేదా? కళాపహాడుకడ నీకు భయము లేదా? చూడుము.
చూడుము. పరికింపుము. ఈ హస్తమున హిందూ రక్తము—
ఈ హస్తమున హిందూమాంసము— ఈ హస్తమున హిందూ
విధ్వంసము— ఈ హస్తమున తిలోత్తమ రక్తము— ఈ హస్త
మున దులియా!— భయము లేదా నీకు?— ఇదేమి ఏమి యీా
మూర్తి?— భీకరదంష్ట్రా కరాళవదనము భూమ్యాకాశముల
దనుక తెఱచి కబళించుటకు పరువున వచ్చుచున్నది!—
ఆగుము— ఆగుము— కొంచెమాగుము— (కనులు మూసికొని)
ఇదేమీా అట్టహాసము?- ఏమి యీాఆర్త ప్రణాదము?- ఊర
కొనుము- ఊరకొనుము- (చెవులు మూసికొనును) ఇదేమీా
సంకటము?- ఏమి యీాభీషణ వేదన?- శాంతింపుము- శాం
తింపుము- (హృదయము నడచి పట్టికొని) వలదు- వలదు.
ఈ ధామము నంద సంభవము. ఈధామము నంద సంభవము.

(వేగముగ ప్రస్థానోద్యుక్తుఁడగుతరి ముకుందదేవుని భిన్నమస్తక
మునుగొని శిఖి మొనాయిల ప్రవేశము.)

శిఖ:— ( భిన్నమస్తకమును గన్పఱచి ) ఈ ధామమున సర్వ...
సంభవము నవాబ్ సాహెబ్ !

క:— ( భయకంపితుఁడై దూరము తొలగిపోవును. )

మొ:— భయమువలదు నవాబ్ సాహెబ్ ! ఇది మృత మస్త
కము.

క:— మృతమస్తకమా !— మృతమస్తకమా ! ఇది జీవించి యున్నది? ఏమి యీ పైశాచిక భయానక దృష్టిపాతము ! ఏమి యీ అధర దంశన స్పందనము !! ( కనులు మూసికొని ) కొని పొండు నా సమ్ముఖమునుండి ఆవలకు గొనిపొండు.

శిఖ:— కొనిపోవుటయా ! పురస్కారము నందకుండగనే కొనిపోవుటయా ?

మొ:— కాదు. ఎంతమాత్రమును వలదు.

క:— అయిన కొని పొండు. సైనికులారా ! ఈ రాజద్రోహులను జాతి మత ద్రోహుల నిరువురకును, తగు పురస్కార మొసంగి కొని రండు.

శిఖ- మొనా:— నవాబ్ సాహెబ్ !

క:— కొని పొండు. శీఘ్రము నాసమ్ముఖమునుండి కొనిపొండు.

( సైనికులు శిఖ, మొనాయిల లాగికొని పోయెదరు. )

కళా:— హాహాహా ! ఎట్టి పురస్కారము !— ముకుందా ! చూడకుము ! ఇట్టి భీభత్సముగ చూడకుము.— నేను హిందూ ద్రోహిని కాను ! నేను హిందూ రక్త లోలుపుఁడను కాను.— దులియా ! మెల్లగ చెప్పుము.— చీత్కార మొనరింపకుము.— నేను పత్నీ ఘాతుకుఁడను కాను.— నేను నర పిశాచమును కాను.— తిలోత్తమా ! వినమితవు కమ్ము.— తిరస్కార మొనరింపకుము— నేను స్త్రీ పరిత్యాగుఁడను కాను— నేను ధర్మ త్యాగుఁడనుకాను — ( ఆగి ) ఏమిది ? ఏమి వినఁబడు

చున్నది ?– నేను స్త్రీ త్యాగినా ?– నేను స్త్రీ హత్యా
కారినా ?– నేను ధర్మత్యాగినా ?– ఇదేమి ?– ఏమి చూచు
చున్నాను ? ఇది ప్రజ్వలితాగ్ని కుండము– ఇది తప్త తైల
పూర్ణ కటాహము— నా కొఱకు— నా దండన కొఱకు ?
అసంభవము ! అసంభవము !! నేను దోషినా ? నన్ను దం
డించుటకు ? నేను పాపినా ? నన్ను శిక్షించుటకు ? నేను
నిర్దోషిని— నాకు నిష్కృతి ఆవశ్యకము !— నేను ధర్మా
త్ముఁడను— నాకు పురస్కార మావశ్యకము.

(శిఖిమొనాయిలభిన్న మస్తకములగొని సైనికుల ప్రవేశము.)

సైని:— ఇదే స్వీకరింపుఁడు తమ పురస్కారము.

(శిరము నటనుంచి పలాయనము.)

క:— నా పురస్కారము ఎవ్వరికిని అధికారము లేదా ? ఎవ్వరికి
సాధ్యము కాదా ? మత్సరము కలుగుచున్నదా ? నా వంటి
యుపయుక్తులు కాఁజాలుదురా ? నావలె కర్తవ్యపరాయ
ణులు కాఁజాలుదురా ? హాహ్హాహ్హా ! కాఁజాలరా ? సామర్థ్య
ము లేదా ? అయినచో భయ మెందులకు ? మత్సర మెందులకు ?
ఊరక చూచిపొండు– తిలోత్తమ శవము నా పురస్కారము–
మలియా మృతకళేబశిరము నా పురస్కారము– శిఖి మొనా
యిల భిన్న మస్తకములు, నా పురస్కారము. ముకుందదేవుని
మృతమస్తకము నా పురస్కారము. హిందూ శిల్పనాశము
నా పురస్కారము. హిందువుల స్వాతంత్ర్య నాశము నా పుర
స్కారము.

(యవనికాపతనము

సమాప్తము

